*Issued*— 26-2-1957




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

WEDNESDAY, the 14th MARCH, 1956

**VOLUME IV—No. 3**

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Wednesday, the 14th March, 1956.**



The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr Speaker (The Hon Sri R Lakshminarasimham Dora) in the Chair

## I QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTION

*Location of the Office of the Regional Inspector of Local Boards*

520-A —

* S N Q No 1172-D Q .- Sri T LAKSHMINARAYANA REDDI — Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) whether it is a fact that the old Taluk Board Office building at Rajahmundry is vacant , and

(b) if so, whether the Government intend to locate the Regional Inspector of Local Boards' Office in it ?

The Hon. Sri A B NAGESWARA RAO :—

(a) The answer is in the affirmative.

(b) The Government do not intend to locate the office of the Regional Inspector of Municipal Councils and Local Boards, Northern Range, in the buildings, as it is not adequate enough to accommodate the offices of the Regional Inspector of Municipal Councils and Local Boards and the Assistant Engineer for Panchayat Works together with their establishments

Sri T. LAKSHMINARAYANA REDDI :— అధ్యక్షా ! ఈ బిల్డింగు ప్రభుత్వంవారిదే చాలా కాలమునుండి కాళీగాఉన్నది. ఇది కొంకపోయినా మరేది అయిన అక్కడపెట్టి ఈ ఆఫీసు private building లో పెట్టకుండా చేస్తారా ?

The Hon Sri A B. NAGESWARA RAO :— సబ్ కలక్టరు కు మ్యునిసిపలు కమీషనరుకు వ్రాసినాము. అది చాలదు. వేరే భవనం అద్దెకు తీసుకోడానికి కూడా నిశ్చయం జరిగింది.

Sri S NARAYANAPPA .— రాష్ట్రం మొత్తంలో ఈ Regional Inspector ఆఫీసులు ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు తరలించే ప్రయత్నము చేస్తారేమో మంత్రిగారు శలవిస్తారా ?

The Hon Sri A. B. NAGESWARA RAO — మార్పడానికి ప్రయత్నములు ఉన్నవి. ఇదివరకు రెండు రీజినలు ఆఫీసులు ఉండేవి, ఇప్పుడు మూడు చేశారు

Sri M NAGI REDDI — చిత్తూరునుంచి వచ్చిన తరువాత Central Region ఇంకా బెజవాడలోనే ఉన్నది. ఎప్పటికి గుంటూరులో ఏర్పాటుచేస్తారు?

The Hon Sri A. B NAGESWARA RAO :— గుంటూరులో సరిఅయిన భవనము దొరకలేదు. భవనము దొరకగానే మారుస్తారు.

## STARRED QUESTIONS

*Deposit of sand before the Vijjeswaram Lock*

521—

*585 Q Sri A SATYANARAYANA MURTHY.— Will the Hon the Deputy Chief Minister be pleased to state .

(a) Whether the Government are aware that the Godavari River is depositing sand before the Vijjeswaram Lock,

(b) Whether the Government are aware that the ryots of Western Delta are suffering for want of water even for first crop, and

(c) Whether the Government propose to get necessary repairs done by removing the sand beds formed down the Vijjeswaram head sluice to ensure good flow of water to the Canals ?

The Hon. Sri N. SANJEEVA REDDI·—

(a) Yes But not to the same extent as in last year.

(b) No There were adequate supplies for all the lands during the 1st crop season;

(c) As there is a deep course flowing straight from the railway bridge to Vijjeswaram, there will not be any need for dredging shoals for irrigation of lands in the Godavari Western Delta in the 2nd crop season this year.

*Dredgers for removing the sand dunes in the Godavari River.*

522—

*849 Q.—Sri A. VENKATARAMA RAJU:— Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

14th March 1956]

(a) Whether the Government are aware that before the Great War there were dredgers for removing the sand dunes which are often formed in the Godavari River,

(b) Whether the Government propose to purchase a dredger now for the purpose, and

(c) If not, why ?

The Hon. Sri N SANJEEVA REDDI·—

(a) Yes

(b) Yes One will be put into Commission shortly.

(c) Does not arise

Sri S. VEMAYYA – Shortly అంటే మాసాలలోనా సంవత్సరాలలోనా!

The Hon Sri N SANJEEVA REDDI·—ఇప్పటికి వచ్చేఉంటుంది ఇప్పటికప్పుడే అయిపోయిందేమో. ఈ ప్రశ్న వైప్రచేసిననాటికి shortly అని అనుకొంటాను.

Sri V. VISWESWARA RAO -ఇక్కడ ఇసుకమేటలు ఎక్కువ వేస్తున్నవి. ఒక dredger చాలదని ప్రభుత్వం గుర్తిస్తుందా ? రెండు కొనడానికి ప్రయత్నం చేస్తారా ? ఒకదానితో పనిపూర్తికాదని డెల్టా ప్రజలు ఆందోళన పడుతున్నారు. వెంటనే రెండు డ్రెడ్జర్లు కొంటారా ?

The Hon. Sri N SANJEEVA REDDI:—

ఒక డ్రెడ్జరు సరిపడుతుందని ఒకటి కొంటున్నాము. అది వచ్చిందనుకుంటాను. It was expected to arrive at Madras by 17–2–55 ఆ తేది దాటి నెల అయినది కాబట్టి వచ్చి ఉంటుంది. Assemble చేస్తూ ఉంటారు Actual గా కాలవదగ్గర పని చెయ్యకపోవచ్చును. ఒకదానితో పని పూర్తికాకపోతే ఇంకొకటి తెస్తారు.

Sri S. VEMAYYA ·— దాని ఖర్చు maintenance కొతాలోనుంచి తీసేస్తారా ? లేక ప్రత్యేక allotment ఇచ్చి ఈ sand ను remove చేస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI ·— డ్రెడ్జరు కొనడమంటే ప్రత్యేకముగా ఖర్చుపెట్టాలి కదా. అందుకోసము ఖర్చుఅవుతూ ఉంటుంది. It is absolutely necessary to spend money.

Sri S. VEMAYYA .— ఈ డ్రెడ్జరు ఖరీదు ఎంత అయినదో తెలుసుకొన వచ్చునా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— A separate question may be put.

*Widening of the Godavari bunds*

523 —

345 Q –SRI A. VENKATARAMA RAJU :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state .

[a] whether any preliminary steps were taken for widening the Godavari bunds after the Godavari Floods, and

[b] if so, the amount spent ?

The Hon Sri N SANJEEVA REDDI —

[a] The answer is in the negative

[b] Does not arise

*Irrigation of lands by the Harijans of Pandlur Village*

524 —

* 887 Q - Sri S VEMAYYA — Will the Hon the Minister for Revenue be pleased to state

[a] whether it is a fact that the Harijans of Pandlur village Gudur Taluk of Nellore district are not allowed to irrigate their lands with Government water now, and

[b] if so, the reasons therefor ?

The Hon Sri K CHANDRAMOULI :—

[a] The answer is in the negative

[b] Does not arise

Sri S. VEMAYYA —పండ్లూరు అనే గ్రామం కుడిదూరు అని పొరపాటు అయి ఉంటుంది. నీరు పారడంలేదు అని తెలుస్తున్నది. ఇప్పుడైనా దర్యాప్తు చేస్తారా ?

The Hon. Sri K CHANDRA MOULI — పండ్లూరు ఇర్రిగేషను సక్రమముగా జరుగుతోంది, హారిజనులకు ఏమీ ఇబ్బందిలేదు అని కలక్టరుగారు రిపోర్టు పంపించారు.

*Installation of electricity lines along the banks of K C Canal*

525—

*727 Q —Sri E. AYYAPU REDDI -Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) Whether electricity lines are installed along the banks of K. C. Canal,

(b) If so, to what mile it has now been installed, and

(c) Whether the installation will remain permanent ?

The Hon. Sri G. LATCHANNA·—

[a] The answer is in the affirmative.

[b] Upto 73rd mile from Sunkesula.

14th March 1956]

[e] This aspect is under consideration by the Chief Engineer (Electricity)

(ఎ) అవునండి.

(బి) సుంకేసులనుండి 73 వ మైలు వరకు కూడా వెయ్యబడింది.

(సి) ఈ విషయము పరిశీలనలో ఉంది.

Sri E AYYAPU REDDI — K C కెనాలుకు ఇరుప్రక్కలా చాలా పల్లెలు ఉన్నవి. ఈ పల్లెలకు K C Canal Lines వెంట electricity ఇచ్చే దానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

The Hon Sri G LATCHANNA.— దానిని గురించి పరిశీలన చేసి వెంటనే రిపోర్టు ఇవ్వవలసినదిగా చీఫ్ ఇంజనీరుకు గత జూలైలో ప్రభుత్వం ఆర్డరు పంపింది. ఇంకా ఆ రిపోర్టు రాలేదు. వచ్చిన వెంటనే తగిన నిర్ణయము చేయబడుతుంది.

Sri C P THIMMA REDDI —K C Kanal కు తూర్పున బావులు చాలా ఎక్కువగా ఉన్నవి. ఆ ప్రాంతాలకు electricity ఇస్తే పల్లెలకు చాలా ఎక్కువ సౌకర్యముగా ఉంటుంది. కడప వరకూ K C Canal కు, నల్లమల పర్వతములకు మధ్య ప్రాంతములో ఎక్కువగా బావులు ఉన్నవి ఆ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి ఇస్తే బాగా ఉంటుందని మనవి చేస్తున్నాను.

The Hon Sri G LATCHANNA:—ఈ ప్రశ్న మీద వచ్చిన భోగట్టాతో వివరములు చెప్పడానికి కాదు K C. Canal నుంచి గ్రామాలకు extension ఇవ్వడము అనేది ఆ కెనాలు lines Permanent గా ఉంచడానికి అవకాశము ఉన్నదా అని పరిశీలించి report పంపవలసినదిగా చీఫ్ ఇంజనీరుగారిని కోరడమైనది. నందికొట్కూరు బ్రాహ్మణ కోడూరు మున్నగు గ్రామాలకు ఆ line నుండి tap చేసి ఇచ్చే అవకాశం ఉన్నదేమో పరిశీలించమని direction ఇచ్చేము.

Sri E. AYYAPU REDDI — మూడవ ప్రశ్నకు సమాధానము ఇస్తూ మంత్రివర్యులు ఆలోచనలో ఉన్నదని అన్నారు ఈ వేసినట్టి line లను తీసివేసే దానికి మళ్ళీ ప్రభుత్వం ఆలోచిస్తుందా ? ఇటువంటి దానికి ఎందుకు అవకాశము ఉండవలెనో చెప్పగలరా ?

The Hon Sri G. LATCHANNA·—గౌరవనీయులైన సభ్యులకు ఎందుకు ఈ సందేహము కల్గింది? మొదటి ప్రశ్నకు సమాధానము చూస్తే ఈ ప్రశ్నకు అవకాశము లేదు. ఈ line ను permanent గా ఉంచడానికి పరిశీలన చేసి రిపోర్టు పంపవలసినదిగా చీఫ్ ఇంజనీరుకు తాఖీదు పంప బడిందని తెలియ చేశాను. ఈ line electricity department ది కాదు. Irrigation Department లో నుంచి వేసినది. దానిని Electricity Department కు transfer చేసే దానికి, permanent గా ఉంచే దానికి పరిశీలన చెయ్యమని కోరినామని తెలిపి ఉండగా రెండవ ప్రశ్నకు అవకాశము లేదని మనవిచేస్తున్నాను.

Sri S. VEMAYYA .— చీఫ్ ఇంజనీరుగారికి గత జూలైలో reference చేశాము అన్నారు కనీసము ఈ జూలైలోగానైనా రిపోర్టు వస్తుందా ?

The Hon Sri G LATCHANNA:— ఈ సరికి వచ్చి ఉంటుందేమో. ఈ ప్రశ్నకు జవాబు వ్రాసేసరికి ఉన్న పరిస్థితి చెప్పేను.

*Harijan Co-operative Credit Societies in the various Districts.*

526—

*447 Q —Sri V VISWESWARA RAO —Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state ·

[a] How many separate Harijan Co-operative Credit Societies are functioning in the various Dirtricts, and

[b] If the number is less whether the Government will take steps to organise separate credit societies for Harijans ?

The Hon Sri D SANJIVAYYA —

[a] A *statement containing the information is placed on the table of the House.

[b] Permission for the starting of co-operative societies exclusively for Harijans is being granted by the Registrar of Co-operative Societies, wherever necessay.

Sri V. VISWESWARA RAO·— అధ్యక్షా మంత్రిగారు వారి సమాధానంలో whereever necessary అని చెప్పారు. గత సంవత్సరంలో ఏమైనా కొత్త సొసైటీలను start చేశారా ? అందుకోసం applications ఎవరైనా పెట్టారా ? కొత్తగా ఎవరైనా start చేశారా ? లేకపోతే liquidation ఏమైనా చేశారా ?

The Hon. Sri D. SANJIVAYYA:— దానికి ప్రత్యేకమైన ప్రశ్న వేస్తే సమాధానం చెప్తాను.

Sri PRAGADA KOTAIAH — అధ్యక్షా, ఈసంఘాలకు జిల్లా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులు పరపతి సౌకర్యాలు యేమైనా కల్గిస్తున్నారా ? అలా కల్గించకపోతే కల్గించే దానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon Sri D. SANJIVAYYA.— Credit Society లకు జిల్లా బ్యాంకులు యివ్వకపోతే నడపడానికి అవకాశమే లేదు.

Sri P. VENKATA SUBBAYYA:—యా Harijan co-operative societies లో సభ్యులకు individual borrowing power Rs 100/- వరకూ ఉంది. దాన్ని రెండువందల యాభై రూపాయల వరకు పెంచేదానికి ఏర్పాటు చేస్తారా ?

The Hon Sri D. SANJIVAYYA.— ఆలోచిస్తాం.

* Vide appendix I at page 314 infra

14th March 1956]

Sri S. VEMAYYA·— విశాఖపట్టణంలో ఒకే ఒక సొసైటీఉన్నట్లు కనబడుతుంది. అక్కడ డిప్యూటీ రిజిస్ట్రారుగారు లేరా ? లేకపోతే అక్కడ organise చేసే దానికి ప్రభుత్వాం కృషి చేయడంలేదా ?

The Hon. Sri D SANJIVAYYA —మామూలుగా హరిజనలు గ్రామం మొత్తానికి యేర్పాటు చేయబడినటువంటి Society లలో కూడా సభ్యులుగా చేరవచ్చు. అక్కడ చేరి ఉంటారని నేను ఆశిస్తున్నాను.

Sri P GUNNAYYA — అధ్యక్షా, మంత్రిగారు ఇంగ్లీషులో చెప్పారు. నాకు అంతగా తెలియలేదనుకోండి. ఈ Harijon co-operative Society లు శ్రీకాకుళం జిల్లాలో ఎక్కడ అయినా యేర్పాటు చేశారా అని అడుగుతున్నాను ?

Mr. SPEAKER — ఉన్నాయండీ. 5 ఉన్నాయని వ్రాశారు. ఆ కాగితాల్లో చూడండి 5 ఉన్నాయి.

Sri V. VISWESWARA RAO — ఈ Harijan Credit Co-operative Society లకు ఎంత మొత్తం Bank ల నుండి అప్పులు ఇవ్వడం జరిగిందో మంత్రిగారు సెలవిస్తారా ?

The Hon. Sri D SANJIVAYYA :— ఆ information నాదగ్గర లేదండీ. ఇంకోసారి ప్రశ్న వేస్తే తెప్పిస్తాను.

Sri PRAGADA KOTAIAH .— ఇప్పుడు Harijan Co-operative Society లలో రెండు రకాలు అయిన సొసైటీ లున్నాయి, అని వారిచ్చినటువంటి సమాధానంలోనే స్పష్టంగా చెప్పారు. ఆ రెండోరకమైనటువంటి Field Labour Co-opeative Societies కు Tenants Co-operative Societies కు Central Banks ఒక కానీ కూడా యివ్వటంలేదు. కాబట్టి వాటికి అప్పులిప్పించే విషయాన్ని గురించి ప్రభుత్వం యేమైనా పరిశీలన చేస్తుందా ?

The Hon. Sri D SANJIVAYYA — గౌరవ సభ్యులు చెప్పినటువంటి విషయం కొంతవరకు సత్యదూరం అని చెప్పవచ్చును. నాకు తెలిసినంతవరకు రామచంద్రపురం బ్యాంకు వారు, అమలాపురం బ్యాంకువారు field labour co-operative societies కు అప్పులు ఇచ్చి ఉన్నారు. ఇంకా అప్పులను వసూలుచేసుకోలేదు కూడాను. అటువంటి పరిస్థితులలో ఇవ్వలేదు అని చెప్పడం భావ్యంకాదేమో. కానీ అనేకచోట్లలో అప్పులివ్వడంలేదు. అన్ని Society లనీ Central Banks కు affiliate చేయమని ఉత్తరవులిచ్చారు ప్రభుత్వంవారు. ఎక్కడ అయినా Central Bank వారు affiliate చేసుకోకుండా, అప్పులివ్వకుండా ఉన్నట్లయితే వాటి మీద చర్య తీసుకొంటాము.

Mr. SPEAKER :— Or else how can they function if they do not affiliate to the Central Bank ?

Sri PRAGADA KOTAIAH :— Almost all the societies are affiliated to the co-operative banks and they are organised on

unlimited liability basis There are no properties for the members of the co-operative societies and the Central Banks are not advancing any loans

The Hon Sri D SANJIVAYYA — ఈ సంఘాలవారికి ఆస్తు లుండవు. వారు కౌలు ఫాలాలు చేసుకొంటారు ఆ ఫాలాలమీద వచ్చే ఆదాయం ఉంటుంది. దాన్ని consideration లోకి తీసుకొని Banks వారు అప్పులిస్తారు.

*Tobacco Tax*

527 —

* 916 Q — Sri S VEMAYYA —Will the Hon the Minister for Co-operation and Commercial Taxes be pleased to state

[a] whether the Government is aware of the fact that the Tobacco Tax is far below the Budget Estimate of 1954–55 ;

[b] if so, the reason therefor , and

[c] the preventive measures the Government propose to take to realise the tax satisfactorily ?

The Hon Sri D SANJIVAYYA .—

[a] Yes.

[b] The Budget Estimate for 1954–55 was fixed in December 1953, when this State was newly formed The tax itself was imposed for the first time in the Composite State only in April 1953. Very little information was then available with the Government for arriving at a reliable estimate The Budget Estimate was thus overpitched The following other reasons also have contributed to the low revenue ,

[1] Consumers taking to cheaper brands of cigars and cigarettes

[2] Smuggling of cigarettes from neighbouring States.

[c] A proposal to revise the rates of tax, so as to make smuggling unprofitable and thereby increase the sales in this State and revenue derived from the tax, is under the consideration of the Government.

Sri S VEMAYYA :— Smuggling జరగకుండా అరికట్టడానికి ప్రభుత్వం ఏ చర్యలు తీసుకొంటుంది ?

The Hon Sri D. SANJIVAYYA:— అనేక చర్యలు తీసుకొంటున్నాము. Surprise checking చేసి ఇతర states నుంచి మనకు వస్తుంటే, Special staff ను పెట్టి వచ్చేదానిని అరికట్టుతాము.

14th March 1956]

Sri VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా, బరహాంపురం నుంచి ఇచ్ఛాపురానికి, హైదరాబాదునుంచి, బెజవాడకును చిన్న చిన్న సామానుల ...లలో ఖరీదుగల సిగరెట్లు రావటం జరుగుతున్నది. చాలాచోట్ల పట్టుకొన్నారు. కాని కేసులు మాత్రం లేకుండా వాళ్ళ దగ్గర డబ్బువసూలు చేయకుండా వదలి పెట్టిన కేసులు చాలా బెజవాడలో ఉన్నాయి. వాటి విషయంలో ఏమైనా తీవ్రమైన చర్యలు తీసుకోవటానికి పూనుకొంటారా ?

The Hon. Sri D SANJIVAYYA — బెజవాడ instance నాకు తెలుసు. ఒకే merchant దగ్గర 20 వేల రూపాయల సరకు ఉండింది దానిమీద దాదాపు 6 వేల రు లు టాక్సు వసూలు చేసినారు.

Sri N C. SESHADRI — మనకు ప్రక్కనే Hyderabad State ఉంది. అక్కడ సిగరెట్ల prices తక్కువగా ఉన్నాయి. అక్కడనుంచి చాలా smuggle అవుతున్నట్లుగా రిపోర్ట్సు వస్తున్నాయి Hyderabad State నుంచి ఇక్కడకు smuggle చేసే వారిని పట్టుకోవడానికి ప్రభుత్వం ఏమిచర్య తీసుకొంటుంది?

The Hon Sri D SANJIVAYYA — నేను ఇంతకుముందే మనవిచేశాను. ఏ పాయింటునుంచి మన State లోకి వస్తారో ఆ పాయింటుకు checking staff వెళ్ళుతూ ఉంటుంది. అక్కడ కనపడితే పట్టుకొంటారు.

Sri S VEMAYYA — ఇప్పుడు దీన్ని గురించి special staff ఉన్నదా? ఉంటే అది ఎక్కడ పరిశీలన చేస్తున్నది ?

The Hon Sri D SANJIVAYYA.— Special staff ను ఇప్పుడిప్పుడే appoint చేయాలనుకొంటున్నాం General గా state అంతా తిరిగే విధంగా flying squad అనే విధంగా ఏర్పాటు చేస్తాం.

*Training of Panchayatdars in the State.*

528 —

* 929 Q — SRI S VEMAYYA — Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state:—

whether there are proposals with Government to give training to the Panchayatdars in the State now in pursuance of the instructions of Government of India ?

The Hon. Sri A. B NAGESWARA RAO :—
The answer is in the affirmative.

Sri S. VEMAYYA.—ఏ విధమైన ట్రైనింగు యిస్తారో details ఉంటే చదువుతారా ?

The Hon. Sri A. B NAGESWARA RAO —మామూలుగా 1950 వ సంవత్సరము పంచాయితీ ఆక్టుకు సంబంధించిన అన్ని ట్రైనింగులూ ఇస్తారు. అవి కాకుండా Co-operation, Animal Husbandry, road making, sinking of wells, hygiene వగైరాలన్నిటిలో కూడా ట్రైనింగు యివ్వబడుతుంది.

Sri N. RAMULU:—ఈ ట్రైనింగు ఎప్పుడు ప్రారంభిస్తారో తెలవిస్తారా ?

The Hon Sri A. B NAGESWARA RAO — Administrative Heads కొందరిని పిలిచి conference ఒకటిపెట్టి scheme నొకదాన్ని evolve చేసి వాంట్లో కరిక్యులం కూడా నిర్ణయించిన తరువాత చెయ్యాలని మా ఉద్దేశం. దీనికి కేంద్ర ప్రభుత్వము కూడా కొంత subsidy ఇస్తుంది. ఈ scheme తయారు అయిన తర్వాత కేంద్ర ప్రభుత్వాన్ని అడ్రెసుచేసి ఆ డబ్బు తెప్పించుకొని start చెయ్యాలి

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— దీనికి text books ను, Curriculum, ఎవ్వాళ్ళు తీసుకుంటారు.

The Hon. Sri A B NAGESWARA RAO :— Conference లో ఈ నిర్ణయాలన్నీ చేస్తారని చెప్పాను.

Sri P VENKATA SUBBAYYA :— ఈ ట్రైనింగుకు attend అయ్యే పంచాయితీ సభ్యులకు పోను రాను బత్తాలు ఇస్తారండీ ?

The Hon Sri A B NAGESWARA RAO — ఇవ్వాలనే ఆలోచన కూడా ఉంది. పంచాయితీ మెంబర్లకే కాదు Panchayat President లకు Deputy Panchayat Officers కు, clerks మొదలైన వారందరికీ training ఇవ్వాలని ఆలోచన ఉంది.

Sri S. VEMAYYA :— ఇప్పుడు బావులు త్రవ్వడం వగైరా కొన్ని విషయాలు చెప్పినారు. వాళ్ళు లెక్కలు వ్రాయడంలోనే తప్పులు వ్రాసి యెక్కువ ఇబ్బంది పడుతున్నారు. కాబట్టి accounts maintain చేసే విషయంలో ట్రైనింగు యిచ్చే విధానం ఉందా ?

The Hon. Sri A B. NAGESWARA RAO—నేను మొదట్లోనే విన్నవించుకొన్నాను. పంచాయితీ చట్టానికి సంబంధించిన అన్నిట్లోను training ఇచ్చి తర్వాత అవసరంగా ఇతరవిషయాలలో కూడా ఇస్తారని మనవిచేశాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ఇవి రెఫ్రెషర్ కోర్సులుగా ఉంటాయా ? లేక ట్రైనింగు క్లాసులుగా ఉంటాయా అండీ ?

The Hon. Sri A. B. NAGESWARA RAO .— ఇవి training classes

Sri A. BAPINEEDU :— ఈ పంచాయితీ దారులకు కూడా education qualification వుండాలని యేమన్నా రూలు పెట్టుతారా ? మంత్రిగారు.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— అదేమీ లేదండీ. Fundamental rights కి అవి వ్యతిరేకంగా లేవు. Education qualification ఎక్కడా లేదు.

14th March 1956]

*Increasing the height of the shutters over the Dowlaishwaram Anicut on Godavari.*

529 —

* 853 Q — Sri A VENKATARAMA RAJU — Will the Hon the Deputy Chief Minister be pleased to state

[a] whether the Government propose to increase the height of the shutters over the Dowlaishwaram Anicut on Godavari which will be useful temporarily ,

[b] whether the estimates for the same have been prepared, and

[c] if so, why the work has not yet been started ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

[a] Yes.

[b] No. It will be prepared soon after the type of gates that should go on the crest is decided.

[c] Does not arise.

Sri V. VISWESWARA RAO:- ఈ మధ్యపత్రికల్లో ధవళేశ్వరం ఆనకట్ట shutters increase చేస్తారని చెప్పినట్లు పడింది నిజమేనా ?

The Hon Sri N SANJEEVA REDDI.—[a] Yes అన్నాను కదా దానికి కావలసిన Strength గురించి ఆనకట్ట particulars గురించి ఎలాంటి shutters పెట్టాలి అనే విషయమై పూండి దగ్గర research స్టేషనులో study చేస్తున్నారు. అది వచ్చిన తరువాత చూస్తాము.

Sri S VEMAYYA :— Shutters fix up చేసినందువల్ల అధ్యధికంగా ఎంత ఆయకట్టు వస్తుందో చెప్పగలరా ?

The Hon Sri N.SANJEEVA REDDI:- ఉన్న ఆయకట్టుకే water supply బాగా వస్తుంది. కొద్దిగా ఆయకట్టు ఎక్కువకూడా కావచ్చు.

Sri M. NAGI REDDI·— ధవళేశ్వరం ఆనకట్ట చాలా కాలం క్రిందట కట్టింది ఇటుకరాయితో కట్టారని break అవడానికి అవకాశాలున్నాయని ప్రజలను కుంటున్నారు. దీనిని పరిశీలించి అటువంటిది జరుగకమందే బందోబస్తు ఏర్పాటు చేస్తారా ?

The Hon Sri N. SANJEEVA REDDI:—అలాంటిప్రమాదంఉన్నట్లు technical men చెప్పటం లేదు. అటువంటి ప్రమాదం లేదనే అంటున్నారు. భయం ఏమీలేదు.

[14th March 1956

*Ports of Calingapatnam and Baruva*

630—

* 974 Q — SRI P GUNNAYYA — Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether the Government propose to revive the ports of Calingapatnam and Baruva ,

(b) if so, the improvements proposed by the Government for their development ,

(c) what are the recommendations made to Central Government by the Special officer who recently visited Calingapatnam?

The Hon Sri G. LATCHANNA —

(a) The answer is in the affirmative

(b) The State Government have recommended to the Government of India a scheme for the survey of the Calingapatnam port costing Rs 10,000 and a scheme for reopening and improving the port of Baruva costing Rs 50,000.

(c) The Government have no information

Sri P GUNNAYYA —కేంద్ర ప్రభుత్వం నుంచి ఏమీ సమాచారం రాలేదు అంటున్నారు. కళింగపట్నం, బారువా రేవుల అభివృద్ధి కోసము ప్రభుత్వం వెంటనే పని చేయించడానికి recommendation చేస్తారా ?

The Hon. Sri G LATCHANNA —స్పెషలాఫీసరుగారి రిపోర్టు ఏమిటని (సి) లో కోరారు స్పెషలు ఆఫీసరు కేంద్ర ప్రభుత్వం నుంచి వచ్చినవారు వారి రిపోర్టు కేంద్ర ప్రభుత్వానికే పంపారు. అదే ఈ ప్రభుత్వానికి ఏ సమాచారం తెలియదని చెప్పడానికి కారణం. ఈ స్కీములు recommend చేసినాము. కేంద్ర ప్రభుత్వంవారి పరిశీలనలో ఉన్నవి. వారి ఆమోదం వచ్చిన తరువాత అమలు చేస్తాము.

Sri S. VEMAYYA.— రెండు స్కీములు పంపాము అన్నారు. వాటి details ఏమిటి ? వాటి estimates ఎంతో తెలుసుకోవచ్చునా ?

The Hon. Sri G. LATCHANNA.— కళింగపట్నం రేవు సర్వే గురించి 10 వేలు. మూసివేయబడిన బారువా రేవు reopening గురించి మొత్తం estimate 50 వేలు.

*Location of the Sales Tax Offices in Rajahmundry.*

531—

*867 Q — Sri T. LAKSHMINARAYANA REDDI:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state

14th March 1956]

[a] The number of buildings in which the Sales Tax Offices are Located in Rajahmundry, and

[b] The monthly rent for each of the buildings ?

The Hon Sri D SANJIVAYYA.—

[a] 3.

| | | |
|---|---|---|
| [b] (1) | for the buildings in which the offices of the Commercial Tax Officer, East Godavari (South) Rajahmundry, and the Special Assistant Commercial Tax Officer, Rajahmundry, are located | Rs 275/- per month |
| (2) | For the building in which the offices of the Deputy Commercial Tax Officers Rajahmundry I and II, are located | Rs 225/- per month |
| (3) | For the building in which the office of the Deputy Commercial Tax Officer, Rajahmundry III, is located | Rs 125/- per month |

Sri T LAKSHMI NARAYANA REDDI :— ఇందులో రెండు buildings కు ఇదివరకు వచ్చె అద్దెకంటె ప్రభుత్వంవారు ఎక్కువ అద్దె ఇస్తున్నారని దానికి కారణం అవి సేల్సుటాక్సు ఉద్యోగికి సంబంధించినవి కావడమేననే భావం రాజమండ్రి ప్రజలలో ఉన్నది. ఇకముందు ప్రభుత్వోద్యోగులు, M. L. A. లకు సంబంధించిన ఇండ్లు తీసుకునేటప్పుడు శ్రద్ధవహిస్తారా ?

The Hon Sri D SANJIVAYYA — అటువంటి అభిప్రాయాలు ఉండడానికి అవకాశంలేదు. P. W D Executive Engineer ను inspect చేసి rent fix చేశారు.

### *Advisory Committees to the Special Officers of the District Boards*

532 —

* 812 Q - SRI PRAGADA KOTAIAH:— Will the Hon. the Minister for Local Administration and prohibition be pleased to state ;

(a) whether there is a proposal to constitute Advisory Committees to the Special Officers of the District Boards; and

(b) if so, the details of the constitution of such committees?

The Hon. Sri A B. NAGESWARA RAO.—

[a] The answer is in the affirmative.

[b] The Government have decided that Advisory Committees be constituted for a period upto 10th December, 1956 to

[14th March 1956

advise Special Officers of the District Boards The Advisory Committee will consist of one Harijan, One Woman, three presidents of Panchayats in the District and all the ex-presidents of District Boards. The Committee will be so constituted that no taluk in the District will go unrepresented and would also include one or more members of backward classes

Sri PRAGADA KOTAIAH :— Backward classes కు హరిజనులకు representation ఇవ్వాలని కోరినాము. ఆ విషయంలో ప్రభుత్వం నిర్ణయం చేసినట్లు ముఖ్యమంత్రిగారు చెప్పారు G O. లో ఏమీ కనిపించడంలేదు. తరువాత issue చేసిన memo ఏమైనా ఉన్నదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — G. O ఏమీలేదు. కాని కలెక్టర్లకు ప్రత్యేకమైన సర్క్యులర్లు పంపించాము.

" The Government desire that your proposals should be sent expeditiously to the Inspector-General of Local Administration I am to request you to send a panel of names which should be twice the number of the nominations to be made by the Government I am to inform you in this connection that the members recommended by you should be persons of integrity and should also include persons from backward classes" అని.

Sri N. VENKAIAH :— Advisory Committee సలహాలను త్రోసివేయడానికి ఆఫీసరుగారికి అవకాశం ఉంటుందా ? అలా అయే పక్షంలో దీనిని నియమించడం దండుగ కాబట్టి నియమించకుండానే ఉండటానికి ఆలోచిస్తారా ?

The Hon Sri A. B NAGESWARA RAO — నియమించడానికి నిశ్చయమైనది క్రిందటి Budget session లో చాలా మంది గౌరవ సభ్యులు సరిగా మాట్లాడకుండలేదని చెప్పడంమూలంగా తగిన instructions ఇచ్చి ఒక గంట అయినా Special Officers, P As, M L As, మొదలైన వాళ్ళ representations వినడానికి సావకాశం ఇవ్వాలని instructions ఇచ్చాము.

Sri D RAMABRAHMAM — జిల్లాబోర్డుల అధ్యక్షులు స్పెషల్ ఆఫీసర్ల క్రింద పనిచేయడానికి advisory bodies లో ఉండడానికి ఇష్టంలేదని సూచనచేశారు. అది ప్రభుత్వానికి తెలుసా ? తెలిస్తే officials తో కాకుండా non-official bodies ను constitute చేయడానికి ఆలోచన ఉన్నదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ప్రభుత్వానికి అటువంటి సూచనరాలేదు అందరు ఉండాలనే అభిప్రాయంతోనే చేయబడింది. అటువంటి సూచన వస్తే ఆలోచిస్తాము. Instructions ప్రకారము Ex-District Boards Presidents అందరూ members అవుతారు. వారు ఎవరూ కలెక్టరుగారి క్రింద పనిచేయడంలేదు. వారికి సలహా ఇవ్వడానికే ఉన్నారు.

Sri P. NARASIMHAPPA RAO :— కలెక్టరుగారి క్రింద పనిచేయడం లేదు అన్నారు వారి మీద ఎలాపనిచేస్తున్నారు.

The Hon Sri A B NAGESWARA RAO :— వారికి సలహా ఇవ్వడాని కని మనవిచేశాను.

Sri P NARASIMHAPPA RAO.— ఈ కమిటీ చేసే పనులు ఏమిటి ? నామకహా ముఖంతుడుపుకు పెట్టినారా ? Special officer తన ఇష్టంవచ్చినట్లు పనిచేయడానికి పెట్టినారా ?

The Hon Sri A B NAGESWARA RAO.—కమిటీలు పనిచేయాలనే అభిప్రాయంతోనే పెట్టారు. Administration report, budget వారి ముందు పెట్టాలని గౌరవసభ్యులేమైనా సలహాలు చెబితే వినాలని రెండు నెలల కొకసారి మీటింగు పెట్టాలని ఉన్నది.

Sri T RAMACHANDRA REDDI:— కమిటీలకు బదులు ఎలక్షన్లు జరిపితేనే న్యాయంగా ఉంటుంది.

The Hon Sri A B. NAGESWARA RAO — ఎలక్షన్లు జరిగేవరకు ఇవి function చేస్తాయి.

Sri CHIDAMBARA REDDI — ఇంతకు పూర్వం పరిపాలన జరిపిన అధ్యక్షులు ఇప్పుడు పరిపాలన జరిపే పంచాయితీబోర్డు అధ్యక్షులు సభ్యులుగా ఉండే సంఘం కేవలం advisory అంటే కలెక్టర్లకు వీరందరికన్న ఎక్కువ పరిపాలనా దక్షత ఉన్నదనా ప్రభుత్వ ఉద్దేశ్యం ?

The Hon. Sri A B NAGESWARA RAO —ఎక్కువఉందని కాదు. వారి అనుభవాలు అన్నీ సలహా పూర్వకంగా చెప్పి చేయించాలని.

Sri N P CHENGALRAYA NAIDU:—మంత్రిగారు సలహాసంఘాలు ఏర్పాటుచేసినప్పుడు G. O. లో సలహాలు పాటించవలసిన పనిలేదు అవి అమలు చేయవలసిన పనిలేదని చెప్పారు. అటువంటిస్థితిలో సలహా సంఘాలు వేసి బత్తాలు దండుగా ఇవ్వడం దుర్వినియోగం చేయడంకాదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—"The functions of the Committee shall be purely advisory, it being open to the Special Officer to decline to carry out any advice tendered by the Committee which he finds impracticable, inexpedient or inadvisable for any reason " (Laughter)

Sri N. P. CHENGALRAYA NAIDU :—మంత్రిగారు చెప్పారు. అమలు జరుపవలసినది అయితే అమలు చేస్తారని సలహా సంఘాలు వేసినపుడు మంచి వారిని మంచి సలహాలను ఇచ్చేవారినే వేస్తారు. అటువంటపుడు వారు మంచి సలహాలు ఇస్తారేకాని పనికిరాని సలహాలు ఇవ్వరు. అటువంటప్పుడు G. O. లో పనికిరాని సలహాలు అయితే అమలు చేయనక్కరలేదని ఎందుకుపెట్టారు ? దానిని ఎందుకు తీసివేయకూడదు ?

The Hon Sri A B NAGESWARA RAO —ఆర్థిక సంబంధమైనవి, technical సంబంధమైనవి, శాసనసంబంధమైనవి చిక్కులుంటాయి సరియైన సలహాలను ఆచరణలోనికి తీసుకురాకపోతే గౌరవసభ్యులు ప్రభుత్వానికి తెలియచేయవచ్చును

The Hon Sri N SANJEEVA REDDI —సలహాలు మంచివిగానే ఉండవచ్చు. 8 ఊళ్ళకు రోడ్లు వేయాలని ఆసుపత్రులు పెట్టాలని చెప్పవచ్చు. అది మంచి సలహా కాదని చెప్పలేము. ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా సాధ్యం కాకపోవచ్చును. With all good intentions the special officer may not be able to do it It is not that the suggestions are bad They are really good. అన్ని ఊళ్ళలో రోడ్లు, ఆసుపత్రులు పెట్టాలని అంటే మంచి సలహాయే. కాని ప్రోసీడ్ చేయవలసి వస్తుంది. వారిని అమర్యాద చేయడానికి త్రోసి వేయాలని కాదు. చెంగల్రాయ నాయుడుగారి వంటివారు President గా ఉండి డబ్బు లేక పోయినా ఖర్చు పెట్టడం తెలిసినవారు

*Proposals to work the District Boards democratically.*

533—

*576 Q —Sri VAVILALA GOPALAKRISHNAYYA·—Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

The Proposals to work the District Boards democratically which are now under the rule of Special officer ?

The Hon Sri A B NAGESWARA RAO:—

[a] The attention of the Member is invited to the orders* issued in G O Ms. No. 1220, L A , dated 7th December, 1955 and G. O Ms. No 70, L A , dated 17th January, 1956 copies of which are placed on the table of the House.

Sri M. NAGI REDDI :— ఈ advisory councils ఎప్పటినుంచి అమల్లోకి వస్తాయి ?

The Hon Sri A B NAGESWARA RAO :— జిల్లా కలెక్టర్ల దగ్గర నుంచి కొన్ని పేర్లు వచ్చినాయి ఇంకా కొన్ని రావలసి ఉన్నవి. అవన్నీ రాగానే సాధ్యమైనంత త్వరలో అమలు జరుపుతాము.

Sri K. SUBBA RAO :— ప్రజాస్వామ్య పద్ధతిలో పరిపాలన జరుపాలంటు న్నారు గదా, అటువంటప్పుడు మీరు ఏర్పాటుచేయబోయే సలహా సంఘాలనుంచి ఒక ప్రెసిడెంటును ఎన్నుకొని వారికి సర్వాధికారములు ఇచ్చి స్పెషల్ ఆఫీసర్ల స్థానే ఆ బోర్డులను నడిపించే ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ప్రస్తుతం ప్రభుత్వము నకు అటువంటి ఆలోచన ఏమీ లేదు.

---

* Vide appendix II & III at pages 315,316 infra.

14th March 1956]

Sri A BAPINEEDU :— Non-official Committee లను వేయడం కూడా permanent ఉద్యోగస్థుల చేతులలో పెట్టడము ప్రభుత్వముయొక్క policy యేనా ?

The Hon Sri A B NAGESWARARAO :— ఈ policy ని నిర్ణయించేది ప్రభుత్వమే. కలెక్టరులను ఆ అభ్యర్థుల నామినేషనులు మాత్రమే పంపించమంటున్నాము. పంచాయితీబోర్డు ప్రెసిడెంటులుగా ఉన్నారు కాబట్టి Inspector of Local Adminstration ద్వారా కూడా పంపమన్నాము. వాటిని ప్రభుత్వమే finalise చేస్తుంది

Sri B. SANKARAIAH :— ఈ Advisory Committes డిసెంబరు వరకే అన్నారు డిసెంబరు తరువాత ఎన్నికలు జరుపుతారా ? ఇదివరకు ప్రదేశ్ కాంగ్రెసు కమిటీవారు వెంటనే ఎన్నికలు జరుపమన్నారు. ఆ విషయం ప్రభుత్వపు దృష్టిలో ఉన్నదా ?

The Hon Sri A. B. NAGESWARA RAO :— డిసెంబరు 10 తరువాత కాదు. వీలైతే డిసెంబరు 10 వ తేదీ లోపలే జరపాలని ఆలోచిస్తున్నాము.

Sri P. BAPAIAH:—అధ్యక్షా, ఇప్పుడు ఈ Advisory Committee లో ప్రతి తాలూకాకు representation ఉంటుందన్నారు ఒక హరిజనుడు, ఒక స్త్రీ 3 గ్గురు పంచాయితీబోర్డు ప్రెసిడెంటులు, మాజీ జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు అందులో సభ్యులుగా ఉంటారన్నారు. వారు ఎవరూ లేని తాలూకాలలో representation ఎట్లా నిర్ణయిస్తారు ?

The Hon Sri A B NAGESWARA RAO — Representation లేని తాలూకాలనుంచి ఎవరిని వేయాలనేది ప్రభుత్వము నిర్ణయిస్తున్నది.

Sri N. C. SESHADRI:— అధ్యక్షా, ఈ Advisory Committee లలో ఉండే పంచాయితీబోర్డుల అధ్యక్షులు మైనరు పంచాయితీ బోర్డులవారో, మేజరు పంచాయితీ బోర్డులవారో వివరంగా చెప్పలేదు. మేజరు పంచాయితీబోర్డు ప్రెసిడెంటులు ఉండాలని, ప్రభుత్వంవారు ఏమైనా G O. ను award చేస్తారా ?

The Hon Sri A B NAGESWARA RAO :— అటువంటి ఆలోచన లేదు. మైనరు పంచాయితీ బోర్డుల అధ్యక్షులలో కూడా అనుభవం కలిగినవారు ఉన్నారు. వారి సలహాలు కూడా అవసరం. అందువల్ల అందులో వివరంగా వ్రాయలేదు.

Sri E NAGAYYA:— అధ్యక్షా, మాజీ జిల్లాబోర్డు ప్రెసిడెంటులకు అందులో స్థానం ఉన్నదన్నారు. మాజీ తాలూకా బోర్డుల ప్రెసిడెంటులకు కూడా ఏమైనా అవకాశం ఉన్నదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:—అటువంటి అవకాశము ఏమీలేదు.

Sri N. GOVINDARAJULU — అధ్యక్షా, ఈ సలహా సంఘములలో ముగ్గురు పంచాయితీ అధ్యక్షులు ఉంటారు. అదేవిధంగా పంచాయితీ ఉద్యోగులకు ఈ కమిటీలలో ప్రాతినిధ్యము ఉన్నదా ?

[14th March 1956

The Hon Sri A B NAGESWARA RAO —G O లో clear గా ఉన్నది అటువంటిది ఏమీలేదు. 3 గురు పంచాయితీబోర్డు అధ్యక్షులు ఉంటారు. జిల్లా కలెక్టరును 6 పేర్లు నామినేట్ చేసి పంపమన్నాము. Inspector General of Local Administration గారి సిఫార్సు ప్రభుత్వంనకు వస్తుంది. ఆరుపేర్లలో ఏ ముగ్గురిని పెట్టాలనేది ప్రభుత్వం నిశ్చయిస్తుంది.

Sri B RAMA REDDI —ఇది ప్రజాస్వామికపద్ధతిలో ఉండాలనే కారణ ముతో నామినేట్ చేయబడిన సెంబర్లనుండి ఒక అధ్యక్షుని ఎన్నుకుంటే యుక్తంగా యుంటుంది. కనుక ఇకనైనా అటువంటి ఏర్పాటుచేస్తారా ?

The Hon Sri A B NAGESWARA RAO —ఈ సలహా సంఘాలు తాత్కాలికంగా మరల ఎన్నికలు జరిగేవరకు మాత్రమే ఉంటాయి అందువల్ల ప్రస్తుతం ప్రభుత్వానికి అటువంటి ఆలోచనలేదు.

Sri V VISWESWARA RAO :—అధ్యక్షా, కలెక్టర్లు ఈ సలహా సంఘాలు ఇచ్చే సలహాలను పాటిస్తే పాటించవచ్చును. లేకపోతే లేదని అన్నారు. వానప్రస్థాశ్రమము స్వీకరించిన మాజీ జిల్లాబోర్డుల అధ్యక్షులుకూడా ఈ సంఘాలలో కలుస్తారా ?

The Hon Sri A B NAGESWARA RAO —వారికి అభ్యంతరము లేకపోతే ఉండవచ్చును. వానప్రస్థాశ్రమమేకాదు. సన్యాసాశ్రమములో ఉన్నవారు కూడా ఉండవచ్చును.

Sri VAVILALA GOPALAKRISHNAYYA —అధ్యక్షా ! సలహాలను వినవలసినవసరములేకుండా ఉండే advisory board ను పెట్టడం democratic functions అని మంత్రిగారు అంటున్నారు.

Mr SPEAKER :— The Deputy Chief Minister made a statement regarding that.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— సలహాలను ఎప్పటి కప్పుడు చెప్పుకోవడానికి అవకాశ మివ్వరు. తీర్మానాలను సలహాలను వినాల్సిన అవసరం లేనటువంటి Advisory Board లను పెట్టినాము ఈ రెండు కూడా ప్రజా ప్రాతినిధ్యానికి రూపం అని అంటున్నారు.

Mr SPEAKER :— మీరు ప్రశ్న వేయాలిగాని ...

Sri VAVILALA GOPALAKRISHNAYYA — వారు చెప్పిన దానిపై నా అభిప్రాయం మనవిచేశాను.

The Hon. Sri A B. NAGESWARA RAO :— Advisory Committee లలో ఉన్న సభ్యులంతా ప్రజా ప్రతినిధులన్న సంగతి ప్రభుత్వానికి తెలుసు. ప్రజా ప్రతినిధులయొక్క సలహాలు కావాలనే వారిని సభ్యులుగా నియమించాము. ఒక ఆఫీసరును కూడ వేసినాము. వారు గౌరవ సభ్యులు ఇచ్చిన సలహాలన్నీ

పుచ్చుకొని, సక్రమంగా నడపాలన్నారు. ఏ ఏ పరిస్థితులలో మీరు ఇచ్చిన సలహాలు ఆచరించడానికి వీల్లేదో అవన్నీ కూడా ఉపముఖ్య మంత్రిగారు చెప్పారు. వారు ఇచ్చే సలహాలను ఆచరించనప్పుడు, ప్రభుత్వానికి తెలియపరచినట్లయితే తప్పకుండా ప్రభుత్వం వాటిని ఆలోచించి సవరించడానికి ప్రయత్నము చేస్తుంది.

Srı P NARASIMHAPPA RAO — అధ్యక్షా ! జిల్లా కలెక్టర్ల సలహాల మీద పేర్లు పంపుతున్నారు. ఆ సలహాల ప్రకారంగా మీరు వారిని పిలుస్తున్నారా ? లేక సుసర్ల వారి స్కీను ప్రకారంగా స్కీమును మార్చి ఎప్పటి కప్పుడు ఇక్కడ కొత్తగా పెడుతున్నారా ?

The Hon Srı A B NAGESWARA RAO':— ఇంతవరకు ఆ పేర్లు ప్రభుత్వంవారి దగ్గరకు రాలేదు ఇప్పటికి కొన్ని వచ్చినాయి. ఇంకా కొన్ని రాలేదు. అన్నీ వచ్చిన తరువాత ప్రభుత్వమువారు ఆలోచిస్తారు.

*State Irrıgatıon Board*

534 —

* 715 Q - Srı E. AYYAPU REDDI — Wıll the Hon the Deputy Chıef Mınıster be pleased to state

(a) the number of tımes the State Irrıgatıon Board held conferences to dıscuss the problems under K. C Canal ,

(b) whether any non-officials were ınvıted to attend the conference ,

(c) whether any decısıons were taken at the conference , and

(d) ıf so, whether the decısıons have been ımplemented ?

The Hon Srı N. SANJEEVA REDDI —

(a) The Irrıgatıon Development Board dıscussed thrıce the problems relatıng to K C. Canal at its meetıng held on 12-7-1955, 17-9-1955 and 12-1-1956.

(b) Yes, on 17-9-1955.

(c) & (d) The suggestıons of the representatıves were heard by the Irrıgatıon Development Board and the specıal staff ıs attendıng to the localısatıon work

Srı E AYYAPU REDDI .— అధ్యక్షా, కొందరు Non-Offıcıals సమావేశమై కడప కర్నూలు కాలువ నీటిని ఏఏ గ్రామాలకు పారుదల సౌకర్యములు కలిగించ గలరో కరపత్రములు పంచిపెట్టమని సలహా ఇచ్చారు. ఆ సలహాను బోర్డువారు అంగీకరించారు. మీరు ఆ సలహాలను ఎంతవరకు అమలు జరిపారో తెలియజేస్తారా ?

The Hon Srı N SANJEEVA'REDDI —తుంగభద్ర కాలువల ప్రత్యేక కలెక్టరునే కడప కర్నూలు ప్రత్యేకాధికారిగా నియమించాము. ఇంజనీరింగు సిబ్బంది

కూడా పనిచేస్తున్నది. Localization పూర్తి అయితేనేగాని కరపత్రములు పంచిపెట్టే దానికి వీలులేదు. త్వరలోనే పని పూర్తి అవుతుంది. దానిక్రింద 3 లక్షల ఎకరాలకు నీరు ఇవ్వడానికి అవకాశములు ఉన్నాయి. నీరు పారే అవకాశం ఉన్నచోట సాగు చేసుకోవడానికి రైతులకు ప్రోత్సాహం ఇస్తేఉపయోగంగా ఉంటుంది. మీరు అక్కడికిపోయి రైతులకు యథేచ్ఛగా నీరు తీసుకొని సాగు చేసుకోమని చెప్పండి. వారిమీద పెనాల్టీలు ఏమీ వేయము ఆ రకంగా వారు ప్రయత్నం చేస్తే మనం 3 లక్షల ఎకరాలను సాగులోకి తేగలము. అందుకు అందరం చాలా సంతోషిస్తాము అని చెబుతున్నాను. Let them first make use of the water I am making a statement on the floor of the House that they may make use of the water first.

Sri S VEMAYYA —ఈ localization తేలకపోయినందువల్ల చాలాఇబ్బందిగా ఉంటుంది. ఈ localization ఎంతకాలంలో పూర్తిచేసి రైతులకు తెలియచేస్తారు

The Hon Sri N. SANJEEVA REDDI :—ఈ కడప - కర్నూలు కాలువక్రింద అన్ని కాలువలక్రింద ఉన్న పద్ధతి ప్రకారంగా నియమాలులేవు. వారి ఇష్టము వచ్చినట్లు, ఎన్నిసార్లుఅయినా నీరు తీసుకొని సాగుచేసుకోవచ్చును 30 ఎకరాలకు నీరు అందేచోట్ల 3 ఎకరములకే నీరు వాడుకొనుచున్నారు. మిగిలినది అంతా dry cultivation క్రింద పెట్టుకొంటున్నారు అందువల్ల ఈ పద్ధతినిమార్చి రైతులకు విధిగా నీరు వాడుకునే పద్ధతిని ప్రోత్సహించడానికి "నిర్బంధపుపన్ను పద్ధతి"ని ఇక్కడ కూడా ప్రవేశపెడుతున్నాము. నీటి తీరువ విధిగా వసూలుచేస్తాం. అయిదారు నెలల్లో పరిశీలన పూర్తిఅవుతుంది.

Sri G. RAMI REDDI:— అధ్యక్షా! రైతులకు అవసరమైనచోట్ల నీరు పెట్టుకుండుటకు ప్రోత్సాహమిస్తున్నామని మంత్రిగారు చెప్పారు కాని channels repairs లేక water guarantee కూడ లేకుండా వున్నాయి. దాన్ని గురించి ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకొంటుందో తెలవిస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI :— ఎక్కడెక్కడ అవసరముంటే అక్కడ ఉపయోగించుకోమనికాదు. అవకాశంకూడా వుండాలి. కాలవనీరు ప్రవహించేలా వుండాలి పిల్లకాల్వల level కూడా permit చేయాలి. మిగిలిన పిల్లకాలువలను యీసంవత్సరం బాగుచేయగల్గతామో, చేయలేకపోతామో చెప్పలేను. ఇప్పుడు జూన్ వరకు మరమ్మతులు చేయడానికి అవకాశంవుంది. మరమ్మతు చేయడం, lining వేయడం యిదంతాకూడా జూన్ నాటికితయారు చేస్తామని departement వారు అంటున్నారు. అయితే పని ఎంతవరకు జరుగుతుందో గమనించి తరువాత చర్య తీసుకుంటాము. అంతకన్నా యిప్పుడు నేను ఏమీ చెప్పలేను.

Sri E. AYYAPU REDDI·— Canal కు పరిసర ప్రాంతాలలో వుండే పల్లెలనుండి నీరుకావాలని మాకు అనేక మహజర్లు వస్తున్నాయి. ఆ మహజర్లను Special officer కి కూడా పంపిస్తున్నాము. వారి దగ్గరనుండి మాకు ఏమీ ప్రత్యుత్తరము వచ్చుటలేదు. కనుక సభ్యులతో కలిసి త్వరగా State Board ను సమావేశ పర్చడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

14th March 1956]

The Hon Sri N SANJEEVA REDDI—ఏ మాత్రమూ ఆక్షేపణ లేదు. నాకు మీ సలహాలు, సంప్రదింపులు అవసరం. కాని delay అవుతుందేమో, కాని అయ్యపురెడ్డిగారికి ఏ గ్రామంనుంచైనా సరే నీరు కావాలని petition వచ్చినట్లయితే నీరు ఉపయోగించుకో నియ్యమని చెపుతున్నాను. Permission సంగతి తరువాత చూద్దాము.

Sri C P THIMMA REDDI — K. C canal కు తూర్పువైపున ఉక్కులేరు అనివుంది. దానికి bridge కట్టినట్లయితే అక్కడ ప్రజలు నీరు తీసుకుందుకు సిద్ధంగా వున్నారు. గవర్నమెంటు అటువంటి proposals పెడుతోందా ?

The Hon Sri N SANJEEVA REDDI —Irrigation విషయంలో నుంచి bridge విషయం మాట్లాడుతున్నారు. ఈ ప్రశ్నకు సంబంధించినది కాదు కనక నాకు అంత details తెలియవు. పరిశీలించాలి.

Sri N. VENKAIAH — ఇప్పుడు సాగుకు అవకాశం యిచ్చేభూమికి ఎక్కువ వ్యయం అవుతోంది. దానిని permanent గా ఆయకట్టులో చేర్చడానికి ప్రయత్నంచేస్తారా ?

Mr SPEAKER —ఇప్పుడు అదేనండి చెప్పారు.

The Hon Sri N. SANJEEVA REDDI —అందుకే Special staffని post చేశాము. కాబట్టి ఎవరైనా నీరు వాడుకుంటానంటే తప్పకుండాఅవకాశమిస్తాము.

Sri S VEMAYYA — రైతులు నీరు కావలసినప్పుడు తీసుకోవచ్చునని మంత్రిగారు చెప్పారు సంతోషదాయకమే ; కాని నీరు తీసుకున్నప్పుడు దానిమీద penalty వేయము అనిచెప్పి హామీకూడా దాంట్లో add చేస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI —Penalty వేయము అని చెప్పి మొదటే చెప్పాను. నీరు తీసుకోమని encourage చేయమని ఆ విధంగా ప్రచారం చేయమని చెప్తున్నాను.

*Boarding facilities to Harijan and Backward Classes students.*

535—

*200 Q —Sri K PUNNAIAH —Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

[a] The number of Harijan students and Backward Classes students granted boarding facilities in 1954-55 and 1955-56 from the funds received by the State Government under the Removal of untouchability schemes, and

[b] The hostels into which Harijan and Backward students have been admitted under the above scheme ?

The Hon Sri G LATCHANNA·—

[a] and [b] The answer * is placed on the table of the House

Sri S. VEMAYYA·— ఈ grants యివ్వడంలో యే basis మీద allot చేస్తున్నారో తెల్సుకోవచ్చునా ?

The Hon Sri G LATCHANNA —ఇది కేంద్ర ప్రభుత్వం అంటరాని తనం నిర్మూలనోద్యమనిర్వహణార్థం యిస్తున్న grant Schedule caste peopleతో యితర caste students అందరూ చేరి చదువుకోడానికి ప్రోత్సాహం కల్గించడానికి గాను ప్రభుత్వం పనిని పెట్టింది. అయినా ప్రభుత్వం ఆ యా hostels యొక్క పరిస్థితిమూచి సవర్ణులు, అవర్ణులు కలిసి వున్నచోట్ల వారికి grant వినియోగిస్తారు.

Sri P GUNNAYYA·— అధ్యక్షా ! హరిజన hostels లో యితర కులాల పిల్లలను చేరుస్తున్నారు-సంతోషమే. కాని యితర hostels లో హరిజనులను ఎక్కడైనా చేర్చారో మంత్రిగారు సెలవిస్తారా ?

The Hon Sri G. LATCHANNA·—Statement అంతా Table మీద పెట్టినపుడు ఒకసారి చదవండి.

Sri N K LINGAM —అధ్యక్షా ! Central Government వారు anti-untouchability grants నుండి అనేక వేల రూపాయలు యీ subsidary hostelsకు యిచ్చారు. కాని ఆ డబ్బంతా కూడా హరిజనులను, సిరిజనులను ఎకించసి state level లో ప్రభుత్వంవారు ఒక hostel ను నడిపితే బాగుంటుందేమో ఆలోచిస్తారా ?

The Hon Sri G LATCHANNA·— ఇది కేంద్రప్రభుత్వం యిస్తున్న grant వారి సలహాలను పాటించవలసిన బాధ్యత మనరాష్ట్ర ప్రభుత్వానికి వుంది హరిజన hostels పెట్టినప్పుడు కూడ, హరిజన hostels లో సవర్ణులు చేరినపుడు కూడ యీ grant యివ్వబడుతుంది. సవర్ణుల hostels లో హరిజనులు చేరినప్పుడు హరిజనులకు ప్రోత్సాహ మివ్వడానికి యిది యివ్వబడుతుంది.

Sri P. VENKATA SUBBAYYA :— ఈ table మీద పెట్టిన Statement ప్రకారం నెల్లూరు జిల్లాలో 29,250 రు॥లు
కర్నూలు జిల్లాలో 29,500 రు॥లు
గుంటూరు జిల్లాలో 20,850 రు॥లు
కృష్ణా జిల్లాలో 13.650 రు॥లు
శ్రీకాకుళం జిల్లాలో 1,650 రు॥లు
విశాఖపట్నం జిల్లాలో 300 రు॥లు
కడప జిల్లాలో 3 వేలు ఖర్చుచేయబడింది.

ఇంతంత తేడాలతో ఖర్చుపెట్టడానికి కారణా లేమో తెలియజేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA.— అక్కడున్నటువంటి hostels, విద్యార్థుల సంఖ్యనుబట్టి వుంటుంది.

---

*Vide appendix IV at page 318 infra.

14th March 1956]

Sri K. SUBBA RAO — అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం తాలూకా తిమ్మాపురంలోని హరిజన హాస్టలును 2 సంవత్సరాలనుంచి చక్కగా నడుపుతూ యిప్పుడు గవర్నమెంటు recognition కావాలని చెప్పి అడుగుతున్నారు. ఇప్పుడైనా అది గమనించి recognise చేస్తారా?

The Hon Sri G LATCHANNA — ఈ ప్రశ్న గౌరవనీయ సభ్యులు యిదివరకు అడిగివున్నారు. క్రొత్త grants allot చేయడానికి అవకాశములేదు. అవకాశం వుంటే పరిశీలిస్తాము.

Sri B APPA RAO — ఈ Statement లో హరిజనులు Backward Clasess Forward Clasess అని మాత్రమే వుంది. గిరిజనుల విషయం లేదు. గిరిజనుల విషయమై ప్రభుత్వానికి ఏమైనా applications వచ్చాయా?

The Hon. Sri G. LATCHANNA — గిరిజనుల విషయంకూడా అందులో రెండుచోట్ల వుంది.

*Financial aid to Industries in Andhra*

536—

*698Q — Sri N C. SESHADRI:—Will the Hon the Minister for Co-operation and Commercial Taxes be pleased to state ·

[a] Whether it is a fact that Mr Jean Coupin, an officer connected with French Banking met the Chief Minister in connection with rendering financial aid to industries in Andhra, and

[b] If so, the result thereof ?

The Hon Sri D. SANJIVAYYA —

[a] Yes, Sir

[b] The gentleman was advised to approach the Government of India as the acceptance of financial aid by foreign countries for the industrialization of any part of India is the concern of the Government of India

Sri N C SESHADRI — వారు ఇచ్చటకు వచ్చి ఏయే విషయాలను ముఖ్యమంత్రిగారితో సంప్రదించారు? ఎందుకు సంప్రదించారు? సంప్రదించి ఏవిధమైన understanding కు వచ్చారు?

The Hon Sri D. SANJIVAYYA — ఏ విధమైన understanding కి రావడానికి మనకు అధికారం లేదు. కాని industrialisation కి "మీరు ధన సహాయం చేయడానికి సిద్ధంగా వున్నారా" అని అడిగినారు. ఆ విషయం Government of India తో చర్చించండి వారి ద్వారానే ఏదైనా జరుగవలసి ఉంటుంది" అని మన ప్రధాన మంత్రిగారు చెప్పారు. వారు వెళ్ళిపోయినారు.

[14th March 1956

Sri C. P THIMMA REDDI —రాయలసీమలో ఏయే industries స్థాపించడానికి వీలుగా వుంటుంది? ఈ విషయాన్ని గురించి details తెలుసా?

The Hon Sri D SANJIVAYYA — అది ఏమీ లేదండీ

*Financial assistance to small bus owners*

537—

882 Q —Sri S. VEMAYYA —Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state

(a) whether there are proposals with the Government to give financial assistance to small bus owners in the State now,

(b) if so, to what extent, and

(c) to whom the assistance will be given to?

The Hon Sri D SANJIVAYYA —

[a], [b] and [c] The matter is under consideration

Sri S VEMAYYA —ఎంత కాలంలో ప్రభుత్వం దీనిని పరిష్కారం చేస్తుందో తెలుసుకోవచ్చునా?

The Hon Sri D. SANJIVAYYA – త్వరగా చేయగలమని చెప్పవచ్చును కాని, యింతకాలమని చెప్పడానికి అవకాశంలేదు.

Sri PRAGADA KOTAIAH — పెట్టుబడుదారులకు కూడా పెట్టుబడి పెట్టే విధానాన్ని ప్రభుత్వం అవలంబిస్తోందా?

The Hon Sri D SANJIVAYYA — అందరినీ పెట్టుబడిదారులని అనడం న్యాయం కాదు. Bus operatorsలో కూడా చాలామంది అప్పులపాలైనటువంటి వాళ్ళు వున్నారు. రాష్ట్రం మొత్తంమీద 5 గురో ఆరుగురో మంచి పరిస్థితులలో వున్నారేమో అనుకొంటాను.

Sri S. VEMAYYA — వాళ్ళకు మైలేజీ తక్కువ వున్నటువంటి Bus owners కంటే హెచ్చుచేయడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నిస్తుందాండీ?

The Hon. Sri D SANJIVAYYA — Milageలో తక్కువ వున్నటువంటి bus operators కి తక్కువ tax కడతారు.

Sri P. GOPALU REDDI.—Bus operators కు ఆర్థికంగా సహాయం చేయడానికి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారని చెప్పారు. మద్రాసులోవలె third party insurance తీసుకొన్నట్లయితే ప్రభుత్వానికి లాభం వస్తుందంటున్నారు ప్రభుత్వం ఆలోచిస్తుందా?

The Hon Sri D. SANJIVAYYA — ఇదివరకు చాలామంది పెద్దలు యీ సలహా యిచ్చారు. దానిని పరిశీలించి దానివల్ల ప్రభుత్వానికి ఆదాయం వచ్చేటట్లు నన్నట్లయితే తీసుకుంటాము. కాని నష్టం వస్తోంటే మాత్రం తీసుకోము.

14th March 1956]

Sri N P. CHENGALRAYA NAIDU :— ప్రభుత్వం యీ bus owners కు డబ్బు సహాయంచేసే ఆలోచనలో వుందన్నారు. 51% డబ్బు advance చేస్తే semi-nationalization అవుతుంది. అలా సవరిస్తారా ?

The Hon Sri D SANJIVAYYA :— గౌ॥ సభ్యులు చెప్పిన తరువాత ఆలోచించడానికి అవకాశం వుందేమో అనిపిస్తోంది.

Sri N. K LINGAM :— అధ్యక్షా ! బస్సులవల్ల వాళ్ళకేమీ లాభంలేదని మంత్రి వర్యులు అంటున్నారు. శాసన సభ్యులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క bus యిస్తే మేము యీ జీతాలు, భత్యాలు పుచ్చుకోకుండా వుంటాము. లాభం చూపించడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon Sri D SANJIVAYYA :—అటువంటి అవకాశ మేమీలేదు. కాని, దేశాభివృద్ధి కోరేటటువంటి శాసనసభ్యులంతా కూడ తమకు వచ్చేటటువంటి ఆదాయములో కొంత ప్రభుత్వానికి అప్పజెబితే బాగానే వుంటుంది.

Sri N C SESHADRI — ఈ bus owners కు సహాయం చేసేందుకు ఏదైనా Financial Corporation ను ఏర్పాటు చేస్తున్నారా ?

The Hon Sri D. SANJIVAYYA :—ఏమీలేదు. ఇప్పుడు ఉన్నటువంటి Industrial Finance Corporation నుంచి అప్పులు ఇప్పించాలి అనుకొంటున్నాము. కాని ఈ bus transport ను industry గా వాళ్ళు పరిగణించలేదు. పరిగణించాలని మేము అడుగుతున్నాము.

Sri PRAGADA KOTAIAH :—వ్యక్తులకు ఈ విధంగా పెట్టుబడి ఇచ్చి ప్రోత్సహించేటటువంటి పద్ధతిని మానుకొని, వారికి నిజంగా సహాయం చేయవలసిన అవసరమున్నదని ప్రభుత్వము భావిస్తే వారందరిని కలిపి ఒక Co-operative సంఘముగా అందులో ఏర్పాటుచేసి 51 per cent share ప్రభుత్వము తీసుకొని నిర్వహిస్తుందా ?

The Hon Sri D SANJIVAYYA :— అది పరీక్షలో ఉన్నది.

Sri B RAMA REDDI :—అధ్యక్షా ! ఈ small bus operators కు ధన సహాయం మాట అటుంచి మన High Court వారు యిచ్చిన judgment ప్రకారం, వారికి sur-charge మొత్తమైనా దయచేసి ఇచ్చే ఏర్పాటు చేస్తారా ?

The Hon Sri D. SANJIVAYYA:— అది ఇంకా ఆలోచనలో ఉన్నదండి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా ! మూడు బస్సులుగలవాళ్ళకు ఆదాయము చాలాతక్కువ అంటున్నారు అది రామనాథన్ report యొక్క ఫలితమేమో అనుకొంటాను. ఆ రిపోర్టు సభ్యులకు అందజేస్తారా ? మూడు బస్సుల వాళ్ళకు ఆదాయం రాదని, వారికి సహాయం చేయాలని ఎట్లా నిర్ణయం చేశారో తెలుసుకోడానికి అడుగుతున్నాను.

The Hon Sri D. SANJIVAYYA:— నేను 3 బస్సుల వాళ్ళు అని ఖచ్చితముగా చెప్పలేను. 1, 2, 3 బస్సులు ఉన్నవారికే కాదు, 5 బస్సులు ఉన్నవారికి కూడ ఆదాయము లేకపోవచ్చు, ఎందువల్లనంటే వాటియొక్క ఆదాయము ఆ route ని బట్టి ఉంటుంది ఇక్కడనుంచి గుత్తికిపోయే బస్సులకు మంచి ఆదాయం వస్తుంది. కాని సుంకేశలకు పోయే బస్సుకు petrol ఖర్చు కూడ గిట్టదు.

Sri P NARASIMHAPPA RAO:—అధ్యక్షా, ఇంతకు ముందు మంత్రిగారు సమాధానమిస్తూ, మెంబర్లు నేమో దన సహాయం చేయమని అన్నారు. మేము జీతాలు, భత్యాలు విడిచిపెడితే మంత్రులు కూడ జీతాలు విడిచి పెట్టుకుంటారా ?

The Hon Sri D. SANJIVAYYA:— చేయగలిగిన వాళ్ళందరూ చెయవచ్చు.

Sri V VISWESWARA RAO:—అధ్యక్షా, తక్కువ mileage ఉన్నటువంటి ప్రాంతాలలో వారు తక్కువ tax కడుతున్నారని చెప్పుతున్నారు. తక్కువ mileage ఉన్నందువల్ల వాళ్ళకు bus fares కూడ చాల తక్కువ వస్తుంది. కాని ఆ బస్సులకు పెట్టుబడి మాత్రము వాళ్ళు మామూలుగా అందరితోపాటే పెట్టవలసి యుంటుంది. కాబట్టి ప్రత్యేకంగా అటువంటి ప్రాంతాలు దృష్టిలో పెట్టుకొని అక్కడ వాటి mileage పెంచడానికి ప్రయత్నం చేస్తారా? దానివల్ల ప్రభుత్వానికి కూడ ఎక్కువ ఆదాయం వస్తుంది కదా ?

The Hon Sri D SANJIVAYYA:— తక్కువ tax కడుతున్నారని చెప్పుతూ వారికి mileage తక్కువ గనుక తక్కువ ఆదాయంవస్తుందని చెప్పుతున్నారు. నేనొక ఉదాహరణ చెప్పుతాను. బెజవాడనుండి బందరుకు పోయే route గాని, లేకపోతే గుంటూరునుంచి తెనాలికి పోయే route గాని చూడండి. అవి చాలా చిన్న routes అయినప్పటికిని వాళ్ళకు చాలా ఎక్కువ ఆదాయం వస్తుంది.

Sri K SUBBA RAO — ఈ Bus-owners కు ఆర్థికంగా సహాయం చేసేవానికి ముందు, ఈ చిన్న చిన్న బస్సువాళ్లుగాని, పెద్ద బస్సువాళ్లు గాని మద్రాసు మార్వాడీ వాళ్ళదగ్గర ఎంత అప్పు చేసినారో ప్రభుత్వానికేమైనా తెలుసు నా ?

The Hon. Sri D. SANJIVAYYA:—ప్రభుత్వానికి ఖచ్చితముగా తెలియదుగాని, వారు చాలా అప్పులలో ఉన్నారని నాకు తెలుసు.

Sri V VISWESWARA RAO.—బెజవాడ నుంచి బందరుకు రాను పోను వంద మైళ్ళని నాకు తెలుసును. వారికి లాభము వస్తుందనికూడ నాకు తెలుసు. కాని ఉప్పుటేరునుంచి పామర్రుకు 30 మైళ్ళు మాత్రమే ఉన్నది. ఆ బస్సువారికి మామూలుగా ఒక trip మాత్రమే జరుగుతూ ఉన్నది. ప్రభుత్వము దృష్టిలో 160 మైళ్ళు ఉన్నప్పుడు వారికి రెండు trips అయినా ఇవ్వవచ్చు. అవసరమైతే, పామర్రునుంచి అవనిగడ్డ వరకు extend చేయడానికి అవకాశమున్నది. ఆ విధంగాచేస్తే ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయము వస్తుంది. కాబట్టి ఆ route ను పెంచడానికి ప్రత్యేకంగా ఆలోచిస్తుందా ?

The Hon Sri D SANJIVAYYA:—అనేక సందర్భాలలో అక్కడ ఉన్నటువంటి అవసరాలనుబట్టి, ఇంకా మిగతా గ్రామాలకు కూడ రవాణా సౌకర్యాలు

14th March 1956]

ఏర్పాటుచేస్తే బాగుంటుదని తోచినప్పుడు, ఈ విధంగా extension ఇవ్వడంగాని, లేక more-trips ఇవ్వడంగాని allow చేస్తారు.

Sri P. GUNNAYYA—అధ్యక్షా, చిన్న బస్సు యజమానులకు ఏదో కొంత అప్పుగా ధన సహాయం చేస్తామని మంత్రిగారు సెలవిస్తున్నారు. కాని 15, 16, 20 బస్సులు ఉన్నవాళ్ళతో పాటు 1, 2 బస్సులు ఉన్నవాళ్ళున్నూ ఇంకా ఒకటికూడా లేనివాళ్ళు కూడ దరఖాస్తులు పెడుతున్నప్పుడు R. T. O. గారు, జిల్లా కలెక్టరుగారు హెచ్చు బస్సులు ఉన్నవాళ్ళకే routes ఇస్తున్నారు. 1, 2 బస్సులు ఉన్నవాళ్ళకు గాని బస్సులు లేనివాళ్ళకు గాని ఇవ్వకం లేదు. కనుక 1,2 బస్సులు ఉన్నవారికిని, బస్సులు ఇదివరకు లేనివారికిని preference ఇచ్చేటట్లు ప్రభుత్వము ఏమైనా orders జారీచేస్తారా ?

Mr SPEAKER:—బస్సులు లేనివాళ్ళకు ఎట్లా ఇస్తారండి.

The Hon. Sri D. SANJIVAYYA:—చట్టములో ఒక section ఉన్నది. ఆ section ప్రకారం చేస్తున్నారు. అందువల్ల మళ్ళీ ప్రత్యేకంగా వారికి instructions ఇవ్వవలసిన అవసరం కనపడదు.

Sri PRAGADA KOTAIAH :— Uneconomic గా కొన్ని routes ఉన్నాయని అంటున్నారు అనవసరమైన పెట్టుబడి పెట్టేదానికంటె ఆబస్సు permits అన్నీకూడ surrender చేయాలని ప్రభుత్వము కోరి, అవి కావాలన్న వారికి ఇచ్చేస్తుందా?

The Hon. Sri D. SANJIVAYYA.— Surrender చెయమని కోరదు గాని కొన్నిచోట్ల ఈ permits అమ్ముకోవడంవల్ల tax కట్టకుండాపోవడమూలంగా ఆ permits expire కావడం జరుగుతూంది.

Sri S VEMAYYA·—ఎక్కువ బస్సులు ఉన్నటువంటి వాళ్ళకు ఏదైనా ఒక maximum పెట్టి దానికి మించకుండా అరికట్టే విధానమేదైనా ప్రభుత్వ ఆలోచనలో ఉన్నదా ?

The Hon Sri D SANJIVAYYA — ఒక కమిటీని ఏర్పాటు చేశాము. ఆ కమిటీవారు రిపోర్టు ఇచ్చినారు. అది ఇంకా publish కాలేదు. ఆ రిపోర్టులో ఉన్నటువంటి సిఫార్సులన్నీ పరిశీలించే ఏదైనా ఒక నిర్ణయం చేయాలి.

Sri B. RAMA REDDI·— మంత్రిగారు నా ప్రశ్నకు జవాబు చెప్తూ ఆలోచిస్తామని అన్నారు. ఈ ఆలోచనకు అంతు ఏమైనా ఉన్నదా ?

The Hon Sri D. SANJIVAYYA:—ప్రతిదానికి అంతు ఉన్నదండి ఈ జగత్తులో.

Sri S. RANGANATHA MUDALIAR :—Whom do you call small bus-owners, Sir ?

The Hon. Sri D. SANJIVAYYA ·—Single bus operators and operators who have 2 or 3 buses, are small bus owners

[14th March 1956

[Note An asterisk * at the Commencement of 'a speech denote revision by the Member]

## 11. BUDGET FOR THE YEAR 1956-57 (Contd)

### VOTING OF DEMANDS FOR GRANTS FOR 1956–57 (Contd)

### *(1) Demand I — Land Revenue*

**The Hon Sri K CHANDRAMOULI**.—అధ్యక్షా! డిమాండు నెం. 1 భూమిశిస్తుక్రింద 72,99,800 రూపాయలకు మించని మొత్తాన్ని ప్రభుత్వానికి యివ్వాలని గవర్నరు సిఫార్సుమీద నేను ప్రతిపాదిస్తున్నాను.

2 భూమిశిస్తువసూలు భారాన్ని వహించడమేగాక ఇతరపనులుకూడా నిర్వర్తించే జిల్లా రెవిన్యూ పరిపాలననిమిత్తం అయ్యే ఖర్చు 11 వ డిమాండులో చేర్చబడిన 25 సాధారణ పరిపాలన జిల్లాపరిపాలన పద్దులో వ్రాయబడుతోంది ఒక్క భూమిశిస్తు వ్యవహారాల నిర్వహణ సందర్భంలో ప్రత్యేకంగా అయ్యేఖర్చు పెద్దపద్దు "7 భూమిశిస్తు" క్రింద వ్రాయబడుతుంది. ఇది "గ్రాంట్ల డిమాండుల" క్రింద డిమాండు నెం. 1 గా ఏర్పడుతుంది. ఈపద్దుక్రింద ఖర్చు 5 తరగతులుగా ఉంటుంది. (1) నిర్వహణ ఖర్చు (2) సర్వే సెటిల్మెంటు, రికార్డు పనులు (3) భూమి రికార్డులు (4) భూములను ఇవ్వడం, నష్టపరిహారాలు (5) జమీందారీల రద్దు నిధికి బదిలీ.

3. ఈ అంశములో ఒక్కొక్కదానికి బడ్జెటులో గల అవసరాలను గురించి చెప్పేముందు, రాష్ట్రంలోని భూమిశిస్తు విధానంలోని ముఖ్యాంశాలను, యీ పద్దుకు సంబంధించి ఇటీవల సంవత్సరాలలో ప్రభుత్వం నిర్వహించిన ముఖ్యమైన ఇతర కార్యక్రమాలగురించి సంగ్రహంగా చెబుతాను.

(అ) ఈ రాష్ట్రంలో అమలులోనున్న ముఖ్యమైన రెండు కౌలు పద్ధతులు రైత్వారీ, జమీందారీ పద్ధతులు. జమీందారీ కౌలు పద్ధతి అమలులో ఉన్నచోట భూమిశిస్తు ఏర్పాటులో ప్రభుత్వము, జమీందారు మాత్రమే ఉంటారు. ఇప్పుడు దానికి ప్రాముఖ్యములేదు జమీందారీ విధానపు అవసరం తీరినదని దానికి కాలదోషం పట్టినదని ప్రభుత్వానికి నమ్మకం కలిగినది. కాబట్టి దానిని రద్దుచేయడానికి నిశ్చయించింది. 1948 మద్రాసు జమీందారీల రద్దు, రైత్వారీలలోనికి మార్పు - చట్టశాసనమై, 19–4–1949 నుండి అమలులోనికి వచ్చిన విషయం సభవారికి తెలిసియే ఉన్నది.

రాష్ట్రంలో ఎక్కువ ప్రాంతంలో రైత్వారీ కౌలు పద్ధతి అమలులో ఉంది. ఇది క్రోడీకరింపబడలేదు. రాష్ట్రంలోని రైత్వారీ ప్రాంతాలు తరగతి వారీగా పరిశీలింపబడి అలా పరిశీలింపబడిన ప్రతి యూనిట్టుకు ప్రత్యేకంగా పన్ను నిర్ణయించబడినది. సాధారణంగా భూములలో రెండు రకాల భూములు - మాగాణి, మెట్ట - గుర్తింప బడుతాయి. పండిన పంటలో ప్రభుత్వ భాగపు విలువను డబ్బు రూపంలో భూమి పన్ను చూపిస్తుంది. ప్రతి ముప్పది సంవత్సరాలకు ఒకమారు ప్రభుత్వ భాగపు విలువ పునః పరిశీలింపబడుతుంది. ఈ కార్యక్రమం "రిసెటిల్మెంటు" అనబడేది. ఈ పునఃపరిశీలనవల్ల మొదట చేయబడిన నిర్ణయాలలోని తప్పులు, అసమానతలు దిద్దుబాటు కాగలవు. అంతే

14th March 1956] (Sri K. Chandramouli)

కాక దీనివల్ల, రైతులు స్వయంగా చేయుని అభివృద్ధులవల్ల, అనగా రైతులకు సులభంగా సరుకు విక్రయానికై సౌకర్యాలను కల్పించే రైలుమార్గం ఏర్పరచడంవలన, లేక ధరలు పెరగడంవలన, వారు పొందే లాభాలలో భాగం అడగడానికి ప్రభుత్వానికి వీలు చిక్కుతుంది. భూమి శిస్తు విధానపు సంస్కరణ విషయంలో నిర్ణయం తీసుకునేవరకు, పునఃపరిశీలన కార్యక్రమం 1937 నుండి నిలిపివేయబడింది.

భూమి శిస్తు ప్రతి సంవత్సరం వాయిదాలలో, వివిధ జిల్లాలలో నిర్ణయింపబడిన తేదీలలో లేక ఆ తేదీలకు ముందు, చెల్లించబడాలి. ఒక ప్రాంతంలో ముఖ్య పంటలు నూర్చబడే కాలాన్నిబట్టి యీ తేదీలు నిర్ణయింప బడుతాయి. భూమి శిస్తు సామాన్యంగా గ్రామంలో గ్రామ మునసబుకు చెల్లించబడాలి. 1864 మద్రాసు రెవెన్యూ రికవరీ చట్టంలో భూమిశిస్తు బకాయిలను రాబట్టుకోడానికి తగిన నిబంధనలున్నవి.

(ఆ) మరి, భూ సంస్కరణలను ప్రవేశపెట్టే విషయం ఒకటి ఉన్నది. ఇతర విషయాలతో పాటు, రాష్ట్రంలోని రైత్వారీ ప్రాంతాలలో అమలులో నున్న భూమి శిస్తు విధానాలను సంస్కరించే విషయంలో, తనకు సలహా చెప్పడానికి, 1950 మే నెలలో సమిష్టి రాష్ట్ర ప్రభుత్వం భూమి శిస్తు సంస్కరణల సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈ కమిటీ అంతకుముందు, ప్రత్యేకాధికారిగా శ్రీ ఎస్. రాఘవేంద్రరావుగారు సమర్పించిన నివేదికనూ, కాంగ్రెసు వ్యవసాయ సంస్కరణల సంఘ నివేదికనూకూడ పరిశీలించినది. భూమిశిస్తు సంస్కరణలకు సంబంధించిన తన రెండవ నివేదికలో ఇది 15-8-1951 లో ప్రకటింపబడినది. భూమిశిస్తు సంస్కరణల సంఘం కొన్ని సిఫార్సులను చేసినది. అవి పరిశీలనలో ఉన్నాయి.

ఈ రాష్ట్రంలోని భూ సంస్కరణల విషయాన్ని పరిశీలించి, ప్రస్తుతపు సాంఘిక పరిస్థితులను, అవసరాలను దృష్టిలో పెట్టుకొని, ప్రభుత్వానికి సిఫార్సుచేసే నిమిత్తం యీ ప్రభుత్వం ఒక భూ సంస్కరణల కమిటీని నియమించిన విషయం సభవారికి విదితమే. ఈ కమిటీ ఇటీవల తన నివేదికను సమర్పించినది. అది పరిశీలింప బడుతున్నది దానిపై నిర్ణయాలు తీసుకొన్నపిదప శాసనం చేయడానికి అవసరమయిన చర్య తీసుకో బడగలదు.

(ఇ) బడ్జెట్ లోటును కొంతవరకూ పూర్తిచేయడానికీ, రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద అభివృద్ధి కార్యక్రమాలకు, ప్రణాళికలకు కావలసిన అదనపు ఖర్చు నిమిత్తం అదనంగా ఆదాయాన్ని రాబట్టే నిమిత్తము కూడా అభివృద్ధి పన్ను, ఇనాముల మీద పూర్తి మదింపు, భూమిశిస్తుమీద సర్‌ఛార్జి వసూలు చేయడానికి యిటీవల శాసన రీత్యా కొన్ని చర్యలు తీసుకొన బడినవి. ఈ క్రొత్త పన్నుల వసూలువల్ల యించుమించు రు. 87 లక్షల అదనపు రాబడి రాగలదని భావించబడు చున్నది.

(ఈ) ఇప్పుడు సర్వే, భూమి రికార్డుల శాఖను గురించి కొంచెం చెబుతాను. అది ముఖ్యంగా రెండు పనులు చేయాలి. ఒకటి సర్వే చేయవలసిన క్రొత్త విషయాలకు సంబంధించినట్టిది. రెండవది రైత్వారీ ప్రాంతాలలో ఇదివరకే పూర్తి చేయుబడిన సర్వే నిర్వహణకు సంబంధించినట్టిది. కమతాల సరిహద్దులను నిర్ణయించడం, ప్రతి రివెన్యూ క్షేత్రపు సంఖ్య, స్వభావము, కొలు ప్రామాణము ఆ భూమి ఎవరి యాజమాన్యంలో ప్రసిద్ధంగా ఉన్నదో ఆ విషయము తెలియజేస్తూ మాప్‌లను రిజిస్టర్లను తయారుచేయడం-ఇది సర్వే లక్ష్యం. మద్రాసుసర్వే, సరిహద్దుల 1923,8వ చట్టపు నిబంధనల క్రింద సర్వే కార్యక్రమం

(Sri K Chandramouli) [14th March 1956

జరుప బడుతుంది "నిర్వహణ" అంటే ప్రస్తుతపు సర్వే స్వరూపాన్ని ఎప్పటికప్పుడూ సరిదిద్దుతూ ఉండడం. సరిహద్దు రాళ్ళుపోతే వాటి స్థానములో క్రొత్త రాళ్ళను వేయడం, భూమిని ఖండాలుగా విభజించడంవల్ల వచ్చేమార్పులను సర్వేప్లానులలో చేర్చడం మొదలైనవి, పట్టణాలను వీధులను సర్వేచేయడం, పెద్ద పెద్ద బంజరు ఖండాలను విభజించడం ప్రాజెక్టుల క్రిందికి క్రొత్తగా తీసుకోనబడు ప్రాంతాలను పూర్తిగా సర్వేచేయడం ఇవి యీ శాఖచేసే ఇతరముఖ్యమైన పనులు. ఇటీవల జమీందారీల రద్దు చట్టం క్రింద స్వాధీన పరచుకోనబడిన ప్రాంతాలను గూడ ఈ శాఖ సర్వేచేస్తున్నది.

సర్వేశాఖ రివిన్యూబోర్డు అజమాయిషీకి లోబడి పనిచేస్తుంది. ఈశాఖ నిర్వహణకు సంబంధించిన విషయాలలో బోర్డుకి సర్వే భూమిరికార్డుల డిప్యూటీ డైరెక్టరు సహాయం చేస్తాడు. మద్రాసులోని కేంద్ర సర్వే కార్యాలయం మద్రాసు ప్రభుత్వం అజమాయిషీ క్రింద పనిచేస్తూ, మాప్‌లను తయారుచేసి, వాటిని ఇతర శాఖలకు సంబంధించిన చిత్రాలను ముద్రిస్తూ ఉంటుంది. అయిదు సంవత్సరాలవరకూ వాటిలో సగంవరకు యీ ప్రభుత్వం తీసుకోనడానికి సౌకర్యాలను కల్పించాలనీ, ఖర్చు లాభ-నష్టాలు లేనిపద్ధతిపై లెక్కించాలని ఒప్పందం చేసుకోబడింది. కేంద్ర సర్వే కార్యాలయం ప్రస్తుతానికి ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాల సమిష్టిసంస్థగా పరిగణింప బడుచున్నది. సర్వే పనిని సంచార సిబ్బంది చేస్తుంది ఇందు నిమిత్తం సర్కిల్ ఆఫీసర్లు ఉన్నారు. వారికి డిప్యూటీ సర్వేయర్లు, ఫీల్డు సర్వేయర్లు, సహాయం చేస్తారు ప్రతి జిల్లాలోను జిల్లా సర్వేయర్లు, తాలూకా సర్వేయర్ల సహాయంలో నిర్వహణ పనిని సాగిస్తాడు. ఇందుకు సంబంధించిన సిబ్బంది జిల్లా కలక్టరు అజమాయిషీకి లోబడి పనిచేస్తుంది.

జమీందారీల రద్దుచట్టం క్రింద స్వాధీన పరచుకోనబడిన జమీందారీల సర్వే సందర్భంలో ఆంధ్రలో 1-11-1954 వరకూ మూడు సర్వే పార్టీలు, రెండు డిటాచ్‌మెంట్లు, సగం పార్టీలు ఉండేవి. ఈ సిబ్బందితో జమీందారీల రద్దుచట్టం క్రింద స్వాధీనం చేసుకోనబడిన ప్రాంతాల సర్వే పది సంవత్సరాలకు గాని పూర్తికాదని అంచనా వేయబడింది. సర్వే, సెటిల్మెంటు కార్యక్రమాల వేగాన్ని హెచ్చించే నిమిత్తము ప్రభుత్వం ఒంగోలు, కాళహస్తిలలో గల 'డిటాచ్‌మెంట్ల'ను రెండింటిని 1-11-1954 నుండి పూర్తి పార్టీ స్థాయికి తీసుకువచ్చినది. ఆ తరువాత మరి నాలుగు సర్వే పార్టీలు, రెండు శాఖలుగల మూడవ సెటిల్మెంటు పార్టీకూడా మంజూరు చేయబడినవి. క్రొత్త సర్వే పార్టీలు నాలుగు 15-6-1955 నుండీ బ్రాంచి సెటిల్మెంటు ఆఫీసులు గల క్రొత్త సెటిల్మెంటు పార్టీ 1-9-55 నుండీ పని ప్రారంభించినవి. ఈ అదనపు సిబ్బందితో, జమీందారీల రద్దు చట్టంక్రింద స్వాధీనం చేసుకోనబడిన అన్ని జమీందారీలలోను సర్వే కార్యక్రమం 1958-'59 నాటికి, సెటిల్మెంటు కార్యక్రమం 1961-62 నాటికి పూర్తి కాగలదని అంచనా వేయబడింది. జమీందారీలలో యీ కార్యక్రమాలు రెండూ జరిపించవలసిన మొత్తం ప్రదేశం వైశాల్యం యించుమించు 17,991 చదరపు మైళ్ళు. దీనిలో 1956 జనవరి నెలాఖరు నాటికి 7,240 చ॥ మైళ్ళలో సర్వే కార్యక్రమము 4,046 చ॥ మైళ్ళలో సెటిల్‌మెంటు కార్యక్రమము పూర్తి చేయబడినది.

సర్వేకాని జమీందారీ ప్రాంతాలలో వేలాది చదరపు మైళ్ళ విస్తీర్ణంలో, రైత్వారీ సూత్రాలపై సర్వే సెటిల్మెంటు కార్యక్రమాలు జరిపించడానికి నిర్ణయింప

బడినందున ఈ పద్దు క్రింద పెద్ద మొత్తం అవసరమయింది భూస్వాములకు చెల్లించ వలసిన తుది నష్ట పరిహారం రైత్వారీ రేట్ల ప్రకారం లెక్క కట్టవలసి వున్నందున ఈ కార్యక్రమాలను సాధ్యమైనంత త్వరగా జరిపించడానికి ఎక్కువమంది సిబ్బంది నియామకం అత్యవసరమైనది. తుది నష్ట పరిహారం చెల్లించబడేవరకూ, భూస్వాములకు ప్రతి సంవత్సరము తాత్కాలిక చెల్లింపులను వుండాలని కూడా సభవారికి తెలిసియే వున్నది. తుది నష్టపరిహారం చెల్లించబడినప్పటినుండి, యిలా సొమ్ము కట్టవలసిన అవసరం తీరిపోయింది. ఈ శాఖల కార్యక్రమాల గమన స్థాయిని హెచ్చించడానికి యిదొక అసలు కారణం.

(ఈ) ఇంక భూముల కేటాయింపు గురించి, భూముల అన్యాక్రాంతిమును గురించి చెబుతాను. ప్రభుత్వపు భూములు 'క్రౌన్ గ్రాంట్ల' చట్టం కింద పై రెండు పద్ధతులలోను, ఏదో ఒక పద్ధతి కింద యివ్వబడతాయి భూమిని ప్రైవేటు 'బాడీ' లేక వ్యక్తికి యిచ్చేటప్పుడు అన్యాక్రాంతపు పద్ధతి కాక, రెండవ పద్ధతి అసైన్ మెంటు అవలంబింపబడుతుంది. ఈ పద్ధతి కింద భూమిని తాత్కాలికంగా గాని, శాశ్వతంగా గాని యివ్వవచ్చును. ఒక భూమి ఏదైనా ప్రజోపయోగార్థం అవసరం కాగల అవ కాశం వున్నా, లేక దానిని శాశ్వతంగా యిచ్చివేయటం మంచిదికాదని, భావింపబడినా, అది తాత్కాలిక ప్రాతిపదికపై యివ్వబడుతుంది.

ప్రభుత్వపుభూములు, సాధారణంగా వ్యవసాయభూములు వ్యవసాయేతరభూములు అని రెండు తరగతులుగా విభజింప బడుతాయి. (1) మదింపుచేసిన బంజరు (2) మదింపు చేయనిబంజరు. (3) పోరంబోకులు (4) కేటాయించబడిన భూములు. మదింపుచేసినబంజరు విషయంలో తగిన మదింపు రేటుతో, భూమి తరిగతి తెలియచేయబడుతుంది 2వ రకం విషయములో యిది తెలియచేయబడదు ప్రత్యేక ప్రయోజనాలకై అవసరమైన లేక అవసరం కాగలదని వుంచిన భూమి "కేటాయించబడిన" భూమి అని చెప్పబడుతుంది. కాని భూములు ప్రత్యేక విలువగల భూములు కాకుండా పరగణింపబడుతాయి. వివిధ తరగతులకు వర్తించే నిబంధనలు బోర్డు స్టాండింగ్ ఆర్డర్లు 15 లో పేర్కొనబడినవి.

రాజకీయ బాధితులకు భూములను యిచ్చే విషయంలోను వేరు వేరు తరగతుల వ్యక్తులకు ప్రాధాన్యత యిచ్చే విషయంలోను, గడచిన కొంతకాలమునుండి, సమిష్టి మద్రాసు రాష్ట్రంలో, సాగుకై ప్రభుత్వ భూములను యిచ్చేవిధానము తరచు మారుతూవున్న సంగతి సభవారికి విదితమే.

ఈ రాష్ట్రం ఏర్పడిన పిమ్మట సాగుకై ప్రభుత్వ భూములను యిచ్చే విషయం పూర్తిగా పరిశీలింపబడి, కొత్త విధానం రూపొందింపబడినది. ఈ విధానములో ముఖ్యాంశములు ఇవి.

1. భూములు లేని పేదవారందరూ, మాజీ కల్లుగీత పనివారు, వెనుకబడిన తరగతులు నేతపనివారితో సహా స్వంతముగా వ్యవసాయం చేసుకొనేట్టయితే ప్రభుత్వ భూమిని రెండున్నర ఎకరాల మాగాణినిగాని, 5 ఎకరాల మెట్టనుకాని పొందనర్హులు.

2. ఒకరైతు భూమిలేని పేద కాకపోయినప్పటికీ అతని భూములను అంటివుండి ఆ భూముల ఫలసాయాన్ని సౌలభ్యంగా అనుభవించ డానికి అవసరమైన భూ ఖండాలు

(Sri K Chandramouli) [14th March 1956

మాగాణి అయితే ఒక ఎకరానికి మెట్ట అయితే రెండు ఎకరాలకు మించని పక్షములో వాటిని ఆ రైతులకు పూర్తి బజారుధర తీసుకొని యివ్వవచ్చును.

3 ప్రాజెక్టుల వల్ల మార్పులు చెందిన భూములు తప్ప మిగిలినవి ఉచితంగా యివ్వబడతాయి ప్రాజెక్టులవల్ల మార్పులు చెందిన భూముల విషయములో అవి సాగు క్రిందికి రాకపూర్వము ప్రాజెక్టుల అంచనాల ప్రకారం వాటికిగల విలువమేరకు ధరకట్టబడుతుంది. ఇది 20 వార్షిక వాయిదాలతో వసూలు చేయబడుతుంది.

4 సాగుకు యివ్వబడిన భూములు వంశపారంపర్యంగా అనుభవించాలేగాని, అన్యాక్రాంతము చేయకూడదు. భూమిని పొందిన 3 సంవత్సరాలలో భూమిని పొందిన వ్యక్తికాని లేక అతని కుటుంబీకులుగాని స్వంతంగాపని చేసిగాని లేదా అతని లేక వారి అజమాయిషీక్రింద కూలి మనుష్యులచే పని చేయించడం ద్వారా కాని సాగులోనికి తేవాలి.

రిజిష్టరైన సహకార సంఘాలకు కూడా భూములు యివ్వబడవచ్చు. అయితే వాటి సభ్యులందరు భూములులేని పేదవారై వుండాలి. అలాగే ఒక సంఘానికి యివ్వబడిన భూమి పరిమితిదాని సభ్యులకు విడివిడిగా యిస్తే వుండగల భూమి పరిమితిని మించకూడదు.

6. ప్రభుత్వ భూములను ఆక్రమించుకొన్నవారు భూములులేని పేదవారు కానప్పుడు వారి ఆక్రమణనుండి పూర్తిగా తొలగింపబడతారు. ఆక్రమణదారులు భూములు లేని పేదవారైన పక్షంలో నిర్ణీత పరిమితికి - రెండున్నర ఎకరాల మాగాణి, 5 ఎకరాల మెట్ట - మించి వున్న భాగంనుంచి తొలగింపబడతారు. ఆ విధంగా విడుదలైన భూములు అర్హులైన ఇతరులకు యివ్వబడతాయి.

7. కొత్త విధానంలో రాజకీయ బాధితులకు భూములను యిచ్చే విషయము కూడా తలపెట్టబడినది. ఉత్తరువుల ప్రకారము, రాజకీయ బాధితుల విషయము 14-4-1952 నాటికి వాయిదాలో వుంది. అవి 1952 లో ప్రకటింపబడిన విధానంలోని మార్పులవల్ల నిలిపివుంచబడిన పక్షంలో అవి 14-4-1952 నాటికి అమలులో గల నిబంధనల ప్రకారం పరిశీలింపబడాలి. అయితే రాజకీయ బాధితుల దరఖాస్తులు అన్నీ కూడా వారు మొదట దరఖాస్తుచేసిన తేదీనాటికి లేదా తాత్కాలికంగా సాగుకివ్వబడిన తేదీనాటికి భూములు లేని పేదల శివైజమా ఆక్రమణలో వున్నట్టయితే, నిరాకరింపబడుతాయి. కొత్త పద్ధతికింద గడచిన ఒకటిన్నర సంవత్సరములోను ఇంచుమించు 83,100 పేదవారికి సుమారు ఒక లక్ష ఎకరాలు, యించుమించు 1500 రాజకీయ బాధితులకు 8,600 ఎకరాలకు పైగాను యివ్వబడినట్టు యిటీవల 'ప్రోగ్రెస్' నివేదికవల్ల తెలుస్తున్నది.

(ఊ) ఇంక జమిందారీల రద్దు విధినిగురించి సంగ్రహంగా చెబుతాను. జమీందారీ రద్దు చట్టంకింద స్వాధీనం చేసుకొనవలసిన రెండవ జాబితా జమీందారీలను నోటిఫై చేయటానికి పూర్వం 7-9-1950 న సమిష్టి మద్రాసు ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి వారి అంగీకారం కోసం వ్రాసినది అప్పుడు కేంద్ర ప్రభుత్వము కొన్ని షరతులు పెట్టినది. నష్టపరిహారపు శేషాన్ని చెల్లించే నిమిత్తం స్వాధీన పరచుకొనబడిన జమీందారీలలో ప్రతి సంవత్సరం వసూలుచేయబడే రాబడి మిగులులో సమిష్టి

మద్రాసు ప్రభుత్వము ఒక నిధిని యేర్పాటుచేసి, ఆ నిధి కేంద్ర ప్రభుత్వపు 'సెక్యూరిటీలలో' నిల్వచేయాలనేది ఆ షరతులలో ఒకటి ఈ నిధి జమీందారీ రద్దు నిధి అని వ్యవహరించబడుతున్నది. కేంద్ర ప్రభుత్వము విధించిన ఈ షరతుల ప్రకారము స్వాధీనమైన జమీందారీ ప్రాంతాలలో నికరం వసూళ్ళు నిర్వహణ, మానేజిమెంటు, చెఱువులు మొదలైన వాటికి ప్రత్యేక మరమ్మత్తుల కయ్యే డబ్బునూ, జమీందారీల రద్దు జరగకుండ వుంటే ఈ ప్రభుత్వానికి రాగల పేష్కస్‌ను కూడా మొత్తం రాబడినుండి మినహాయించి రివిన్యూ కాతానుండి డిపాజిట్టు కాతాకు బదలీ చేయబడుతాయి. సమిష్టి రాష్ట్రం విభజింపబడే నాటికి, జమీందారీలు రద్దు నిధికి బదిలీ చేయబడిన సొమ్మునుండి మొత్తం రూ 42.50 లక్షలు కేంద్ర ప్రభుత్వపు 3% అప్పులలో నిల్వచేయబడినవి. 1953–54 రెండవ భాగానికి రూ 12 80 లక్షలు ఈ నిధిలో చేర్చబడినవి. 1954_55, 1955_56 లలో సంవత్సరానికి రూ 13 లక్షల చొప్పున ఈ నిధికి చేర్చబడినది.

శేషించిన మద్రాసు రాష్ట్రపు రివెన్యూ బోర్డునుండి, కొందరు కలెక్టర్ల వద్దనుండి కొన్ని ముఖ్యమైన వివరాలు రావలసి వున్నందున, ఈ నిధికి సంబంధించిన ప్రోఫార్మా లెక్కలకు యింకా తుది రూపం యివ్వబడలేదు.

భూస్వాములకు శేషించిన నష్టపరిహారాన్ని చెల్లించడానికి వుపయోగించే నిమిత్తం ఈ నిధి ఏర్పాటు చేయబడినది.

4. ఇప్పుడు ఈ పద్ధతులలోని అంశములపై ఖర్చునుగురించి క్లుప్తముగా చెబుతాను.

జమీందారీలలో శిస్తు తగ్గింపుచట్టం నిర్వహణ నిమిత్తం నియమించబడిన అధికార్ల సిబ్బంది కింద అయ్యేఖర్చు నిర్వహణ ఖర్చుకిందకు వస్తుంది. అయితే యిది ఆయా భూస్వాములనుండి వారి తరపున వసూలు చేయబడిన సొమ్మునుండి పదవవంతు వసూలు రుసుముగా మినహాయించు కొనడం ద్వారా తిరిగి రాబట్టబడుతుంది జమీందారీల రద్దు చట్టంకింద నియమించబడిన ట్రిబ్యునల్‌ల కింద అయ్యే ఖర్చుకూడా ఈ పద్దుకింద వ్రాయబడుతుంది. 1956–57 బడ్జెట్ అంచనాలో ఈ పద్ధతికింద రూ 124,400 కేటాయించబడినవి.

మద్రాసులోని కేంద్రసర్వే కార్యాలయం నిమిత్తం అయ్యే ఖర్చులో భాగమూ, జిల్లాలలో పనిచేసే రేంజీలు సంచార సర్వే సిబ్బంది నిమిత్తము అయ్యే ఖర్చు కలసి సర్వే సెటిల్మెంటు, రికార్డు పనుల ఖర్చుకిందకి వస్తాయి. అలాగే 1948 జమీందారీల రద్దుచట్టం కింద ఎస్టేటులో సర్వే సెటిల్మెంటు, జమీందారీల స్వాధీనాన్ని అజమాయిషీచేసే సెటిల్మెంట్ల డైరెక్టరుకింద అయ్యే ఖర్చు, వాటిని రైత్వారీ కాలు పద్ధతికింపకు మార్చడానికయ్యే ఖర్చుకూడా పై ఖర్చు కిందకు వస్తాయి. ఈ అంశములకై 1956-57 బడ్జెట్ అంచనాలో రూ. 42,83,600 కేటాయించ బడినవి.

భూమి రివార్డులకింద ఖర్చు రైత్వారీ మునిసిపల్ యూనియన్ సర్వేలు మొదలైన వాటి నిర్వహణకు కాగలదు. ఈ పద్దుకింద బడ్జెట్ అంచనాలో రు. 5,72,500 కేటాయించ బడినవి.

కేటాయింపులు నష్టపరిహారాలకింద ఖర్చులో స్థానిక సంస్థలకు వాటి తరపున రివిన్యూశాఖచే వసూలు చేయబడిన మత్స్యనిలయాల కొల్లు, చెట్టుపన్ను సందర్భంలో,

చెల్లింపులకింద అయ్యే ఖర్చు మునిసిపలు ప్రాంతాలు మొదలైన వాటిలో భూములపై మామూలు వ్యవసాయపు మదింపుకుపైన వసూలు చేయబడే శిస్తూ గ్రాండు రెంటులో మిగులుకు, మునిసిపాలిటీలకు అయ్యే ఖర్చు కలసి వుంటాయి.

మత, విద్యా లేక ధర్మసంస్థలకు చెందిన ప్రతి ఎస్టేటు లేక ఎస్టేటులోని కొంత భాగము సందర్భంలో 1947 మద్రాసు ఎస్టేటు భూముల శిస్తు తగ్గింపు చట్టపు నిబంధనల కింద శిస్తు తగ్గించబడినది. అందువల్ల ఆ సంస్థలకు రాబడిలో ఏమైనా నష్టం వచ్చినట్లయితే దానిని ప్రభుత్వపు పై చట్టపు 5 వ సెక్షన్ కింద, భర్తీచేయవలసి వున్నది. బడ్జెట్ అంచనాలలో ఈ పద్దుకింద రూ. 10,19,300 కేటాయించ బడినవి.

స్వాధీన బరచుకొనబడిన జమీందారీలలో వసూలైన సొమ్ములోని, మిగులు జమీందారీల రద్దునిధి ఎడిలీ ఖర్చుకిందకి వస్తుంది. ఇందు నిమిత్తం బడ్జెట్ లో రూ 1300,000 కేటాయించబడినది. కాబట్టి ఈ డిమాండు పూర్తిగా న్యాయమైనది. దీనిని పూర్తిగా అంగీకరించాలని సభవారిని నేను కోరుతున్నాను.

### (II) Demand No. XXXIII Compensation to Zamindars

అధ్యక్షా ! గవర్నరుగారి సిఫార్సుమీద 33 వ డిమాండుగా జమీందారులకు నష్టపరిహారం క్రింద 20 లక్షల 40 వేల రూపాయలకు మించని మొత్తాన్ని ప్రభుత్వానికి అనుమతించ వలసినదిగా ప్రతిపాదిస్తూ ఉన్నాను.

జమీందార్లకు నష్టపరిహారం అనే ఈ డిమాండు మధ్య దళారీలను లేకుండాచేసి ఎస్టేటు భూములను రైత్వారీ ప్రాంతాలుగా మార్చడానికి ఉద్దేశించి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసనబద్ధం చేయబడిన ఒక చరిత్రాత్మక మయిన భూసంస్కరణకు సంబంధించిన విషయం 1948 వ సంవత్సరం మద్రాసు జమీందారీ రద్దు చట్టం క్రింద 1949 ఏప్రిల్ 19 వ తేదీన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో అమలులోనికి వచ్చింది. దక్షిణ భారతంలోని భూమిశిస్తు విధానాల సంస్కరణలలో యిది ఒక ప్రధానమై నటువంటి సంఘటన. 7-9-49 న ప్రప్రథమంగా కొన్ని ఎస్టేట్లను ఈ శాసనం ద్వారా ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. అనాదినుండి క్రమంగా అన్ని జమీందారీలు, ఎస్టేట్లు, ఈనాములు ప్రభుత్వపు స్వాధీనం లోనికి వచ్చినవి. అవన్నీ సర్వేచేయబడి రైత్వారీపద్ధతుల్లో సెటిల్మెంటు పనులు జరుగుతున్నవి. స్వాధీనం చేసుకొనబడిన ఎస్టేట్ల భూకామందులకు నష్టపరిహారం యివ్వాలని చట్టంలోనే నిర్ణయించబడి వున్నది. నష్టపరిహారాన్ని లెక్కగట్టి నిర్ణయించే విధానము చట్టంలోనే పేర్కొనబడిఉన్నది. నష్టపరిహారం ఎస్టేటు మొత్తానికి లెక్కగట్టి నిర్ణయించ బడుతుంది గాని, దానిలోని వివిధ ఆస్థి ప్రయోజనాలకు ప్రత్యేకంగా నిర్ణయింపబడదు.

స్వాధీనం చేసుకున్న ప్రతి ఎస్టేటు విషయంలోనూ ప్రాతిపదికగా ఏడాదికి చెల్లించవలసిన మొత్తాన్ని నిర్ణయించి, దాని ఆధారంతో ఆయా ఎస్టేట్లకు ఇవ్వవలసిన నష్టపరిహారాలు నిర్ణయించబడుతూ ఉంటవి. జమీందారీ ఎస్టేట్ల విషయములోను, సెటిల్మెంటు తర్వాత ఏర్పడిన undertenure estates విషయంలోను ఈ సాంవత్సరిక మొత్తం సుమారుగా సంవత్సరపు రైత్వారీ డిమాండు, రైత్వారీలోనికి మార్చిన తర్వాత

వచ్చే యితరచిల్లర ఆదాయాలలో మూడవవంతుగా మాత్రం ఉంటుంది, ఈనాముఎస్టేట్లు, సెటిల్మెంటుకు పూర్వపు ఎస్టేట్ల విషయంలో ఈ మొత్తం సంవత్సరపు రైత్వారీ డిమాండు రైత్వారీలోనికి మార్చబడిన తర్వాత వచ్చే యితర చిల్లర ఆదాయాలకు సరిసమానంగా ఉంటుంది. ఈ విధంగా ప్రాతిపదిక మొత్తాన్ని నిర్ణయించుకున్న తర్వాత ఎస్టేటుకు యివ్వవలసిన పూర్తి నష్టపరిహారం ఈ క్రింది విధంగా లెక్కగట్టబడుతూ ఉంటుంది.

ఏడాది ప్రాతిపదిక మొత్తం వెయ్యిరూపాయలకు మించని ఎడల దానికి ముప్పయి రెట్లు, ఏడాది ప్రాతిపదిక మొత్తం వెయ్యిరూపాయలకు మించి మూడు వేలకు మించని ఎడల దానికి 25 రెట్లుగాని లేక ముప్పయివేలుగాని, ఏది ఎక్కువైతే అది. ఏడాది ప్రాతిపదిక మొత్తం మూడువేలకు మించి 20 వేలకు మించనిఎడల దానికి 20 రెట్లుగాని లేక 75 వేలుగాని, ఏది ఎక్కువయితే అది. ఏడాది ప్రాతిపదిక మొత్తం 20 వేలకు మించి 50 వేలకు మించని ఎడల దానికి 17½ రెట్లుగాని లేక 4 లక్షలు, ఏది ఎక్కువయితేఅది. ఏడాది ప్రాతిపదిక మొత్తం 50 వేలు మించి 1 లక్షకు మించని ఎడల దానికి 15 రెట్లు లేదా 8 లక్షల 75 వేలు ఏది ఎక్కువయితే అది ఏడాది ప్రాతిపదిక మొత్తం 1 లక్షకుమించిన ఎడల దానికి 12½ రెట్లు లేదా 15 లక్షలు, ఏది ఎక్కువయితే అది.

ఎస్టేట్లో సర్వే జరిపించి సెటిల్మెంటు పూర్తయి ఆయా ఎస్టేట్లనుండి సంవత్సరానికి రావలసిన రైత్వారీ డిమాండు యితర చిల్లర ఆదాయాలు రైత్వారీ విధానాల ద్వారా నిర్ణయించబడిన తర్వాతనే ఆయా ఎస్టేట్లకు యివ్వవలసిన నష్టపరిహార మొత్తాలను స్పష్టంగా నిర్ణయించడానికి వీలుంటుంది.

ఈ సర్వే సెటిల్మెంటు వ్యవహారాలు పూర్తికావడానికి కొంతకాలం పడుతుంది గనక ఎస్టేటును స్వాధీనం చేసుకున్న తేదీ లగాయతూ ఆరునెలలలోగా పై అంచనాల ప్రకారం లెక్క గట్టి యివ్వవలసి వచ్చే నష్ట పరిహారంలో సగం మొత్తాన్ని అడ్వాన్సుగా ఎస్టేటు రద్దు ట్రిబ్యునల్ వద్ద డిపాజిట్టు చేసే ఏర్పాటు చట్టంలోని 54 A సెక్షనులో సూచింపబడి ఉన్నది. ఎడ్వాన్సు నష్టపరిహారం deposit చేయడమే గాకుండా అదనంగా భూ ఖామందులకు తాత్కాలిక చెల్లింపులు చేయడానికి కూడ చట్టంలోని సెక్షను 55 క్రింద అవకాశం కల్పించబడినది. నష్టపరిహారం మొత్తం నిర్ణయించబడి చెల్లించే లోగా ఎస్టేటు ప్రధాన భూకామందులకు ఎస్టేటుకు సంబంధించిన యితరులకు ప్రభుత్వం ప్రతి సంవత్సరమూ నిర్ణీత తేదీ తర్వాత ప్రాతిపదిక మొత్తానికి సమానమైన మొత్తాన్ని deposit చేయవలసి ఉంటుంది. 31-1-1956 వరకు అడ్వాన్సు నష్టపరిహారం క్రింద 3 కోట్ల 29 లక్షల 24 వేల 4 వందల 56 రూపాయలు. తాత్కాలిక చెల్లింపుల క్రింద 77 లక్షల 51 వేల 5 వందల 98 రూపాయలు ప్రభుత్వం ట్రిబ్యునల్ వారివద్ద యిప్పటికి deposit చేసింది.

సర్వే సెటిల్మెంటు వ్యవహారాలు పూర్తి కాగానే పూర్తి నష్టపరిహారపు మొత్తం నిర్ణయించబడి భూఖామందులకు చెల్లించబడుతుంది. ఈ రాష్ట్రంలో ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న సుమారు 17 వేల 9 వందల 91 చ॥ మైళ్ళ ఎస్టేట్లకు గాను సుమారు 7 వేల 31 చ॥ మైళ్ళలో 1955 డిసెంబరు చివరకు సర్వే కార్యక్రమం పూర్తిఅయింది. 3 వేల 9 వందల 52 చ॥ మైళ్ళలో సెటిల్మెంటు వ్యవహారాలు పూర్తి చేయబడినవి. సెటిల్మెంటు శాఖవారికి 4 వేల 7 వందల 79 చ. మైళ్ళకు సంబంధించిన సర్వే రికార్డులు

(Sri K Chandramouli) [14th March 1956

సంపాదించిన సర్వే సెటిల్మెంటు కార్యక్రమాలను సాధ్యమయినంత త్వరలో పూర్తిచేసే ఉద్దేశంతో ప్రభుత్వం తీవ్రతరమైన పథకాన్ని తయారుచేసి అదనంగా సర్వే సెటిల్మెంటు దళాలను నియమించింది. ప్రస్తుతం రాష్ట్రంలో 9 సర్వేదళాలు, రెండు సర్వే రేంజీలు, ఒక్కొక్కదానికి రెండు బ్రాంచీలు కల్గిన మూడు సెటిల్మెంటు దళాలు పనిచేస్తూ ఉన్నవి. ఈ పథకాన్ని అనుసరించి ప్రభుత్వం స్వాధీనపర్చుకొన్న ఎస్టేట్ల సర్వే కార్యక్రమం 1958-59 సంవత్సరాంతానికి, సెటిల్మెంటు వ్యవహారాలు 1961-62 సంవత్సరాంతానికి పూర్తి అవుతాయని ఆశిస్తూ ఉన్నది రైతు జనాభ్యుదయమే ఆదర్శంగాగల కాలదోషం పట్టిన భూమి విధానాన్ని రద్దుచేసే నిమిత్తం ఏర్పరచిన భూ సంస్కరణలు అమలు జరుపుటలో భూస్వాములకు యివ్వవలసిన నష్టపరిహారానికి సంబంధించిన ఖర్చుగనుక యీ డిమాండుగూడా చాలా ముఖ్యమైనది. అందుచే దీనిని గూడ సభ్యులు మంజూరు చేయవలసిందిగా నేను కోరుచున్నాను.

Mr SPEAKER —Motions moved—

"That Government be granted a sum not exceeding Rs 72,99,900/–under Demand No I – Land Revenue"

"That Government be granted a sum not exceeding Rs 20,40 000/– under Demand No XXXIII – Compensation to Zamindars"

*Demand No. I Land Revenue*

Sri VAVILALA GOPALAKRISHNAYYA —Sir, I beg to move

To reduce the allotment of Rs 72, 99, 800/– for Land Revenue by Rs 100/–

(గ్రామోద్యోగుల పిల్లలకు విద్యావసతులు ఎన్. జి. వో ల వలె యివ్వవలెనని వ్యవసాయాదాయపు పన్నులు వేయవలెనని ప్లానింగ్ కమీషన్ ఆదేశించినట్లు భూసంస్కరణలు అమలు జరుపవలసినదిగా.)

Sri PILLALAMARRI VENKATESWARLU — Sir, I beg to move :

To reduce the allotment of Rs 72, 99, 800/– for Land Revenue by Rs. 100/–

(To discuss the failure of the Government to draw a detailed scheme giving priority to the agricultural labour in distributing the banjar land that could be made available for cultivation )

14th March 1956]

Sri PILLALAMARRI VENKATESWARLU:— Sir, I beg to move

To reduce the allotment of Rs. 72, 99, 800/- for Land Revenue by Rs. 100/-

(To discuss the failure of the Government to limit the agricultural holding of land owners by fixing a ceiling thus enabling the Government to take over the surplus land and distribute the same to landless poor )

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—Sir, I beg to move

To reduce the allotment of Rs 72, 99, 800/- for Land Revenue by Rs 100/-

(రివిన్యూబోర్డును రద్దుచేయకపోవడమును గురించి)

Sri M NAGI REDDI —Sir, I beg to move :

To reduce the allotment of Rs 72, 99, 800/- for Land Revenue by Rs 100/-

(జాయింటు పట్టాలను విడగొట్టి రైతులకు పేయేసర్వే నెంబర్లలో తమ కెంత భూమి ఉన్నదో తామెంత శిస్తు చెల్లించాలో తెలుసుకొనే అవకాశం ప్రభుత్వము కల్పించనందుకు.)

Sri M NAGI REDDI—Sir I beg to move :

To reduce the allotment of Rs. 72, 99, 800/- for Land Revenue by Rs. 100/-

(బంజరుభూములలో వేసుకొన్న యిండ్లకు కబేళాలు యివ్వనందుకు)

Sri B. SANKARAYYA:— Sir, I beg to move

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by Rs 100/-

(నెల్లూరు జిల్లాలోని పెన్నా డెల్టాక్రింద చెరువు బంజర్లు సుమారు X సంవత్సరములనుండి సాగుచేస్తున్న పదివేల కుటుంబాల వ్యవసాయ కూలీలను, పేదరైతులను సదరు భూములనుండి తొలగించుటకు అందులో కొన్ని భూములను రాజకీయ బాధితులకు ఇచ్చుటకున్నూ ప్రభుత్వం చేస్తున్న చర్యలకు అసమ్మతి తెలుపుటకు.)

Sri M NAGI REDDI — Sir, I beg to move :

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by Rs 100/-

(Sri M Nagi Reddi) [14th March 1956

(కౌల్దారీ చట్టాన్ని తేనందుకు, చట్టం వచ్చేలోపల కౌల్దార్లను భూస్వాముల భూములనుండి వెళ్ళగొట్టకుండా వెంటనే ఆర్డినెన్సు ప్రకటించ వలసిన అవసరాన్ని గురించి చర్చించుటకు.)

Sri M. NAGI REDDI — Sir, I beg to move

To reduce the allotment of Rs 72,99,800/- for Land Revenue by Rs 100/-

(గ్రామోద్యోగులయొక్క జీతాలు పెంచనందుకు)

Sri P. NARASIMHAPPA RAO — Sir, I beg to move ·

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by Rs. 100/-

(మైనర్ ఇరిగేషన్ వర్క్సుకు ఇంకా అదనంగా మొత్తాలు అలాటు చేయుటకు, చేస్తున్న పనులలో దుబారా లేకుండా చేయుటకు.)

Sri S VEMAYYA — Sir, I beg to move:

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by Rs 100/-

(For the failure of the Government to adopt single patta system of holding in the State )

Sri B. RATHNASABHAPATHI.- Sir, I beg to move :

To reduce the allotment of Rs 72,99,800/- for Land Revenue by Rs. 100/-

(To criticise the delay in Survey and Settlement in both Estates and Inam Village and Ryotwari villages.)

*Demand No. XXXIII–Compensation to Zamindars*

Sri VAVILALA GOPALAKRISHNAYYA ·— Sir, I beg to move :

To reduce the allotment of Rs 20,40,000/- for Compensation to Zamindars by ... ... Rs. 100/-

(రెడ్ లేబుల్ బాండు రూపంలో యివ్వవలెనని.)

Sri PILLALAMARRI VENKATESWARLU :— Sir, I beg to move :

To reduce the allotment of Rs. 20,40,000/- for Compensation to Zamindars by ... ... Rs. 100/-

(To discuss the failure of the Government to pay compensation to Zamindars in the form of bonds instead of paying in cash.)

14th March 1956]

Mr. SPEAKER :— The main Demands and the cut motions are now before the House for discussion.

Sri B RATHNASABHAPATHI :— అధ్యక్షా ! మంత్రిగారు ఈ డిమాండ్సును ప్రతిపాదిస్తూ మొదటి డిమాండు గురించి 14 పేజీలు రిపోర్టు చదివారు. రెండవ డిమాండుపైన కూడ దాదాపు అంత రిపోర్టే చదివారు. ఈ రిపోర్టులలో వాళ్లు గత సంవత్సరంలో చేసినటువంటి పని అంతా సమీక్షచేస్తూ రాబోయే సంవత్సరంలో వాళ్ళు అనుసరించబోయే Policy నంతా సూచించారు. ఇంత రిపోర్టు ఈ కొద్ది కాలంలోనే చదువటం సభ్యులను దానిని అర్థం చేసుకొని విమర్శ చేయమనటం వారి ఆలోచనగా నున్నట్లున్నది. కానీ ఆరిపోర్టు, నిన్న ముఖ్యమంత్రిగారి ఉపన్యాసం సభ్యులకు అందచేసినట్లుగా, అందచేసి యుంటే వాటి నన్నిటినీ పూర్తిగా అర్థంచేసుకొని విమర్శించడానికి పూర్తిగా అవకాశం ఉండేది. కానీ అటువంటిది ఎందుకు చెయ్యలేక పోయినారో కారణం తెలియదు. కానీ కేవలం సభ్యుల విమర్శలను avoid చేయడానికి ఆవిధంగా చేశారేమోనని నాకు అనుమానంగా ఉన్నది. అందులో ముఖ్యంగా భూమి శిస్తు విధానాన్ని సవరించాలని లేక అందులో కొన్ని సంస్కరణల్లను తీసుకొని రావలెనన్న విషయంగురించి దీర్ఘంగా చర్చించాల్సిన అవసరంఉంది. దానిమీద వారిదృక్పథాన్ని చాల విపులంగా తెలియజేశారు. అందులోమాకు తెలిసినవిషయాలున్నాయి. తెలియని విషయాల్లు కూడాఉన్నాయి. కాని అటువంటి వన్నీ సభ్యులు తెలుసుకొనుటకు వీలులేకుండా ఇంత పెద్ద రిపోర్టు చదివిన తరువాత కేవలం ఒక రెండు-మూడు నిమిషాలు సభ్యులకు time ఇచ్చివిమర్శలు చేయాలని చెప్పుతున్నారంటే, ఎందుకు ఈ విధంగా చేస్తున్నారో నాకేమీ అర్థం కావటంలేదు. ఇదే రిపోర్టు నిన్నగానీ లేక ఈ ఉదయం వచ్చినవెంటనే సభ్యులకు అందచేసి యుంటే వాటిని చదివి, విషయాలను అర్థంచేసుకుని సమగ్రంగా విమర్శించడానికి అవకాశం ఉండేదేమోనని నేను భావిస్తున్నాను. ఇక మీదటనైనా ఆ విధానాన్ని అనుసరించాలని మంత్రిగారికి నేను మనవి చేసుకొంటున్నాను. తర్వాత ఈ డిమాండు చాలా చిన్నదే అయినా దీనికి 73 లక్షల రూపాయలు మాత్రమే కేటాయించినా, ఈ డిమాండు క్రింద జరుగబోవు పనులు చాలా ఉన్నవి. దీన్ని మంత్రిగారు 5 రకాలుగా విభజించారు. అందులో ముఖ్యంగా మైనరు ఇర్రిగేషన్, రెవిన్యూ డిపార్టుమెంటుకు సంబంధించిన విషయం అది చాలా ముఖ్యమయిన విషయం. కాని దీనిపైన చెయ్యాల్సినటువంటి ఖర్చు అంతా ఇర్రిగేషన్ డిమాండ్సుక్రింద చేర్చారు. Irrigation demand ఉపముఖ్యమంత్రిగారిది. ఆ ఖర్చులన్నీ అందులో ఉన్నాయి, కనుక ఖర్చులకు సమాధాన మివ్వవలసినవారు, రెవిన్యూమంత్రిగారో లేక ఉపముఖ్యమంత్రిగారో తెలియటం లేదు. కానీ minor irrigation వివరాలు ఖర్చులు Irrigation Demand క్రింద చేర్చకుండా ఆవిషయాలు అన్నీ కూడా ఈdemand క్రిందనే చేర్చి, ఈ డిమాండు క్రిందనే వారు సమాధానం యిచ్చేదానికి అవకాశం ఉన్నట్లయితే చాలా బాగా ఉండేదేమో అనిపిస్తుంది. కానీ అటువంటిది ఏమీ చేయలేదు. ఆ విధంగా సవరించుకొంటారు అని నేను ఆశిస్తున్నాను. తర్వాత మంత్రిగారు ఈ standardisation of land revenue ను గురించి చాల విపులంగా చెప్పారు. దానిని గురించి పెద్ద చరిత్ర ఉంది. ఈ విషయంలో ఆ చరిత్రను గురించి కూడా మనం సమీక్ష చేయవలసిన అవసరం ఉందని నేను అనుకొంటున్నాను. Standardisation of land revenue

(Sri B Rathnasabhapathi) [14th March 1956

తలపెట్టినప్పుడు ఏ శాసనాన్ని తీసుకురావాలన్నా రైత్వారీ విధానాన్ని అమలుచేసే టప్పుడు ఉన్న లోపాలను, సరిదిద్దకోకుండా ప్రభుత్వం revenue వసూలు చేసుకొని దానికే ప్రయత్నం చేసినదన్న విషయం దృష్టిలో పెట్టుకోవలసి యున్నది Water cess ను కాని, land revenue ను కాని రైతులు కట్టే ఇతర పన్నులను కాని ఎక్కువచేసే ఉద్దేశం ఉన్నప్పుడు ఈలోపాలను కూడా దృష్టిలో పెట్టుకుని చేయవలసి యున్నదని మనవి చేస్తున్నాను. రైత్వారీ పద్ధతి 1792 సంవత్సరంలో జరిగింది, బరమహల్, సెలం అనే రెండు ప్రదేశాలను టిప్పు సుల్తాను గారు బ్రిటిషు ప్రభుత్వానికి దత్తత ఇచ్చారు. అపుడు కారన్‌వాలీసు గవర్నరు జనరలుగా ఉండేవాడు. వారు కల్నల్ రీడు అనే ఆయనను 'సర్వే చేసి ప్రభుత్వానికి ఎంత పన్ను కట్టవలసింది నే' విషయం తేల్చమని చెప్పారు. కల్నల్ రీడుగారు ఈ రెండు ప్రదేశాలనే కాకుండా మొత్తం మద్రాసు రాష్ట్రం అంతా సర్వే చేయించి అంతకు ముందు సుల్తానులకు కడుతున్న పన్నులను, కప్పాలను దృష్టిలో పెట్టుకుని రైత్వారీ విధానాన్ని తయారుచేశారు. ఒక్కొక్క రైతుకు ఎంత భూమి ఉన్నది, ఎంత సేద్యం చేస్తున్నాడు మొదలైన విషయాలు సేకరించి ఆ మొత్తంమీద పన్నులు సేకరిస్తూ వచ్చారు. అందులో చాలా లోపాలుంటూ వచ్చాయి. ఒక రైతు పన్ను ఎగగొడితే గ్రామం మొత్తంమీద ఆ పన్నును వసూలు చేసేపద్ధతి అమలులో ఉండేది. ఇది సరిదిద్దడానికి చాలా సంస్కరణలు జరిగాయి. చాలాసార్లు చాలా మార్పులు జరిగాయి. ఆఖరుకు 1865 వ సంవత్సరానికి ఒక విధానానికి వచ్చినట్లు తెలుస్తోంది అప్పుడు Sir Charleswood గారు 3 conditions తెలియచేశారు సర్వే చేసేటప్పుడు గాని, రైత్వారీ విధానాన్ని అమలు చేసేటప్పుడు గాని, పన్నులు విధించేటప్పుడుగాని ఈ మూడు పద్ధతులు అనుసరించాలని తెలియచేశారు.

"The Districts are divided into three classes,

[1] Districts in which agriculture was backward,

[2] Districts in which the Estates were fairly cultivated and resources fully developed; and

[3] Districts which contained estates fairly cultivated and also estates with resources imperfectly developed. He decided that the Permanent Settlement should be introduced at once in the second-class of Districts i. e., Districts in which the Estates were fairly cultivated and rosources fully developed"

Districts in which agriculture is backward – ఇటువంటి ప్రాంతాలలో permanent settlement కాని రైత్వారీ విధానాన్ని కాని అప్పట్లో introduce చేయడానికి వారు వ్యతిరేకులుగా ఉన్నారు. వారి ఉద్దేశం కేవలం revenue వసూలు చేసుకోవడమే కాబట్టి సారవంతమైన భూములకు శాశ్వత విధానాన్ని అమలు జరిపి cultivation పూర్తిగా అభివృద్ధికాని ప్రాంతాలలో కొంతవరకు ఆపే విధానాన్ని అనుసరించాలని అనుకున్నారు.

At the time of the organisation of the Settlement Department in 1856, the Madras Government proposed, in accordance with the custom of the country to fix the land revenue at 30 per cent of the gross produce, but the Home Department ruled that the land revenue should represent a fixed proportion of the net and not the gross produce which was eventually fixed at one half.

అప్పుడు పంటలపైన, పంటల ధరలపైన ఆధారపడి land revenue నిర్ణయించారు. gross produce లో 30% మాత్రమే వసూలు చేయాలని నిర్ణయించారు. కాని Home department వారు object చేయడంవల్ల net produce పైన రైతులకు వచ్చే ఖర్చులు మిగతా ఖర్చులు తీసివేసి సగం రైతులు దగ్గరనుంచి వసూలు చేయాలని అనుకున్నారు. రైత్వారీ విధానం మొదట తయారు చేసినప్పుడు నిర్ణయించుకొన్న ప్రాతిపదికలు ఇవి. ఈ రోజున కూడా ఇదే రైత్వారీ system ను అనుసరిస్తున్నారు. Backward districts లో Permanent settlement కాని రైత్వారీ విధానం కాని అమలు చేయకుండా కొద్దికాలం ఉంచారు. తరువాత backward, advanced అనే విచక్షణ లేకుండా ఆదాయంకొరకు అన్ని districts లోను అమలు చేశారు. ఇది మొదటవారు చేసిన పొరపాటు. స్వార్థంకొరకు ఆదాయం కొరకు అట్లా చేశారు. ప్రజా పరిపాలనలోనికి మనం వచ్చాము. ఈ లోపాలు మనం గమనించి మనంచేసే సంస్కరణలలో సర్దుకోవాలని మనవి చేస్తున్నాను. Prices పైన ఆధారం చేసుకుని వారు తయారు చేశారు. ఆ రోజులలో prices తక్కువగా ఉండవచ్చును. Financial note లో ఆ రోజుకు ఈ రోజుకు ధరలు పెరిగాయి అని శిస్తులు మార్చడానికి కాని watercess మొదలైనవి పెంచడానికి కాని రైతులకు అభ్యంతరం ఉండకూడదని arguments advance చేశారు. ఆ రోజున ధరలు తక్కువగా ఉన్నమాట నిజమే. దానిని ఆధారం చేసుకుని పన్ను విధించిన మాటనిజమే. కాని ఆ రోజుల్లోని cost of living కు standard of living కు తేడా గమనించాలి. ఒకవ్యక్తికి కొద్ది ఆదాయం వచ్చినా ఏదోరకంగా ఆ ఆదాయంతోనే ఖర్చులు సర్దుకుంటూ జీవితం గడుపుకుంటూ వచ్చేవాడు ఆ రోజుల్లో ఇప్పుడు ఖర్చులు, విజ్ఞానం, విద్య అన్నీ పెరిగాయి. ఇతర దేశాలతో మనకు ఉండే contacts వల్ల standard of living, మన అవసరాలు అన్నీ పెరిగాయి. వీటిని దృష్టిలో పెట్టుకుంటే రైతులకు వచ్చే ఆదాయం నిత్య జీవితం గడుపుకోడానికే తప్ప ప్రభుత్వానికి spare చేయడానికి ఏమీ మిగలడంలేదు. ఇది దృష్టిలో పెట్టుకుని సంస్కరణలు చేసినప్పుడు కేవలం ధరలు పెరిగినాయి అని దృష్టిలో కాక జీవిత అవసరాలను కూడా దృష్టిలో పెట్టుకోవాలని మనవి చేస్తున్నాను. మరొకటి ఉన్నది. Land Revenue నిర్ణయించినప్పుడు Sir Thomas Munroe గారు ఒక విషయం చెప్పారు.

The intention of the founders of the Ryotwari system was to make the assessment on land permanent. Col. Read's proclamation issued at the time of its introduction declared that the assessment was 'fixed for ever' and Sir Thomas Munroe

declared that it was 'fixed' and permanent In his report on the settlement of the Ceded Districts on ryotwari principles Sir Thomas Munroe advocated the reduction of the existing Assessment by 25 per cent.

కనుక ఆరోజులలో కూడా Ceded districts లో చేసిన assessment విధానం చాలా హెచ్చుగా ఉన్నదని వారు గమనించి అక్రమం అని, అన్యాయం అని Sir Thomas Munroe, గారు reduce చేయాలని చెప్పారు. కేవలం రైతులను బాధించి ఆదాయం సంపాదించాలనే అభిప్రాయం పెట్టుకోకుండా ఈవిమర్శలను దృష్టిలో పెట్టుకుని సంస్కరణలు చేస్తారని ఆశిస్తున్నాను. Spring channels కు సంబంధించి కొంచెం చెబుతాను. Spring channels, కాలువలు వల్ల సాగుబడిఅయ్యే భూములపై మీరు water cess వసూలు చేస్తున్నారు. Water cess ఎక్కువ చేయాలని ముఖ్య మంత్రిగారు బడ్జెటు ఉపన్యాసంలో తెలియచేశారు. దీనివల్ల 45 లక్షలు చేకూరుతుందని surcharge ఒక సంవత్సరం మాత్రమే ఉద్దేశింప బడిందని surcharge withdraw చేస్తే లోటు భర్తీచేయడానికి water cess ఎక్కువ చేయాలనే ఉద్దేశంగా తెలియ చేస్తున్నారు. మిగతా విషయాలు ఎట్లా ఉన్నా ఒక విషయం మాత్రం మీరు దృష్టిలో పెట్టుకోవాలి. Spring channels, ఊట కాలువలు, దొరువులు, బావులు క్రింద సాగుబడి అయ్యే భూములుపై water cess విధించడం చాలా అన్యాయం అని మనవి చేస్తున్నాను. చెరువులువల్ల సాగుబడిఅయ్యే భూములకు water cess విధించడం న్యాయం అని మనవిచేస్తున్నాను. చెరువుల వల్ల సాగుబడి అయ్యే భూములు చాలా ఉన్నాయి. చెరువులకు కావలసిన repairs ప్రభుత్వం చేస్తుంది. చెరువుల క్రింద సాగుచేసుకునే రైతులకు ఎలాంటి కష్టాలులేవు. చెరువులోనుంచి నీళ్ళు పెట్టుకోవడం, సేద్యం చేసు కోవడం మాత్రమే వారి దినచర్యగా కనిపిస్తోంది. Spring channels క్రింద ఉండే రైతుల భూములకుకూడ మరమ్మతు ఉన్నది. ఈ విధానంవల్ల కాలువలు చెడిపోయినా, పూడిపోయినా ప్రభుత్వం వారికి సహాయం చేయడంలేదు. Water cess మాత్రం ఖచ్చితంగా విధిస్తున్నారు. సంవత్సరానికి 9 మాసాలు వ్యవసాయం చేసుకుంటే ప్రతి రోజు కూడా మరమ్మతు కాలువల్లో ప్రొద్దుటనుంచి సాయంత్రం వరకు కృషిచేసి సక్రమంగా నీళ్ళు పెట్టుకుని పారుదలచేసుకుని పండించుకో వలసిన అగత్యం ఉన్నది. ప్రభుత్వం ఎలాంటి సహాయం చేయడంలేదు. రైతే కష్టపడుతున్నాడు; పండించు కుంటున్నాడు. Water cess ను వీరిపై కూడా చెరువుక్రింద భూములపై వేసే మాదిరిగానే వేస్తున్నారు. ఇది చాలా అన్యాయం అని తెలియచేస్తున్నాను. ఎక్కువ చేయడం విషయం అట్లా ఉంచి మీరు విధించిన water cess ను withdraw చేయ డానికి ప్రయత్నించాలి అని కోరుతున్నాను.

Survey settlement ను గురించి మంత్రిగారు చాలా వివరంగా చెప్పారు. ఇంకా 1700 చదరపుమైళ్లు మనదేశములో ఉన్నాయన్నారు. అవి ఎక్కువగా జమీందారీ estates లో మాత్రమే ఉన్నాయని, వాటి సిబ్బందిని గురించికూడా వివరంగా చెప్పారు. కాని ఆ statement ను ముందు అందజేసి ఉంటే మేము దానిని గురించి వివరములు తెలుసుకొని విమర్శించడానికి అవకాశము ఉండేది. కాని

14th March 1956] (Sri B Rathnasabhapathi)

జమీందారీఎస్టేటులో, ఈనాంఎస్టేటులోను మిగతా అన్నిచోట్లలోనూ అటుంచి రైత్వారీ గ్రామాలలోనే కొన్నివేల ఎకరాల బంజరుభూములు సర్వేచేయకుండా ఉన్నాయి. నాకు తెలిసినంతవరకు మా తాలూకాలోనే షుమారు 5 వేల ఎకరాలు ఉన్నాయి. వాటిలో కొన్ని రైతులు ఆక్రమించుకొని సాగుచేసుకొంటే వారిమీద అధికారులు హెచ్చు పెనాలిటీలు కడుతున్నారు. అధికారులు ఎన్ని పర్యాయములు మేము కలుసుకొని వాటిని సర్వేచేసి పట్టాలు ఇవ్వమని చెప్పినా వినిపించుకోలేదు. సర్వేచేయడానికి ఎందుకు పూనుకోలేదు అని అడిగితే, "మాకు సిబ్బందిలేదు, అందువల్ల విలంబన జరుగుతున్నది." అని చెబుతున్నారు. మా తాలూకాలో 5 వేల ఎకరాలు బంజర్లు సారవంతమైనవి ఉన్నాయి. వాటిని రైతులకు ఇచ్చి సక్రమంగా సేద్యానికి వినియోగింపచేయడానికి వీలున్నాకూడా ఆ ప్రకారం చేయకపోవడము చాలా శోచనీయము. ఇప్పుడు 72 లక్షల రూపాయలను ఈ డిమాండును కోరారు. ఈ కార్యకలాపములు ఏమీ చేయకుండా, కేవలం మీ ఆదాయము కొరకు, మీ పరిపాలన కొఱకు, చేస్తున్నారేగాని మరేమీకాదు; వాటిని దృష్టిలోపెట్టుకొని ఇకనైనా Survey settlement చేసి, Water cess ను నిర్ణయిస్తే బాగుంటుంది. పన్నులు హెచ్చుచేస్తే చాలా ప్రమాద పరిస్థితులు వస్తాయని చెబుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Sri P. THIMMA REDDI —అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు ఈ రెండు డిమాండులను ప్రవేశపెడుతూ ఎక్కువగా ఏమీ చెప్పలేదని ప్రతిపక్షమునుండి శ్రీ రత్నసభాపతిగారు విమర్శచేశారు. అసలు ప్రతి పక్షమువారు ప్రభుత్వం ఏమి చెప్పలేదు అనడానికి ముందు ప్రభుత్వమువారు ఏమి చెప్పారా అని యోచించారా ? రివెన్యూ డిపార్టుమెంటు ఏ విధంగా ఏర్పాటు అయిందని, ఈ ఎస్టేటులరద్దు ఏవిధంగా జరిగిందని మంత్రిగారు చెప్పారు గాని, దీంట్లో దాంట్లో జరిగిన ప్రమాదములను గురించి చెప్పలేదు. కాబట్టి వాటిని గురించి మీరు ఎందుకు అడుగుతారు ? మొదట మీకు ఒక మాట మనవి చేస్తాను.

ఇప్పుడు ప్రతిపక్షములో కారం వచ్చింది. అందులో కారం ఉన్నట్లయితే ప్రభుత్వ పక్షమునుంచి కూడా విసుర్లు బాగా ఉండేవి.

Sri B. RATHNASABHAPATHI :— అధ్యక్షా, మా గురువుగారు అయిన తిమ్మారెడ్డిగారికి ఒక విషయం మనవి చేయదలుచుకున్నాను, ఆ ప్రతి పక్షములో కారం వచ్చినమాట వాస్తవమే ప్రభుత్వ పార్టీలో జరిగే విషయాలు మాకు ఏమీ తెలియవు కాబట్టి కారం వచ్చింది. అవన్నీ తెలిసినవారు శ్రీ తిమ్మారెడ్డిగారు ఉన్నారు కాబట్టి వారు వచ్చి ప్రతిపక్షంలో కూర్చుంటే కారం ఎక్కువ అవుతుందని మనవి చేస్తున్నాను.

Sri P. THIMMA REDDI.—అధ్యక్షా! సోదరుడు చెప్పిన విషయముతో నేను ఏకీభవిస్తున్నాను. మేము అటురావడానికి చాలా చిక్కులు ఉన్నాయి. వెనుకటికి ఒకడి పెళ్ళాం మొగుడిమీద తిరుగ బడిందట, అప్పుడతడు ఏమి చేయాలి ? ఆమెను కొట్టాలి; తిట్టాలి; కొడదామంటే గర్భిణి. తిడదామంటే అక్కకూతురు అయిందట. మా పరిస్థితి అట్లా ఉన్నది.

(Sri P. Thimma Reddi) [14th March 1956

ఈ డిమాండుమీద మాట్లాడాలంటే చాలా విషయాలు ఉన్నాయి. ప్రత్యేకంగా ఒక విషయం మనవి చేయాలి. నిన్నటి డిమాండుమీద శ్రీ బ్రహ్మయ్యగారు మాట్లాడుతూ, దానిని గురించి ప్రభుత్వం ఏమీ చేయలేదు అన్నారు. శ్రీ పట్టాభిరామారావు గారు మాట్లాడిన తరువాత బ్రహ్మయ్యగారు మాట్లాడటం సంభవించింది. కాబట్టి పట్టాభిరామారావుగారికి సమాధానం చెప్పే అవకాశం దొరకలేదు. వాటన్నింటినీ గురించి గడచిన ప్రభుత్వం కదలించింది. ఈ శాసనసభ్యులందరూ అయినాసరే, ప్రభుత్వాన్ని నిర్వహించే మంత్రులు అందరూ అయినాసరే, ఎంతపట్టుకొని కుదిపినాసరే ప్రభుత్వము అనే దానిని ఒక్క అడుగుకూడా కదిలించడానికి ఎవరికీ సాధ్యంకాదు. మంత్రుల దగ్గరకు ఏవో files వస్తూంటాయి, పోతూ ఉంటాయి. ప్రభుత్వములో ఉన్న ఉద్యోగస్థుల బృందము వాటిమీద ఏదో వ్రాస్తూఉంటారు. "ఈ ప్రభుత్వం ఎప్పుడు పోతుందో ? కొత్త ప్రభుత్వం వస్తుందేమో? ఇప్పుడు ఈ file పెట్టకపోతేనేమి" అని యోచించే ఉద్యోగులుకూడా కొంతమంది ఉన్నారు. అక్టోబరు ఒకటవ తేదీ వస్తున్నదిగదా ఈ లోపల పనులు జరుగకపోతేనేమి అనే దృష్టిలో సెక్రటేరియట్ ఉద్యోగస్థులు ఉంటారు. గడచిన ప్రభుత్వంలో ఏమీ జరగలేదు అనడం పొరపాటు. దీనిని గురించి ప్రత్యేకమైన శ్రద్ధ చూపించారు. అది మీకు తెలియకపోతే గడచిన ప్రభుత్వంలోఉన్న మంత్రులను ప్రజలను గురించి ఏమిచట్టాలు చేశారు అని వివరాలన్నీ అడిగి తెలుసుకొంటే బాగుంటుందని శ్రీ బ్రహ్మయ్యగారికి మనవి చేస్తున్నాను.

Sri S. BRAHMAYYA — అధ్యక్షా, గత ప్రభుత్వము ఏమీ చేయలేదని నేను విమర్శించలేదు. శ్రీ పట్టాభి రామారావుగారు గత ప్రభుత్వములో విద్యా మంత్రిగా ఉన్నారు గనుక, అప్పుడు వారు గడించిన అనుభవములను ఇప్పుడు చెప్పడానికి అవకాశము కలిగిందని మాత్రమే నేను అన్నాను.

Sri P. THIMMA REDDI — సరే బ్రహ్మయ్యగారికి కూడా ఏదో ఒక రకంగా అవకాశం ఉంటే బాగుంటుందేమో చూస్తాము.. (చిన్న అవకాశం కాదు. పెద్ద అవకాశం)

Mr. SPEAKER.— ఇది Education Demand కాదు ఇది Land Revenue Demand. దానిపైన మాట్లాడండి.

Sri P THIMMA REDDI.— అధ్యక్షా! ఈ water cess ను గురించి river channels ను గురించి రత్న సభాపతిగారు చెప్పారు. ఇదివరకు ప్రభుత్వము తప్పు చేసింది. వాటిల్లో రైతులు ఇసుక తోడుకొని నీళ్ళు తీసుకొనిపోయి పొలాలు సాగుచేసుకుంటుంటె ప్రభుత్వం వాటిమీద నీటిపన్ను వసూలు చేస్తున్నారు. అది ఒక్క అనంతపురం జిల్లాకు సంబంధించిన విషయంకాదు. శ్రీకాకుళంనుంచి, అనంతపురం వరకు, రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను ఎదుర్కొంటున్న సమస్య ఇది. ఆనీటిపన్నును ఒక్క అనంతపురం జిల్లాలో రైతులు అడిగారు కాబట్టి, ఇది తప్పుఅని రద్దుచేశారు. దీనిని గురించి వెనుకటి ప్రభుత్వములో ఏమిజరిగిందో ఇక్కడ చెప్పడం భావ్యంకాదు. మొన్న కొందరు స్నేహితులు ఈవిషయమై మంత్రిగారిని ప్రశ్నిస్తే "ఎవరైనఅడిగితే యోచిస్తాము" అని వారు జవాబు చెప్పారు. ప్రభుత్వానికి ఒకనీతి ఉండాలి తప్పుఅని తెలుసుకుంటే అన్ని జిల్లాలలోనూ రద్దుచేయాలి. అడిగితే రద్దుచేస్తాము అనేది అవినీతికి తార్కాణము.

ఇప్పుడు కిస్తీలు వసూలుచేసే సమయము కాబట్టి ఇది నీతికీ, సంబంధించిన సమస్యగా భావించి వెను వెంటనే అన్ని జిల్లాలలోను స్ప్రింగు ఛానల్సు క్రింద పన్నులు వసూలు చేయడం ఆపుచేయాలి. ఈ విషయం రత్న సభాపతిగారు కదిలించారు కాబట్టి నేనుకూడా మనవి చేస్తున్నాను. ఇది river channels క్రిందకాదు. రైతులు 10 వేలో 5 వేలో రూపాయలు ఖర్చుపెట్టుకొని గవర్నమెంటు స్థలములో బావులు త్రవ్వుకొని, నీళ్ళు తోడుకొని సేద్యం చేసుకుంటుంటే, ఆ స్థలం ఏ నాలుగైదు సెంట్లు అయినా, అది ప్రభుత్వానిదని నాలుగైదు ఎకరములమీద ప్రభుత్వం నీటి తీరువను వసూలు చేస్తున్నది. ఈ విషయం గడచిన ప్రభుత్వ దృష్టికి కూడా తీసుకొని రాబడింది. వారు ఏమీ చర్యతీసుకొనలేదు; అందువల్ల ప్రస్తుతం ప్రభుత్వము నడిపే పెద్దల దృష్టికి దీనిని మరొక పర్యాయము తీసుకు వస్తున్నాను. ఏదో పెత్తనము చేసేవారు, పెత్తనముచేసే వారికి దాపుగా ఉన్నవారు, వాళ్ళ ప్రాంతాలలో అది చేశాము, ఇది చేశాము అని చెప్పుకునేవారు కొంతమంది వుండవచ్చును. అటువంటి వారు లేనిచోట్ల మైనరు ఇరిగేషను వగైరా పనులు లన్ని జరగడంలేదని ప్రజలు భావిస్తున్నారు నందికొండ, తుంగభద్రా హైలెవెల్ ఛానల్, వంశధారా, మొదలగు పెద్దపెద్ద ప్రాజెక్టులు కొన్ని జిల్లాలకు మాత్రమే ఉపయోగపడుతాయి. అందువల్ల గ్రామ గ్రామానికి ప్రతి జిల్లాకు, ప్రతి తాలూకాకు ఉపయోగపడే చిన్నచిన్న మైనరు ఇరిగేషను ప్రాజెక్టులు చాలా ఉన్నాయి వాటన్నింటి అవసరమును గుర్తించి వాటి విషయంలో ప్రభుత్వం శ్రద్ధ వహించాలని కోరుతున్నాను.

మనం ఓట్లుకొరకు గ్రామాలు పోయినప్పుడు అనేక ప్రమాణాలు చేస్తూ వుంటాము. మనం ఎప్పుడో మళ్ళీ అక్కడకు వచ్చేటప్పటికి వారు మనంచేసిన ప్రమాణాలు మర్చిపోతారు కదా అనే ఉద్దేశ్యంతో. అక్కడి ప్రజలు మా చెరువులకు, కాల్వలకు, కుంటలకు మరమ్మతులు చేయించండి అని అడుగుతారు. మీరు ఓట్లు యిచ్చి నన్ను M. L. A. చేస్తే అన్ని పనులూ చేస్తామని చెపుతాము. ఏ పని చేస్తున్నామో సభ్యులకే తెలియాలి. West Godavari District లో కావలసినన్ని కాలువ లున్నాయి. రాష్ట్రం మొత్తంమీద ప్రతి తాలూకాలోనూ గ్రామానికి సంబంధించిన చెరువులు, కాల్వలు, కుంటలు వున్నాయి. వాళ్ళకు ఏమి ఉపకారం జరిగింది ? ఏమి జరుగుతోంది ? Five Year Plan అంటున్నారు. ఏదో బ్రహ్మాండంగా లెక్కలు చూపిస్తున్నారు. Five Year Plan లో యీ Minor Irrigation కు గాను ఎంత కేటాయించారు ? చిత్తూరు జిల్లాలో చెరువులు, కాల్వలు, కుంటలు కలిసి దాదాపు 7 వేలు వున్నాయి. వాటిలో దాదాపు 5 వేల చెరువులకు యీనాడు repair చేయ వలసిన అవసరం ఉంది. జమిందారీ రద్దు అని చెప్పి ప్రభుత్వం శాసనము పెట్టింది. జమీందారీ area లో ఎన్నో చెరువులు, కాల్వలు కుంటలు పూడిపోయి వున్నాయి. తూములు తెగిపోయాయి. ఇప్పుడు వాటిని repair చేస్తారా ? వాటి విషయం ప్రభుత్వం ఏమిచేద్దామనుకుంటుంది ? వీటినిగురించిన బాధ్యత Revenue Department దా ? P W. D. దా ? ఈ Public Health, Drainage, Water Works చూసే Local Boards దా ? P. W. D. దా ? Health దా ? ఒకరితో ముగ్గురూ వసంత మాడుతున్నట్లుగా వుంది. P W D కి సంబంధించిన విషయం Revenue వాళ్ళు చూసినట్లయితే Revenue మంత్రి, P. W. D.

మంత్రి యిది నాదంటే, నాదని జుట్టూ జుట్టూ పట్టుకోవలసి వస్తుంది. ఏదైనా ఒక చెరువుకి repairs చేయవలసి వచ్చినట్లయితే అది P. W D దా ? Minor Irrigation దా ? Collector దా ? లేక Executive Engineer దా ? ఈ విధంగా ఆలోచిస్తూంటే repairs జరగకుండా ఆగిపోతున్నాయి. చిత్తూరు జిల్లాలో వర్షాలవల్ల చెరువుల కట్టలు తెగిపోయినాయి వాటిని repair చేయించవలసిన బాధ్యత P. W. D. దో, Executive Engineer దో, Minor Irrigation వాళ్లు చేయాలో తెలియకుండా వుంది. Repairs జరుగుటలేదు. ఈ రకంగా అన్ని జిల్లాల్లోనూ వుంటుంది అందరి సభ్యులకు అనుభవమే. నీటివనర్లకు సంబంధించినది పూర్తిగా P. W. D. కైనా యివ్వండి, లేకపోతే irrigation కైనా యివ్వండి ఇది యిలా వుండడం చాలా అవమానకరం. ప్రజల దగ్గరకుపోయి సిగ్గుతో తలవంచు కోవలసిన సమస్య. Minor Irrigation కు సంబంధించిన మంత్రులు, ప్రజలు అనుభవంకలవారు వున్నప్పుడు యేదైనా ఒక చెరువు తీసుకున్నప్పుడు అది P W.D. దో లేక Minor Irrigation దో తెలియక, తెలుసుకొనే సత్తా, సామర్థ్యం, యోచనా లేనటువంటి వారు ప్రభుత్వాన్ని నిర్వహించడానికి అర్హత వుందా అని నేను అడుగు తున్నాను. మన రాష్ట్రంలో precarious చెరువులున్నాయి. దాంట్లోనుంచి వచ్చే నీరు ఫలసాయానికి చాలదు. మైసూరు ప్రభుత్వంవారు ఎక్కడెక్కడైతే చెరువులు, కుంటలు వాటిక్రింద వుండే ఆయకట్టుకు చేరకుండా వుంటాయో అక్కడ బావులు త్రవ్వించి రైతులకు సహాయం చేస్తున్నారు.

మన రాష్ట్రంలో ఎవడైనా ఒక చెరువుక్రింద నీరు పారించుకొని సాగుచేసుకొన్న ట్లయితే నీవు 5, 6, ..సాలు నీరు వాడుకున్నావు, అందుచేత పన్ను కట్టమని వసూలు చేస్తుంది మన ప్రభుత్వం. అలా వసూలుచేసే ప్రభుత్వానికి నీరు తక్కువగా వున్నట్లయితే నీరు supply చేసే బాధ్యత ప్రభుత్వానికి వుందా ? లేదా ! అని నేను అడుగు తున్నాను. బావిలో కూర్చొని ప్రపంచమంతా యిదే ననుకొంటే సరిపోతుందా ? ఏ యే రాష్ట్రాలలో ఏమి చేస్తున్నారో తెలుసుకోవలసిన అవసరంలేదా ? మైసూరు ప్రభుత్వం చెరువులు, బావులు త్రవ్వి రైతులకు సహాయపడుతున్నారు. మన రాష్ట్రం ఏమి చేస్తోంది ? ప్రభుత్వం చేయవలసిన అవసరం వుంది. మేము చేయమని కోరు తున్నాము. మన రెవిన్యూ మంత్రిని నేను నిందించడంలేదు. శాసనసభలో మంత్రి గారిని కోరుతున్నాము. సభ్యులు మంత్రులకు మనవి చేసుకుంటే మంత్రులు వెళ్ళి యింకొకరికి చెప్పుకోవలసిన అగత్యం యేర్పడింది. మంత్రులు వెళ్ళి వారిపైవారి దగ్గర మనవిచేసుకుంటేనే ఏదైనా పని జరగడానికి అవకాశంవుంది. Minor Irrigation ఎందుకు చేయము నందికొండ ప్రాజెక్టుకు 130 కోట్ల రూపాయలు కేటాయిస్తే High level channel కి 20 కోట్ల రూపాయలు కేటాయిస్తే ఎకరానికి ఎంత ఖర్చు అవుతుందో లెక్కవేయండి. ఎకరానికి 10,000 రూ॥లకు పైన ఖర్చుఅవుతుంది. పెద్ద ప్రాజెక్టుల క్రింద సాగుకుతెచ్చే భూమికంతకీ కూడా మైనరు యిరిగేషను చేసు కున్నట్లయితే 5 వందల కంటే ఎక్కువ ఆవదు. Minor Irrigation గురించి ఎందుకు శ్రద్ధచేయడంలేదు? Major Irrigation కు 200 కోట్ల రూపాయలు కేంద్ర ప్రభుత్వం నుండి తేగల్గిన ప్రభుత్వం మైనరు యిరిగేషన్‌కు కూడా జిల్లాకు 5 కోట్లో, 6 కోట్లో తెచ్చేందుకు ఎందుకు ప్రయత్నం చేయడం లేదని అడుగుతున్నాను. మైనర్

14th March 1956] (Sri P. Thimma Reddi)

యిరిగేషన్ మంత్రిగారికి కనిపించలేదా ? మైనర్ యిరిగేషన్‌తో మంత్రిగారికి సంబంధంలేదా ? Major Irrigation కు సంబంధించిన భూములున్నాయా ? Minor Irrigation కు సంబంధించిన భూములులేవా ? జనం నీరు కావాలని అడుగుతున్నారు. 3½ మాసాలు నీళ్ళువచ్చి పైరుకి వచ్చే ఆఖరి వారం రోజులలో ఒక తడుపుకి నీళ్లు లేకపోతే ఆ రైతు తన కొడుకు పోయినదానికన్నా ఎక్కువ బాధపడతాడు. తాను, తన భార్య పిల్లలు కష్టపడి పైరుచేసిన పంట ఎండిపోతోంటే ఎండలో నడుస్తున్న మనిషి ఎంత తపనబాధ పొందుతాడో అంతకంటే ఎక్కువ బాధగా వుంటుంది ప్రజలంతా కలిసి "అయ్యా మేము మా డబ్బుతో చెరువులు, బావులు త్రవ్వుకొని నీరు కొరతగా నున్నపుడు 2 తళ్ళో, 3 తళ్ళో పెట్టుకుంటాము అంటే ప్రభుత్వం వారు ఎప్పుడో ఒకచట్టం చేశారు, దాని ప్రకారం ప్రయివేటుగా ఎక్కడా కూడా చెరువులు త్రవ్వకూడదు అంటున్నారు. ఇదేమిటయ్యా అని నేనడిగితే యిదివరకు ఎప్పుడో ఒక G. O. చేశారు ఆ G. O. ను చింపేటంత వరకు మార్గంలేను అన్నారు. ప్రభుత్వం ఆ G. O ను చింపవలసి ఉన్నది చింపడానికి అవకాశం లేకపోతే ఆ G. O ను అసెంబ్లీ సభ్యులకు ఇచ్చినట్లయితే వారు చింపుతారు. మంత్రులు అన్ని పనులు చేశారు కొదనటం న్యాయంకాదు. కొన్ని G. O లు వున్నాయి. ఆ G. O. లను మార్చుట మంత్రులకు చాలా కష్టం. మంత్రులు కొన్ని G O లు చేయవలసి వుంటుంది. మరొక పని వచ్చేటప్పటికి ఆ G. O. లు ప్రాణంమీదికి వస్తుంటాయి. అందువల్ల మెట్ట ప్రాంతాలలో బావులు త్రవ్వడానికి అవకాశ మివ్వాలని కోరుతున్నాను. ఈ బంజరు భూముల విషయంలో చాలా అసంతృప్తి కరమైన assignments జరుగుతున్నాయి పోయిన ప్రభుత్వంలో ఫిర్కాకు ఒక Revenue Inspector ను, తాలూకాకు ఒక Deputy Tahsildar ను, వాళ్ళకు ప్రత్యేకంగా కొంత సిబ్బందిని యేర్పాటు చేశారు. మా జిల్లాలో ఒక యకరానికి పట్టా యిచ్చుటకు 100 రూ||లు ఖర్చు అయింది. ఫిర్కాకు ఒక Revenue Inspector నీ తాలూకాకు ఒక తాహశీల్దార్ని, జిల్లాకు R. D. O లను పెట్టి ప్రత్యేకమైన సిబ్బంది యిచ్చి యింతా చేస్తే ఒక్క రెవిన్యూ యిన్‌స్పెక్టరు పట్టా యిస్తున్నాడు. ప్రభుత్వంలో వుండే లోపాలను నేను చెప్పడంలేదు. అలా చెప్పడం కూడా భాగ్యం కాదు. కాని ప్రభుత్వంలో ఏమి జరుగుతూందో తెల్సుకోడానికి ప్రయత్నం చేయాలని చెప్తున్నాను. ఈ Demand దేవాలయాల మీదనైతే చంద్రమౌళిగారు యింకా ఎంతో రచనగా చెప్పి యుండేవారు ఆయనకు దేవాలయాలంటే ప్రత్యేకమైన శ్రద్ధవుంది. ఇందుకు ఆయనను నేను అభినందిస్తున్నాను; రాష్ట్రంలో ఎన్నో దేవాలయాలను ఆయన పునరుద్ధరించారు. దేవాలయాల ఆదాయాన్ని అభివృద్ధిలోకి తెచ్చారు. దేవాలయంలో టెంకాయ కొట్టినంతమాత్రాన ప్రజలకు తిండి, గుడ్డ, చదువు మున్నగు సౌకర్యాలు కల్గవని రెవిన్యూమంత్రిగార్కి నేను మనవి చేస్తున్నాను. రెవిన్యూ మంత్రిగారు దేవాలయాలమీద ఎంత శ్రద్ధ చూపుతున్నారో దానికి 10 రెట్లు శ్రద్ధ యీ Minor Irrigation మీద చూపాలి. అప్పుడే ప్రజలు అభివృద్ధిలోకి వస్తారు. అంతేకాని దేవాలయాలను మరమ్మతులు చేసినంతమాత్రాన పూజారులను అభివృద్ధి చేసినంతమాత్రాన రాష్ట్రంలోని ప్రజలు అభివృద్ధి చెందరని మనవి చేస్తున్నాను ఏదైనా భూమి పట్టామీద ఇమ్మని కోరితే అది River poramboke, కుంట పోరంబోకు,

(Sri P Thimma Reddi) [14th March 1956

తోపు పోరంబోకు, పల్లె పోరంబోకు అంటారు. అన్నీ porambokes అయితే poramboke కానిదేదో నాకు కనిపించడంలేదు. భూమి యివ్వమని అడిగితే poramboke అంటున్నారు. ఎవర్ని పోరంబోకు అంటున్నారు ? చట్టాన్ని పోరంబోకు అంటున్నారా ? లేక అడిగినవాళ్లని పోరంబోకులు అంటున్నారా ? లేక ప్రభుత్వాన్ని పోరంబోకు అంటున్నారా ?

Re-classification of lands కావాలని గడచిన ప్రభుత్వము చెప్పింది. ఒకప్పుడు ఒక వంక పోతూ ఉంటే దానిని వంకపోరంబోకుగా చెప్పారు. ఆ వంక ఇంకో ప్రక్కన తిరిగి ఉండవచ్చు లేదా ఆ వంక ఇంకో చెరువుకు మళ్ళి ఉండవచ్చు. అందువేత సేద్యానికి అనుకూలంగా ఉండే భూమిని పోరంబోకు అనే పేరుతో దానిని బహిష్కరించే దానికి ఎట్లు వీలవుతుందో చెప్పండి. ఇంకొక చోట ఒక తోపు ఉండవచ్చు. అక్కడఆతోపు నామరూపాలు కూడ లేకుండాపోయి ఉండవచ్చు. కాని అక్కడ ఈ దినము తోపు పోరంబోకు అని చెప్పి అడ్డదార్లుకట్టి కూర్చుంటే ఎట్లా చెప్పండి. అందుకనే ఇవి re-classification కావాలి. Re-classification చేసి వాటిని బీద బిక్కకి నాగుకు ఇచ్చేందుకు అవకాశముంటుందని మనవి చేస్తున్నాను. తరువాత కృష్ణా, గోదావరి నదులలో పట్టాలుఉండవచ్చు 10 ఎకరాలో 20 ఎకరాలో ఉండవచ్చు బీదవానికీ ఉండవచ్చు కలిగినవారికీఉండవచ్చు. ఎప్పుడైనా వరదలువచ్చినప్పుడు ఆభూమి కాస్త లేచిపోవచ్చు. కాని ఆభూమిలో మరల ఎప్పుడైనా గడ్డపెట్టినపుడు ఆభూమిమీద హక్కు ఉండాలని రైతులు శిస్తు పూర్తిగా కడుతున్నారు. అటువంటిచోట్ల ప్రభుత్వం పూర్తి శిస్తు వసూలుచేయడము తప్పు అని మనవి చేస్తున్నాను. నామకః నాలుగణాలు వసూలు చేయవలెనని మనవి చేస్తున్నాను. మంత్రులు చెప్పితే చాలదు. ఆ విధంగా జరిగేటట్లు చూడాలి. నేను మంత్రిగా ఉండినపుడు అటువంటి పొరబాటు ఒకటి జరిగింది. నేను చెప్పినాను కదా Department వారు చేస్తారని ఒక విషయం బయటు ప్రకటించినాను. కాని ప్రకటించిన రెండేళ్ళకు ఇప్పటికూడా అది ఆచరణలోకి రాలేదు. కనుక పావలా వసూలు చేయండని మంత్రిగారు చెప్పివుండవచ్చు, లేక ఇటువంటి speeches లో చెప్పి ఉండవచ్చు. కాని అక్కడ ఆ విధంగా జరుగుతూ ఉన్నదా లేదా అనేది ప్రత్యేకమైన విషయము. ఈ దినము క్రిష్ణా, గోదావరి నదులలో కొట్టుకు పోయిన లంక భూములు ఉన్నాయి. వాటికి పూర్తి శిస్తు వసూలు చేస్తున్నారో లేక పావలా వసూలు చేస్తున్నారో ప్రభుత్వంవారు ఒకతూరి verify చేయించడం మంచిది. ఈ నీటి వరువడి సక్రమంగా లేనందువలన, ఈ లంకలలో కొన్ని గ్రామాలకు గ్రామాలు గోదావరి నీటిలో కొట్టుకొని పోతున్నాయి. మాట జరుగుతుండి వున్న తావున, మీకు గాని, M. L. A., లకు గాని అక్కరగా ఉన్న తావున ఆ గ్రామాలు కొట్టుకొని పోకుండా అంతో ఇంతో rivetment కడుతున్నారు. దిక్కు దరి లేనిచోట్ల, వాటినిగురించి అనుకునేవారు ఉండరు. కనుక కమ్యూనిస్టులు opposition లో ఉన్నవారు తమ తమ నియోజకవర్గములు గురించి ఈ విషయములో కొంత శ్రద్ధ చూపకపోతే అక్కడ ప్రజలకు చాలా అపచారం చేసినవారవుతారని, వారు గట్టిగా చెపితేనే ప్రభుత్వము కదులుతుందని చెప్పుతున్నాను. క్రిష్ణా, గోదావరి లంకలలో కొన్ని గ్రామాలకు గ్రామాలు పోగొట్టుకొనే పరిస్థితి ఉన్నది. అక్కడ rivetment చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. Rivetment చేస్తేనే అక్కడ ఉండే గడ్డలు

14th March 1956] (Sri P Thimma Reddi)

దక్కుతాయి, అప్పుడే, దాన్ని ఆశ్రయించుకొని ఉన్న బీదవాళ్ళు అక్కడ బ్రతకడానికి అవకాశముంటుంది. అధ్యక్షా! చెప్పాలంటే చాలా ఉన్నాయి, గాని వ్యవధి లేదు. Revenue కు సంబంధించి, జమీందార్లకు సంబంధించి రెండు మాటలు చెప్పి సెలవు తీసుకొంటాను. Survey settlement గురించి, ఇది ఎంతకాలం పడుతుందని ఆ ఉద్యోగస్తులను అడిగితే కనీసం పది సంవత్సరములు పడుతుందని చెప్పారు. ఈ పది సంవత్సరాలు శిస్తు ఏరకంగా వసూలుచేస్తారని అడిగితే rent reduction ప్రకారం చేస్తారని అన్నారు. ఈ rent reduction అనేది మామూలుగా రైత్వారీ శిస్తుకంటె సాధారణంగా హెచ్చుగాఉంటుందని చెప్పారు. హెచ్చుగా ఉంటుంది అంటె, settlement పూర్తి అయిననాడు మీరు రైతుకు మరలా ఏమైనా కట్టిస్తారా అంటే, ప్రభుత్వములో ఎప్పటికి వసూలుచేసింది ఇచ్చేదిలేదని చెప్పారు దీన్నిగురించి ప్రభుత్వము మరొకతూరి యోచనచేయమని మనవి చేస్తున్నాను. ఏదో ఒక చట్టము చేశాము. దాని ప్రకారం ryotwari settlement చేయబోతున్నాము. కాని ఈదినము Rent Reduction Act క్రింద ఒక నిర్ణయం చేసిన తరువాత, అది రేపునిర్ణయము చేసే రైత్వారీ assessment కంటె హెచ్చుగా ఉంటే, ఆ difference మట్టుకు ప్రభుత్వము కట్టించేటటువంటి ఏర్పాటు చేయవలెనని మనవి చేస్తున్నాను.

ఇంకొక విషయము మనవి చేయదలచుకొన్నాను. పోయిన సంవత్సరము శ్రీకాకుళంనుంచి ఒక జమీందారు నా వద్దకు వచ్చాడు. అతనికి ఇద్దరు కూతుళ్లు పెళ్ళి కావలసిన వారు ఉన్నారు. రెండు మూడేళ్ళక్రితమే వాళ్ళకు పెళ్ళి అయ్యే వయస్సు వచ్చింది. పెళ్ళిచేయలేకుండా ఉన్నారు. ఎవరికంటె వారికి ఇచ్చి పెళ్ళిచేయలేకుండా ఉన్నాడు. మర్యాదస్థుడు, చదువుకొన్నవాడు కావాలంటే మాటలు కావాలి ఆ మాటలు ఇచ్చేదానికి భూములు లేవు, ఆదాయంలేదు. ప్రభుత్వము ఏదో Compensation ఇస్తామని చెప్పింది. ఎప్పుడు ఇస్తారో ఏమీ తెలియదు. నా ఆస్తే గనుక నా చేతిలో ఉన్నట్లయితే నా కొడుకులు చదువుకొనే దానికి కావచ్చు. నేను కట్టుకొనే ఇంటికి కావచ్చు ఎవరికైనా దానమిచ్చేదానికి కావచ్చు ఇంక నాయిష్టంవచ్చినట్లు అమ్ముకోడానికి కూడ అవకాశం ఉంటుంది అని చెప్పాడు. పేరుకేమో అతడు జమీందారే. జమీందార్లందరు ఒకేవిధంగా ఉంటారా? వేలకొలది ఎకరాలు, తీసుకున్నప్పటికిని, లక్షలు బ్యాంకులలో ఉండే జమీందార్లు ఉంటారు. అటువంటి జమీందార్లు ప్రభుత్వాన్ని వంచగలరు. చించగలరు. కుంచగలరు. కాని చచ్చి చావని జమీందార్లు కూడా చాలామంది ఉన్నారు. శ్రీకాకుళంనుంచి వచ్చిన ఆ జమీందారుకు ఏదో 10 వేలో 20 వేలో రావలసిందిగా ఉంటే, అక్కడ Tribunal దగ్గరకు ఇక్కడ ప్రభుత్వము-దగ్గరకు వచ్చాడు. నాదగ్గరకువచ్చి భోరుభోరున ఏడ్చినాడు. ఏమండి పెళ్ళి అయ్యే బిడ్డలు ఉన్నారు, తినడానికి నాకేమి లేకపోతే పోయింది. నా కొడుకులు అడుక్కు తిని బ్రతుకుతారు. కాని నా బిడ్డలకు మాత్రం లక్షణంగా పెళ్ళిచేయాలని అనుకొంటున్నాను. నాకు ఇవ్వ వలసిన 20 వేలో, 30 వేలో నాకు ఇచ్చినట్లైతే నా బాధ నేను తీర్చుకుంటాను. నా కిచ్చే మొత్తము ముందుగా ఇచ్చినట్లైతే, తరువాత దానికి కావలసివస్తే వడ్డీకూడ కట్టిస్తాను, కనుక నాకు ముందుగా ఇప్పించండని బ్రతిమాలినాడు, కాని నేను ఎవరికి చెప్పేది! రాతికి చెప్పేదా, చెట్టుకు చెప్పేదా! గోడకు

(Sri P Thimma Reddi) [14th March 1956

చెప్పేదా, ప్రభుత్వంలో ఒకరికి చెప్పేదానికి అవకాశంలేదు. ఫలానివారు ప్రభుత్వము అనేదానికిలేదు. ఒక మంత్రినిగాని, ఒక Secretary ని గాని ఒక Department Head ను గాని ప్రభుత్వము అనడానికి లేదు. ప్రభుత్వ మనేది ఒక పదము మాత్రమే గాని, ఫలానివాడు ప్రభుత్వము అనేదానికి లేదు. ఏదైనా సమస్య వచ్చినప్పుడు ఫలానా వాడు జవాబు చెప్పుతాడు అనే అవకాశము లేదు. ప్రభుత్వంలో ఎవరి గోడవా వినే వాడు లేడు. అదీ ఈ ప్రభుత్వము! అందువల్ల ఈ చిన్న చిన్న జమీందార్లకు ఇవ్వ వలసిన మొత్తాలైనా త్వరగా ఇచ్చివేయండని మనవి చేస్తున్నాను. కావాలంటే ఎదురు వడ్డీ కట్టుకొని ఇవ్వండి వాళ్ళ ఆస్తులను మనము గుంజుకొన్నాము. కాబట్టి వాళ్ళకు ఇచ్చేడబ్బు ముందుగా ఇస్తేమంచిది. ముందుగా ఇస్తే ప్రభుత్వానికి వచ్చే నష్టమేమి ఉన్నది? మన comrades అందరు కూడ ఏదో Land Reforms వస్తాయని చాలా ఆశాజనకంగా వున్నారనుకొంటాను.

Sri PILLALAMARRI VENKATESWARLU —మాకు ఆ ఆశ పోయింది.

Sri P. THIMMA REDDI,— ఇంకొకటి మనవి చేస్తున్నాను. Land Reforms వస్తాయని అంటున్నారు. ఈ లోపల కొంతమంది బుద్ధిలేనివారు, చెమటంతా గడ్డకట్టించుకొని భూములు తీసుకొన్నారు. కాని బుద్ధిమంతులు భూములు కొనకుండా ఇళ్ళుకట్టు కొన్నారు. కొంతడబ్బు Banks లో పెట్టు కొన్నారు, ఇంకా కొంత బంగారు రత్నాలలోకి మార్చుకొన్నారు కనుక Land Reforms తెచ్చేటప్పుడే towns లో ఉండే ఇళ్ళ reforms కొంచెం వడ్డీలతోబాటు Banks లో వుండే డబ్బు reforms దానితోబాటు బంగారు, రత్నాలుగా పెట్టుకొన్నటువంటి వాటి యొక్క reforms ఇంకా వానితో ఉద్యోగస్తుల జీతాల reforms, అని ఇవన్నీ కలిసి property కి సంబంధించిన reforms అని పెట్టినట్లైతే బాగుంటుందని మనవి చేస్తూ ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను.

Sri T. RAMACHANDRA REDDI:- అధ్యక్ష మహాశయా, మనకు ఎన్నికలు అయి దాదాపు ఒక సంవత్సరం కావస్తున్నది. ఇప్పుడు ఈ అసెంబ్లీలో కూడ చాలామంది రైతులు ఉన్నారనే విషయం అందరికీ తెలుసు. మన ఎన్నికల సమయంలో గ్రామాలలోని రైతాంగానికి మనము ఎన్నో ఆశలు కల్పించాము, ఏదో సహాయము చేస్తామని చెప్పాము. కాని, ఈ శాసన సభకువచ్చి ఒక సంవత్సరం అయినప్పటికిని, ఇంత వరకు రైతులకు ఏమైనా సహాయం చేశారా అని ప్రతి ఒక గౌరవ సభ్యుని అడుగు తున్నాను. వారికి సహాయం చేయలేకపోగా వారిమీద అనేక పన్నులు మాత్రం వేయ డానికి మనము వెనుదీయులేదు. Land Revenue sur-charge అని, Betterment tax అని, water cess అని, మరి Diesel oil మీద taxation కూడాను ఇవన్నీ రైతుమీద వేసినాము. ఇవన్నీ కూడా రైతుకు చాలా దెబ్బఅని మాత్రము బాగా గ్రహించుకోవాలని మనవి చేస్తున్నాను. అందులో ముఖ్యంగా గత మంత్రివర్గము 10 రూపాయల లోపు శిస్తు మినహాయింపు చేస్తామని వాగ్దానం చేసినారు. ఆ వాగ్దానాలను మన మేమైన నిలబెట్టుకొన్నామా! వారి వాగ్దానాలన్ని నిలబెట్టి గతమంత్రివర్గాన్ని ఏమైనా గౌరవించామా! మనము గత మంత్రివర్గాన్ని గౌరవించలేదంటే, మనమే ఈ దినము

14th March 1956] (Sri T. Ramachandra Reddi)

ఏదైనా నిర్ణయము చేస్తే రానున్న ప్రభుత్వము మాత్రము ఏ విధంగా గౌరవించ గలదు, అనే విషయాన్ని శాసన సభ్యులందరు దీర్ఘంగా యోచించుకోవాలి. గత ప్రకాశం మంత్రివర్గం పది రూపాయల శిస్తు మినహాయింపు చేస్తామని చెప్పితే ఈ మంత్రివర్గము ఆ పది రూపాయల శిస్తు మినహాయింపు చేయకపోవడం అట్లుంచి, surcharge కూడ మినహాయింపు చేయలేకపోవడం చాలా శోచనీయంగా ఉన్నది. ఇంత మాత్రమైనా మనము రైతాంగానికి సహాయము చేయలేకపోతే, మనము ఇక్కడ రైతుల తరఫున, వారి ప్రతినిధులుగా, ఎందుకు ఉండవలెనో అర్థంకాకుండా ఉన్నది. అంతేకాదు, భూసంస్కరణ ఏదో ఒకటి చేస్తామని ఒక నిర్ణయానికి వచ్చాము, కాని ఎందుకు ఆ నిర్ణయాన్ని తు. చ. తప్పకుండా అమలులో పెట్టకుండా ఇంతకాల విలంబన చేస్తున్నామో అర్థం కాకుండా ఉన్నది. మనమేదైనా చేస్తామని చెప్పిన తరువాత కాలహరణం చేయడం మాత్రం చాలా అన్యాయము, దుర్భరము కూడా. కనుక తప్పకుండా ఈ భూసంస్కరణను మాత్రము త్వరగా అమలులో పెట్టవలెనని ప్రభుత్వాన్ని కోరుచున్నాను ఈ విషయంలో. భూ సంస్కరణల కమిటీ తమ రిపోర్టును ప్రభుత్వానికి అందజేసింది. దాన్ని పరిశీలించి త్వరలో ఆచరణలో పెట్టాలని నేను పదే పదే ప్రభుత్వాన్ని కోరుతున్నాను

ఇక బంజరు భూములు పేదవారికి పంచే విషయంలో గ్రామాలలో చాలా అక్రమాలు, అన్యాయాలు జరుగుతున్నవనే సంగతి ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఆ భూములకు పట్టాలు యివ్వమని ప్రభుత్వాన్ని కోరితే, అవి అన్నీ project affected areas లోకి వస్తాయి అని చెప్పి కొన్ని ప్రాంతాలలో మార్పులు చేయడము ప్రారంభించారు. Project affected area అంటే, ఏది అవును, ఏది కాదు అనేది ప్రభుత్వము ముందుగా నిర్ణయించడము మంచిది కాని, ఎక్కడ పట్టాలు యివ్వమని కోరిననూ, ఆ ప్రాంతము అంతా project affected area అని తప్పించుకుంటూ పట్టాలు యివ్వక పోవటము సరియైన పద్ధతికాదు. నిజంగా ప్రభుత్వానికే గనుక పేదవాళ్ళకు యీ బంజరు భూములు యిచ్చి సహాయము చేయవలెననే ఉద్దేశ్యము ఉన్నట్లయితే, ఫలానా భూములు యివ్వవచ్చునని తేల్చి చెప్పాలి. ఇది గాకుండా పేదవాళ్ళకు బంజరుభూములు యిచ్చేవిషయములో tree valuation వేసేటప్పుడు (date trees) యీతచెట్లకు కూడ value కట్టడము ఉంటున్నది. ఇదివరకు ఒక్కొక్క చెట్టుకు 8 అణాలు వంతున వసూలుచేసేవారు. అలాంటిది యిప్పుడు రు 1-8-0 వసూలు చేస్తున్నారు. ఇంత పెద్ద ఖరీదు పెట్టి పేదవాళ్ళు కొనుక్కోటానికి భరించలేని స్థితిలో ఉన్నారు. ఈ విధముగా హెచ్చురేటు ప్రకారము valuation కట్టడము అన్యాయమని ఇది మానివేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత project affected areas లో కూడ valuation of lands అనేది ప్రభుత్వము తెచ్చిపెట్టారు. మెట్ట భూములకు నూరు రూపాయలని, మాగాణి భూమి అయితే మూడు వందల రూపాయలని నిర్ణయించి వసూలు చేస్తామని ప్రభుత్వం వారు అంటున్నారు. అయితే రాయలసీమలో ఎందుకు పనికిరాని భూములు కూడ యీ project affected area లో ఉన్నవి. వాటికి గూడ యింతరేటు నిర్ణయించడము సబబు కాదని ప్రభుత్వము గుర్తించాలి. ఈ రోజులలో నూరు రూపాయిలు అయినా యిచ్చి మెట్ట భూములు కూడ కొనుక్కోలేని స్థితిలో పేదవారు ఉంటున్నారు. డబ్బు ఖర్చుపెట్టి భూములు సంపాదించుకునే స్థితిలో

(Sri T Ramachandra Reddi) [14th March 1956

లేకుండా ఉన్నారు. కాబట్టి ప్రభుత్వమువారు Project affected area అని ఒకే రేటు universal గా నిశ్చయించడమనేది ప్రభుత్వము పొరబాటు చేస్తున్నారేమోనని అంటున్నాను. ప్రభుత్వము మొదటి రోజులలో పేదవాళ్ళకు ఉచితముగా భూములు యిస్తామని చెప్పి, చివరికి యీనాటికి వారివద్ద డబ్బు వసూలు చేయటానికి పూనుకోవడము చాలా అన్యాయము, శోచనీయమని అంటున్నాను. ప్రభుత్వము యిదిగమనించవల్సిన విషయము పేదవాళ్ళు ప్రభుత్వమునుండి ఉచితముగా భూములు సంపాదించుకోవచ్చుననే ఉద్దేశ్యముతోనే ఎందుకూ పనికిరాని బీడుభూములను ఎంతో కష్టించి సాగుకు లాయకీగా చేసి, సంవత్సరాల తరబడి పంటలు పండిస్తున్నారు. అటువంటివారికి ఏదైనా standardisation of price ప్రభుత్వము చేశారా అంటే, అదికూడ సున్నగానే కన్పిస్తున్నది. అంతకన్న ప్రభుత్వము పేదవాళ్ళకు చేసిందియేమీ కనబడడములేదు. ఇదిగాక, అనేక ప్రాంతాలలో బెల్లము ఉత్పత్తి దార్లయొక్క గోడు, ఘోష యింత అని చెప్పటానికి వీలులేకుండా ఉన్నది. వారి స్థితిగతులు మన సోదర సభ్యులైన పెదపల్లి చిదంబరరెడ్డిగారికి కూడా తెలుసును ఈ ఉత్పత్తిదార్లకు బెల్లము ధర ఏమాత్రము గిట్టుబాటు కాకుండా నానా అవస్థలు పడుతున్నారు బెల్లము నకు సరియైన ధర లేకపోవడమువల్ల, చాలా నష్టమునకు గురి అవుతున్నారు. ప్రభుత్వము వీరిగోడు కొంతవరకు ఆలకించి వీరికితగు రక్షణ యివ్వవలెనని కోరుతున్నాను.

తరువాత రైతాంగానికి బండిపట్టాలు జత ఒకటింటికి మార్కెట్టులో 80,90 రూపాయలు యిస్తేగాని దొరకటములేదు. ఇదివరకు ఏ 25,30 రూపాయలకో ప్రభుత్వమువారు Agricultural Department వారి ద్వారా సప్లయి చేయుచుండేవారు. ఇప్పుడు యివి ప్రైవేటు వ్యక్తుల చేతులలోకిపోయి, బ్లాకు మార్కెటు ధర యింతవరకు వచ్చిందని ప్రభుత్వం గుర్తిస్తారను కుంటాను. రైతులయొక్క అవసరాలు ఎంతవరకు అనేది ప్రభుత్వం గుర్తించినట్లులేదు. ప్రభుత్వమునకు ఎప్పుడు అయితే డబ్బు అవసరము అవుతుందో, ముందు వారియొక్క దృష్టి, దృక్పథము ఎంతసేపటికీ యీ పేదరైతులమీదనే ఉంటుంది రైతులకు ఏవిధంగాను, ప్రభుత్వం సహాయము చేయకపోగా, పన్నుల మీద పన్నులు మాత్రము వేసి వసూలు చేయటానికి ప్రభుత్వము చూడడము జరుగుచున్నది ప్రభుత్వమువారు యీ విషయములన్నీ గుర్తిస్తారని ఆశిస్తూ, అధ్యక్షులవారు నాకు యీ అవకాశమిచ్చినందులకు వారికి నా ధన్యవాదముల నర్పిస్తున్నాను.

*Sri B SUBBA RAO —అధ్యక్షా, మనరాష్ట్రములో ఉన్న లంకభూములు Field Labour Societies కు యిచ్చే పద్ధతి చాలా అధ్వాన్నముగా ఉన్నది. ఈ భూములు యివ్వటములో యిదివరకు గత మూడు సంవత్సరముల average rate కట్టి యివ్వటము జరుగుతోంది ఆ average rates మిక్కిలి హెచ్చురేట్లు అగుటవల్ల సొసైటీలు విపరీత నష్టమునకు గురియగుచున్నవి. అసలు ఈ లంకలు వెనుకటి బ్రిటిష్ ప్రభుత్వ కాలములో ఎకరము 4, 5 రూపాయల నామకః శిస్తుకట్టి ఇవ్వడం జరిగింది. అప్పుడు కొద్ది లాభముతో వారు జీవించుచుండేవారు. అలాంటిది లాభములు వచ్చే బదులు, యిప్పుడు విపరీతనష్టములకు గురి అవుతున్నారు. వెనుక బ్రిటిషువారి హయాములో యీ సొసైటీలకు ఒక్కొక్క ఎకరమునకు నాలుగు అయిదు రూపాయల చొప్పున కౌలురేటుకట్టి ఇవ్వడమనేది న్యాయమని మనవి చేస్తున్నాను. అలాంటిది మనకు కాంగ్రెసు గవర్నమెంటు వచ్చిన తరువాత ప్రభుత్వము ఆవిధముగా చేయకుండా

14th March 1956] (Sri B. Subba Rao)

మూడు సంవత్సరముల సరాసరి రేటుకట్టి కౌలు యిస్తున్నారు కాబట్టి యీ మూడు సంవత్సరాల సరాసరి రేటు రద్దు పరచి ఎకరమునకు 4, 5 రూపాయల చొప్పున శిస్తు నిర్ణయించి కౌలుకు యిప్పించ వలసినదిగా కోరుచున్నాను పూర్వము యీ భూమిని ఒక్క సొసైటీకి మాత్రమే యింతరేటు అని నిర్ణయించి యిచ్చేవారు కాదు. ఆనాడు ఈ సొసైటీ వాళ్ళకు competition ఉండేది ఎవరులేరు. అలాటి కౌలు వేలము వేస్తారని ప్రభుత్వము ప్రకటించగానే, గ్రామములో ఉన్న ధనవంతులు, భూస్వాములు యీ కౌలు రేటును హెచ్చుగా bid చేయడము వల్ల యీకౌలు వేలములో ధనవంతుల, భూస్వాముల చేతులలోకి పోతున్నది ఈ competition లో పేదవాళ్ళు ఏర్పరచుకున్న సొసైటీవాళ్ళు ఆ రేటుకు తట్టుకోలేక విడిచి పెట్టడము జరుగు చున్నది. పేదవాళ్ళు అయిన కారణముచేత ఎక్కడనో అప్పు సప్పుచేసియో, లేకవాళ్ళకు ఎక్కడనైనా యితర కొద్ది ఆస్తులు ఉంటే అవి తాకట్టుపెట్టి డబ్బుతెచ్చి ఒక్కొక్క సంవత్సరము యీ భూస్వాములను ఎదుర్కొనటానికి వేలముపాట హెచ్చురేటుకుపాడి భూములను కౌలుకు తీసుకోవడము గూడ సంభవిస్తున్నది. ఇంత హెచ్చు రేటుకు యీ సొసైటీలు వేలముపాటే పాడుకున్నందువల్ల లాభాలకు బదులు అధిక నష్టాలకు గురికావలసి వస్తున్నది. దీనివల్ల యిటు కౌలుద్వారా చూస్తే లాభాలు రాలేదు తెచ్చుకున్న అప్పులు చూస్తే, అవి తీరకుండా బకాయిలుగా ఉండిపోయినవి. చివరకు యీ అప్పులు తీర్చటానికి వారి ఆస్తులు అన్నీ వేలము వేయడము జరిగే పరిస్థితికి వచ్చినవి. వారికి యిదివరకు ఉంటున్న ఆస్తులు పోయినవి. యిటు సొసైటీ ద్వారానైనా భూములు కౌలుకు తీసుకోటానికి శక్తిలేని స్థితిలోనికి వచ్చారు. కాబట్టి ప్రభుత్వము ప్రస్తుతము పెట్టిన యీ మూడు సంవత్సరముల average rate అనే విధానము రద్దు చేసి పూర్వము బ్రిటిషువారి హయాములో యిచ్చిన మాదిరిగా గ్రామములో వున్న పెద్ద భూస్వాముల చేతులలోకి పోవటానికి ఆస్కారము లేకుండా, ఫీల్డు లేబరు కో-ఆపరేటివ్ సొసైటీవాళ్ళు పేదవాళ్ళు కాబట్టి, వాళ్ళకే పూర్వము యిచ్చిన రేటు ప్రకారము ఎకరానికి నాలుగు, అయిదు రూపాయల రేటు చొప్పున యివ్వవలసిందిగా కోరుచున్నాను. ప్రస్తుతము ప్రభుత్వము అవలంబించే వేలముపాట విధానమువల్ల పేదవాళ్ళకు అదివరకు వున్న ఆస్తులుకూడ పోయినవి. ప్రభుత్వము పేదవాళ్ళకు సహాయము చేస్తామని ఒకవైపున చెప్పటము, ఈవిధముగా ఉన్న ఆస్తులు గూడ మరొకవైపున పోగొట్టటము జరుగుచున్నది. ఇంతకంటె దురన్యాయము ఎక్కడా ఉండదని ప్రజలు భావిస్తున్నారు. ఇక పోరంబోకు భూముల విషయం చూస్తే పోరంబోకు భూములను ఎంతో కష్టపడి మరమ్మతుచేసి సాగుచేసుకుంటున్న హరిజనులకు నేటివరకు సదరు పోరంబోకు భూములకు పట్టాలు ఇవ్వకుండా సెంటు 1 కి 3, 4 రూపాయల చొప్పున విపరీతమైన పెనాల్టీలు వేసి బాధిస్తున్నారు ఎప్పటికైనా పట్టాలను ప్రభుత్వము యిస్తుందన్న ఆశతో రాత్రిళ్ళు పగళ్ళు, విరామము లేకుండా బాగుచేసి సాగుకు లాయకీగా తీసుకొచ్చారన్న సంగతి ప్రభుత్వము గుర్తించాలని మనవి చేస్తున్నాను. అదిగాకుండా యీ హరిజనులు- పేదవారన్న సంగతి-ప్రభుత్వానికి తెలియకపోలేదు. 10, 15 సంవత్సరాలుగా సాగుచేస్తున్న భూముల మీద ప్రభుత్వము యీనాడు అధిక penalties విధిస్తున్నారు. దీనివల్ల ఈ పేదవాళ్ళు చాలా బాధ పడుతున్నారు ప్రభుత్వముమీద ఈ సందర్భములో హరిజనులకు చాలా అసంతృప్తి ఏర్ప

(Sri B Subba Rao) [14th March 1956

ష్టది. ఎవరికి ఆక్షేపణలేనివి ఎన్నో పోరంబోకు భూములు ఉన్నవి. అలాంటి భూములనైనా వీరికి యిచ్చి వీరియొక్క కష్టములను ప్రభుత్వము తొలగిస్తారని ఆశిస్తున్నాను. ఇక గ్రామాలలో పనిచేసే గ్రామోద్యోగస్థులు గ్రామ నౌకర్లు అనగా వెట్టి, తలారి వగైరాలకు చాలా తక్కువ జీతములు యిస్తున్నారు. ఆ కొద్ది జీతములతో వారికి జీవనమే జరగడములేదు. వీరికి జీతములు పెంచడము చాలా అవసరము. గ్రామోద్యోగస్థులు, గ్రామనౌకర్ల ప్రభుత్వానికి పునాదిరాళ్ళు అనేవిషయము ప్రభుత్వము మరచిపోకూడదు. వారికి యిచ్చేపనులు, వహించే బాధ్యతలు చాలా గురుతరమైనవి. వీటికితోడుగా జీతములు ఎక్కువ యివ్వడమే సమంజసము. పైగా ఒక విషయము మాత్రము ప్రభుత్వము గమనించాల్సి ఉన్నది. ప్రభుత్వములో ఏపని అవసరమువచ్చినా, దానికి information కొరకు ఉద్యోగస్థులు గ్రామాలకు పరుగెత్తాలి. ఇక వీరు అక్కడికిపోతే, అది రాత్రి కాఫీయివ్వండి, పగలు కానీయ్యండి, అర్థరాత్రి మిట్టమధ్యాహ్నము భోజన సమయము, ఏవేళకు వెళ్ళినను, వాళ్ళను పలుకరించే దిక్కు యీ గ్రామోద్యోగస్థులు తప్ప మరెవ్వరూ లేరని మాత్రము గుర్తించాలి. Information యిచ్చేవారు వీరే వారియొక్క బాధ్యతలు గుర్తించి, యీ గ్రామోద్యోగస్థులు నౌకర్లనుపంపి, ప్రభుత్వానికి కావలసిన సమాచారము యిచ్చి పంపుతున్నారు. వాళ్లు బాధ్యత వహించక నిర్లక్ష్యము చేసేటట్లు అయితే ప్రభుత్వానికి ఒక్క సమాచారము కూడ రాదని గుర్తించాలి. కాబట్టి ఈ గ్రామోద్యోగస్థుల యొక్క నౌకర్లయొక్క జీతాలు పెంచడము ప్రభుత్వానికే లాభకరమని ప్రభుత్వము గుర్తిస్తారని అనుకుంటున్నాను తరువాత వారికి ప్రభుత్వము యిచ్చే కరువు భత్యము, దినభత్యము విషయము ప్రభుత్వము పూర్తిగా మరచిపోయినట్లున్నది. వారికి యిచ్చే భత్యములు యిప్పటి ఖరీదులను బట్టి సరిపోతుందా అని గూడ ఆలోచించవలెనని అంటున్నారు. ఒక్క సాధారణవ్యక్తి బైట గ్రామమునకు వెళ్లితే ఎంతఖర్చు అవుతుందో గూడ ప్రభుత్వం గుర్తించుకొని, వారికి యిస్తున్న భత్యములు పెంచాలని మనవి చేస్తున్నాను. గ్రామోద్యోగస్థులు, అనేక గ్రామాదులలో చాలా భాగము పేదవారుగా ఉన్నారు. ఇక గ్రామ నౌకర్లు వేరే జీవనోపాధి లేనివారే. ఈ సంగతి ప్రభుత్వానికి తెలుయునను కుంటాను. ఇట్టి సందర్భములో వారికి జీతాలుగాని, భత్యములుగాని పెంచటానికి ప్రభుత్వము ఎందుకు సంశయిస్తున్నదో అర్థము కావటములేదు. కాబట్టి యీ బీద ఉద్యోగస్థులుయొక్క నౌకర్లయొక్క కోరికలు ప్రభుత్వం మన్నిస్తుందని ఆశిస్తున్నాను.

తరువాత భూసంస్కరణలను తీసుకొని వస్తున్నామని ప్రభుత్వమువారు చెప్పడమే గాని, యింతవరకు తీసుకవచ్చినట్లు కనబడదు. భూసంస్కరణలను ప్రభుత్వము తీసుకుని రాకపోతే, ఏమాత్రము ముందు ముందు పేద ప్రజలయొక్క మన్నన విశ్వాసము పొందలేరని మాత్రము నేను గట్టిగా ప్రభుత్వానికి చెబుతున్నాను. కాబట్టి ప్రభుత్వము యీ విషయములో తగిన శ్రద్ధవహించ వలసినదిగా హెచ్చరికచేస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri M. MUNUSWAMI :— అధ్యక్షా ! ఈ డిమాండును నేను బలపరుస్తూ, కొన్ని సూచనలు ప్రభుత్వానికి చేయదలచాను. ముఖ్యంగా ప్రభుత్వమువారు యిచ్చే Agricultural Loans విషయము చూస్తే యివి ప్రస్తుతము State-wide గా ఉంటున్నావి. ఉదాహరణ చెప్పాలంటే మా నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేట తాలూకా

14th March 1956] (Sri M Munuswami)

మొత్తముమీద యింకా అయిదు లక్షలదాకా యివి వసూలుకాకుండా ఉన్నదని తెలుస్తున్నది. ఈ లోన్సును హద్దులేకుండా యివ్వడము, రైతులు తీసుకోవడము జరుగుతున్నదే కాని, యివి మరల ప్రభుత్వానికి తీర్చివేస్తున్నట్లు ఎక్కడా కన్పించదు. రైతులు ఎంతసేపటికినీ చూస్తే, ఒక్క plot of land మీదనే ప్రభుత్వము యిచ్చే రకరకాల అప్పులు రకరకాలుగా తీసుకోవడము జరుగుచున్నది. అందువల్ల అప్పులు బకాయిలుగా ఉండిపోతున్నవి. రైతులు గూడ యీ అప్పులు తీర్చే పరిస్థితులులేకుండా పోయినవి. ప్రభుత్వమువారు యీ అప్పులు చాలా భాగము పేదవాళ్ళకే యిచ్చినట్లు గూడ కనబడుతున్నది. ప్రభుత్వము ఒక్కసారిగా యీ అప్పులను వసూలుచేయాలని ఉద్దేశించడమువల్ల, పేదవాళ్ళకు చాలా బాధకరంగా ఉన్నది. అప్పును తీర్చడానికి గూడ వాళ్ళు చాలా బాధలు పడుతున్నారు. పైగా ప్రభుత్వము ప్రతిదానికి ఏదో ఒక పన్ను విధించడము కూడ జరుగుతున్నది. పేదవాళ్లు అయిన యీరైతులు తీసుకొన్న అప్పులు తీర్చడము, ప్రభుత్వము వేసిన క్రొత్త పన్నులు, అదివరకు వుంటున్న ప్రతి సంవత్సరము కట్టవలసినపన్ను, యివి అన్నీ కూడ ఒక్కసారిగా కట్టడము, రైతులకు చాలా భారముగా ఉన్నది. ప్రతి నెలలోనూ అప్పులు తీర్చడమో, శిస్తులు కట్టడమో జరుగుచున్నది. శిస్తులభారముచేత, అప్పులు తీర్చలేక పోతున్నారు అప్పులు తీర్చటానికి ప్రభుత్వము వాయిదాలు యిచ్చినప్పటికినీ, తీసుకున్న అప్పులు, దానిమీదవడ్డీ, యిదిఅంతాచేరి మీదుమిక్కిలిగా భారము కావడము చేత, తీసుకున్న అప్పులు అప్పులుగానే ఉండిపోతున్నవి. ఇవి ప్రస్తుత పరిస్థితులనుబట్టి తీరే అవకాశములేదు. కాబట్టి ప్రభుత్వము ఏదైనా ఒక మార్గము రైతులకు చూపించవలెనని కోరుతున్నాను. దీనికి నా సలహా ఏమిటంటే, యిదివరకు రైతులు తీసుకున్న పాత అప్పులు scale down చేసి, ఎదైనా ఒక సులువు మార్గములో యీఅప్పులు తీరేపద్ధతి ప్రభుత్వము చూపిస్తేగాని, రైతులకు relief అనేది కన్పించదు. ప్రభుత్వము ఒక్క వాయిదా రైతులకు యిచ్చినప్పటికినీ, మొదటి వాయిదాకు చెల్లించవలసిన మొత్తము, రెండవ వాయిదాకు చెల్లించవలసిన మొత్తము, అంతాచేరి రైతుకు మరింత భారమే అవుతున్నది. బరువుమీద బరువువేస్తే రైతు మరింత క్రిందకు కృంగిపోతాడు. ప్రస్తుతము జరుగుతున్నది ఎట్లా ఉన్నదంటే, ప్రభుత్వము వాయిదాలకు చెల్లించవలసిన మొత్తము వసూలు చేయటానికి పూనుకోవడము, దానిమీద యీరైతు మినిష్టరువద్దకుపోయి stay-order తెచ్చుకోవడము యీవిధముగా జరగడమువల్ల యీలోన్సు తీర్చకుండా ప్రతి వాయిదాకు సంవత్సరాల తరబడి వాయిదాలు పడుతూ, postpone కావడమే జరుగుచున్నది. ఒక ప్రక్కన కలెక్టరు అప్పుల వసూలుకు ఒత్తిడి చేయడము దానిమీద మంత్రిగారి వద్దనుంచి stay order రావడము, యీ విధముగా జరుగుతూఉంటే, దీనికి అంతు అనేది ఎక్కడో అర్థముకాలేదు. కాబట్టి ప్రభుత్వము యీ విషయములో ఎదైనా ఒక పద్ధతి ఆలోచించి, రైతులు తీసుకొన్న అప్పులు scale down చేసి, సులువైన వాయిదాలమీద తీర్చేపద్ధతి ఏదైనా ఒకటి ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే, రాజకీయ బాధితులకు భూములు యిస్తామని ప్రభుత్వము చెబుతున్నారు. నిజమే. కొన్ని కొన్నిచోట్లలో యిచ్చారు. కాని అవి ఎంతవరకు వారి స్వాధీనానుభవము లోనికి వచ్చినవి అనే సంగతిగూడ ప్రభుత్వము ఆలోచించవలసియున్నది. ఈ రాజకీయబాధితులకు యివ్వడములోకూడ నోరుగలవాళ్ళదే రాజ్యము

(Sri M. Munuswami) [14th March 1956

అన్యాయముగా, నోరుగలవాళ్ళకు ప్రభుత్వములో పలుకుబడి గలవారికి ముందుగా యివ్వడము కనబడుతున్నది. ఇదిగాక రాజకీయ బాధితులుఅంటే, భూములుఉన్న రాజకీయ బాధితులకు ముందు యివ్వడమా? లేని వారికి ముందు యివ్వడమా అనేది ప్రభుత్వము యోచించడములేదు. భూములు ఉన్న రాజకీయబాధితులు ప్రభుత్వములో పలుకుబడి గలవారికే ముందు యిస్తున్నవి. పలుకుబడిలేని రాజకీయబాధితులకు భూములు యివ్వనేలేదు. ఒకవేళ ఎక్కడైనా యిచ్చినా, గ్రామాలలో వున్నవారి influence వల్ల, అవి వారికి దక్కనివ్వడము లేదు వాస్తవముగా చెప్పాలంటే, ఏదో పేరు పెట్టుకొని కాంగ్రెసులో తిరిగి, జైలుకువెళ్ళి, ఊరకనే అక్కడ ముఖము చూపించి వచ్చి, యిక్కడ నేను గూడ జైలుకు వెళ్ళాను, భూములు యివ్వండి, అని ఏదో కొద్ది influence తో అది భూములు ఉండినా కూడ గ్రామములో పలుకుబడిమీద భూములు సంపాదించి ఆక్రమించుకొన్న రాజకీయ బాధితులు ఎంతోమంది ఉన్నారు. వాస్తవముగా నిజాయితీగా కాంగ్రెసులో చాలా sincere గా పనిజేసి ఉన్న భూములుకూడ యీ కాంగ్రెసు సంస్థకోసం పోగొట్టుకున్న వారి ఆలన పాలన చూడబడకుండా ఉన్న నిజమైన రాజకీయ బాధితులు, జైలుకువెళ్ళి, అందరితోపాటు అష్ట కష్టములు పడి వచ్చినవారికి, ఏమాత్రపు భూమికూడ దక్కలేదు. ఒకవేళ యిచ్చినా అది వారికి దక్కనివ్వడములేదు. ఒక ఉదాహరణ చెప్పదలచాను. ప్రభుత్వము యిటువంటి hard cases విషయము ఆలోచిస్తున్నట్లు కన్పించదు. వాస్తవముగా జరుగుతున్నదే యీ ఉదాహరణ. మా నెల్లూరుజిల్లాలో రాజకీయబాధితుల పేరు, వారికి ఎక్కడెక్కడ భూములు యిచ్చినది, జాబితా ఉన్నది. ఆ జాబితా ప్రకారము కొంతమందికి భూములు యిచ్చారు. ఇందులో కొంతమంది నోరుగలవాళ్ళు స్వాధీనము చేసుకోగలిగారు. కొంతమందికి యింతలోపుగా యిచ్చిన భూములు అవి project affected area లోని భూములు అని మరల ప్రభుత్వంనుంచి ఒక ఆర్డరు మూలముగా యివ్వడము ఆపివేశారు. నిజానికి ఈ ప్రదేశము project affected area క్రిందకు వస్తుందో రాదో ఎవరికి తెలియదు, కాని "వస్తుందేమో" అనే సాకుతో నిజస్థితి తేల్చకుండా ఆ భూములు యివ్వడము మానివేశారు. ఇలాంటి అధ్వాన్న పరిస్థితులు ప్రభుత్వములో జరుగుతున్నవి. ఇదిగాక యింకొక దారుణమైన ఉదాహరణ గూడ చెప్పదలచాను. రాజకీయ బాధితుడైన M. L. A. గారు యిక్కడ మన సభలోనివారే ఒక ఆయన చిత్తూరు జిల్లాకు చెందిన సభ్యుడు ఉన్నాడు ఆయన పేరు ఈ సమయములో చెప్పడము అంత మంచిది కాదని చెప్పదలచలేదు. ఆయనకు రాజకీయ బాధితుడు అని పేరుతో అయిదు ఎకరముల చిల్లర భూమి ప్రభుత్వం యిచ్చింది. వారు గూడ యిక్కడ ఉన్న మంత్రులతోటి సమానముగా జైలుకువెళ్ళి కష్టపడి వచ్చిన వారే. కాంగ్రెసులో నిజాయితీగా పనిచేసినవారే. ఆయన గ్రామానికి సుమారు నాలుగు అయిదు మైళ్ళ దూరములో ఆ భూమియిచ్చారు. కాని ఆ గ్రామానికి చెందిన గ్రామ మునసబు లేనిపోని అడ్డంకులు కలుగ జేస్తున్నందువల్ల, ఆ M. L. A. కు చివరకు ఆ భూమి స్వాధీనము కాకపోగా ప్రభుత్వము అయినా సహాయము చేయలేదు. ఆ విషయము అటు ఉంచండి. చివరకు యిది litigation లోకి పోవడమువల్ల M. L. A. కు 1500 రూపాయలు యిప్పటివరకూ ఖర్చుఅయినది.

ఒక ఉదాహరణ కూడా చెబుతాను. ప్రస్తుతం M L. A. గా ఉన్న ఒకరికి రాజకీయ బాధితులుగా 5 ఎకరాల చిల్లర భూమిని ఇచ్చారు స్వాతంత్ర్య పోరాటంలో, ఇప్పుడు మంత్రులుగా ఉన్నవారితో కూడా ఆయనకూడా అనేకసార్లు జైళ్ళకు వెళ్ళారు. ఈ మంత్రులుగా ఉన్నవారికి ఎంత service ఉన్నదో స్వాతంత్ర్య పోరాటంలో వీరికికూడా అంత service ఉన్నది. ఆయనకు ఇచ్చిన ఈ భూమి వారి ఊరికి 4, 5 మైళ్ళ దూరంలో allot చేయబడింది. ఆ ఊరి Village Munsiff ఆయనకు ఎన్నో కష్టాలు కలిగించి litigation లో దింపినాడు. ఆయనకు ఆ litigation లో 1500 రూపాయిలు ఖర్చయింది. కోర్టులో, ఆ భూమిమీద ఏ విధమైనటువంటి హక్కులూ ఇతరులకు లేవు, అది గవర్నమెంటు భూమే, ఇవ్వవచ్చునని, ఆయనపక్షం తీర్పుఇచ్చిన తరువాత గవర్నమెంటు కూడా దానిమీద ఏ విధమైనటువంటి హక్కులూ ఇతరులకు లేవని నిర్ణయించిన తరువాత, ఆ భూమి ఆయనకు సంక్రమించకుండా చేశాడు ఆ గ్రామ మునసబు. ఆ గ్రామ మునసబు ధనవంతుడే కావచ్చుననుకోండి, అక్కడుండే petty officials ను, revenue, police డిపార్టుమెంటుల officers ని తనచేతులలో పెట్టుకుని ఆ భూమి ఆ M L A కు సంక్రమించకుండా చేస్తున్నాడు. M L A గా ఉండి కూడా అతని పరిస్థితి ఈ విధంగా ఉంది ఇక రాజకీయ బాధితులలో M L A గా లేనివారి పరిస్థితి ఎల్లా ఉంటుందో ఊహించమని మనవి చేస్తున్నాను. M L A గా ఉండికూడా ఈ విషయమై పోలీసు జిల్లా సూపరింటెండెంటుకు, కలెక్టరుకు, concerned Minister కూ, Chief Minister కూ కూడా తెలియజేసి అవస్థ పడవలసి వచ్చింది. అర్జీలు పెట్టుకున్నా కూడా ఈవిషయం ఇంతవరకూ ఏమి తేలలేదు ఆ గ్రామమునసబు ఇవన్నీ తెలిసే చేస్తున్నాడు.

Mr SPEAKER·— ఆ విషయం వారే చెప్పుకుంటారు, ఇక్కడుంటే.

Sri M. MUNUSWAMI — ఈ బంజరు భూములు ఇవ్వడంలో ఇప్పుడే ఈ విధంగా ఉంటంటే, రేపు భూసంస్కరణలు చేసి ఏవిధంగా అమలుజరప బోతారో దుస్సాధ్యంగా ఉంది. ఉండే కొద్ది భూమినీ అక్కడక్కడే adjust చేయలేక పోతున్నారు. పెద్ద భూసంస్కరణలు చేసి వాటిని అంత సులభంగా అమలు జరపగలమా ? ఈ సమస్యను అంత సులభంగా పరిష్కరించగలమా అనే సందేహం రాకుండా పోదు. నేనే కాకుండా చాలా మంది M L. A. లు ప్రతి session లోనూ ఏదో మాట సందర్భంలో ఈ officers ని అదుపులో పెట్టవలసిందని సక్రమమైన పద్ధతులలో నడిచేటట్లుగా instructions ఇవ్వవలసిందని చెబుతూనే ఉన్నారు. అదంతా అరణ్యరోదనమే గాని అమలుజరిగే మార్గాలు కనిపించడంలేదు. ఒకవేళ instructions ఇచ్చినా, instructions పాటికి instructions ఉంటూనే ఉంటాయి, officers వారికి ఇష్టంవచ్చినట్లు వారు ప్రవర్తిస్తూనే ఉంటారు మనం సదుద్దేశ్యంతోనే చట్టాలు చేస్తాం. గవర్నమెంటు policy కూడా ఉదారంగానే ఉంటుంది. కాని ఆచట్టాలన్నీ సరిగా అమలుజరగనందున మన గవర్నమెంటు popular గా ఉండడంలేదు Popular కాకపోతే పోయింది. Unpopular కాకుండా ఉంటే చాలు. అదే నేను కోరేది. ఇది గమనించి ప్రభుత్వంవారు సక్రమమైన చర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను. అగ్రహారాలు ప్రభుత్వం తీసుకున్న తరువాత

(Sri M Munuswami) [14th March 1956

కొన్నికొన్ని ఇంౘ్రడికలు Act ప్రకారం Estates ఐనాయి. ఈ అగ్రహారాలలో కొంతమంది రైతులు 50, 60 సంవత్సరాలనుంచి ఆ భూములు స్వంతంగా సాగుచేస్తున్నా కూడా వాటిపై శిస్తు కట్టే అధికారం అగ్రహారీకునకే ఉన్నందున ఇంతవరకూ ప్రభుత్వం వారిచ్చేటటువంటి ఏ సమవాయాలూ కూడా రైతుకు దక్కకుండా ఉన్నాయి. వీటిని సరిచేస్తారని ఆశిస్తున్నాను. ఇక రైతు కూలీల వ్యవహారాలు సమగ్రంగా ఆలోచించి వారికి ఇవ్వవలసిన రక్షణలు కొన్ని గ్రామాలలోనే అమలుపెట్టారు. అది అన్ని గ్రామాలకూ వర్తింపజేస్తే, ప్రభుత్వం కొంత మేలు చేసిందన్న అభిప్రాయం ప్రజలలో కలుగుతుంది. ఇంక Estate Lands ని గురించి కొన్ని విషయాలు చెప్పదలచు కున్నాను. Survey and Settlement విషయమై నాకు తెలిసినప్పటినుంచీ ఏదో చేస్తూనే ఉన్నా, అది ఇంతవరకూ పూర్తికాలేదు. వీటినిగురించి కలెక్టరు దగ్గరకు పోతే, దాని reference కోసం Estate Manager దగ్గరకు పోవాలి. అక్కడ సక్రమంగా జవాబు చెప్పరు. పరిష్కారం కావడం చాలా delay అయిపోతున్నది. ఈవిషయం త్వరగా జరిగేటట్లు చూడవలసిందని కోరుతున్నాను.

*Sri B ADINARAYANA·—అధ్యక్షా ! ప్రభుత్వం తీసుకొన్న కొద్దిచర్యల వల్ల ఈ Revenue Department లో మార్పేమీ రాలేదని నేను చెబుతున్నాను కారణం ఏమిటి, ఒక Revenue Inspector చేస్తున్న అన్యాయాలను గురించి పై Officer లకు ఏదైనా report వ్రాస్తే అది పై officer చూచి 'for remarks' అని మళ్ళీ ఆ Revenue Inspector దగ్గరకే పంపుతున్నారు. అక్కడ ఆయన సర్దుబాటు చేసి వ్రాసి పంపేస్తున్నారు. వీటినిగురించి enquiry చేసే విషయంలో ప్రభుత్వం సక్రమమైన చర్యతీసుకోలేదని చెబుతున్నాను. ఏ రిపోర్టిచ్చినా దానిమీద ఏమిజరిగిందో తెలియకుండా ఉండే పరిస్థితులు ఏర్పడ్డాయి. క్రింది ఉద్యోగస్థులు అన్యాయం చేస్తున్నారని ప్రభుత్వానికిగాని, పై officer లకుగాని ఒక report వస్తే, అది officer enquire చేసినట్లయితే సక్రమమైన ఋజువు వస్తుంది. ఇది పాటిస్తారని ఆశిస్తున్నాను. ఇక బంజరు భూముల విషయంలో హరిజనులకుకూడా ఇస్తామని పేరుకు చెప్పారు. బంజరు భూములు ఎక్కువగానే ఉన్నాయి. ఈ బంజరు భూముల నెంబర్లిచ్చే టటువంటి గ్రామోద్యోగస్థులో, Revenue Inspector లో, ఆ నెంబర్లడిగిన వారిదగ్గర ఎంత తీసుకోవాలో అంతా తీసుకుని ఏదో నెంబరు ఇచ్చిన తరువాత ఆ అర్జీలు ప్రభుత్వానికి వెళ్ళి, భూమి ఇచ్చినారు. సాగుచేసుకునేందుకు పూనుకునే టప్పటికి, గ్రామాధికార్లూ, భూఖామందులూ, ఉద్యోగస్థులూ లాలూచీపడి ఆ భూమి వారి స్వాధీనం కాకుండా వారిని అష్టకష్టాలూ పెట్టి కోర్టులపాలు చేస్తున్నారు. మన ఆంధ్ర దేశంలో అటువంటి గ్రామాలు అనేకం ఉన్నాయి. ఈ విషయమై ప్రభుత్వం సక్రమ మైన చర్య తీసుకుని ఇస్తే పేదవాళ్ళకు ఇవ్వండి. ఇచ్చేటప్పుడే అది బంజరవునా కాదా, కాకపోతే మొట్టమొదట నెంబరు ఎట్లా ఇచ్చారు, మొట్టమొదట దున్నుకోడానికి అవ కాశం ఎట్లా ఇచ్చారు అనే విషయంలో విచారణజరిపి వాళ్ళు కోర్టుపాలు కాకుండా చూడవలసిందని కోరుతున్నాను. బీదవాళ్ళు కోర్టు పాలవుతున్నారు. భూములలోకి వెడితే కొట్టుకుంటున్నారు. ఏమండీ తహశీల్దారుగారూ ! ఇల్లా జరిగింది, దీని విషయం ఏమి చెబుతారండీ అంటే, మాకు సంబంధంలేదు. కొట్టుకున్నారు కనుక Court కు పోవలసిందే అంటున్నారు. ఈ భూమి మీకిచ్చాం. మీరు దున్నుకోండి అంటారు.

14th March 1956] (Sri B Adinarayana)

దున్నుకోడానికి వెడితే అక్కడున్నటువంటి భూఖామందులు వారిని చేరనివ్వరు. Loans విషయంలో ఎవరైతే loans కావాలంటున్నారో వారికి చేరడంలేదు. ఉదాహరణకు నూతులు త్రవ్వించుకోడానికి loans ఇస్తామన్నారు. ఎవరికిచ్చారు ఆ loans? ఎవరికైతే పలుకుబడి ఉందో, ఎవరు ప్రభుత్వ ఉద్యోగస్థులకు అండగా ఉంటారో, ఎవరికైతే ప్రభుత్వ ఉద్యోగస్థులతో understandings ఉంటాయో వాళ్ళే ఆ loans పుచ్చుకుంటున్నారు. కాని చాలాచోట్ల నూతులు మాత్రం త్రవ్వలేదు. పాత నూతులకు సున్నంవేసి ప్రభుత్వోద్యోగస్థులూ, ఆభూకామందులూ లాలూచీపడి నూతులు త్రవ్వినట్లు చూపించారు ఎన్ని కేసులలో అటువంటివి report చేశాం. దాని విషయమై ఏమీ చెయ్యరు. చెప్పకుంటే వినేవాళ్ళు కూడా లేరు. ఈ విషయమై ప్రభుత్వం చాలా అన్యాయం చేసిందని ఖచ్చితంగా చెబుతున్నాను. ఈ విషయంలో నేను తహశీల్దారుకు report వ్రాశిఇస్తే వాళ్ళకు భూమిలేదు పట్టాలేదు, అక్కడ నుయ్యిలేదు ఎందుకియ్యా ఇచ్చారు loans అంటే వినిపించుకోరు ఇటువంటి అన్యాయం చేశారు ప్రభుత్వ ఉద్యోగస్థులు. మేము చెప్పినందుకు క్రింది ఉద్యోగస్థులు అక్రమాలకూ, అన్యాయాలకూ దిగుతున్నారు. ఇది చాలా ఘోరం.

ఈ పన్నుల విషయములో, బంజర్ల విషయములోను అక్కడ సామాన్యమైన రైతులు భూములలో నూతులు త్రవ్వుకొని, డబ్బు ఖర్చుపెట్టి కష్టాలుపడి నీరు తీసుకొని పండించుకుంటూ ఉంటే పన్నులు వేస్తున్నారు. ఇది చాలా అన్యాయము. ముఖ్యముగా అనేక జిల్లాలకు మైనరు ఇర్రిగేషను పనులు ఉన్నవి. మనము ఏమో కోట్లు, లక్షలు ఖర్చుపెట్టి ప్రాజెక్టులు కడుతున్నాము, సంతోషమే. కాని ఆంధ్రలో మైనరు ఇర్రిగేషను పనులు ఎన్ని ఉన్నవి. ఎన్ని పాడు చెరువులు ఉన్నవి? ఒక consturctive programme లేకపోవడం, మరమ్మతులు లేకపోవడము చాలా విచారకరమైన విషయము. ఏ గ్రామములో ఎన్ని చెరువులు, బావులు ఉన్నవి లెక్కచూసుకొని వాటికి డబ్బు allot చేయ్యడము అవసరము. చాలా అన్యాయం జరుగుతూ ఉంది.

The Hon. Sri N. SANJEEVA REDDI :— On a point of information, Sir, రెండవ పంచవర్ష ప్రణాళికలో ఇలాంటి చిన్న చిన్న వాటికి రెండు కోట్లు రూపాయలు కేటాయించినాము. మైనరు ఇర్రిగేషనుకు సంబంధించిన వాటికి యీ అలాటుమెంటు చెయ్యడం జరిగింది

Sri B ADINARAYANA :—మంచిదే సంతోషము. కాని నేను చెప్పేది ఏమిటంటే ఏ ఏ జిల్లాలలో మైనరు ఇర్రిగేషను పనులున్నవో తీసుకొని జిల్లావారీగా కనీసము కొన్ని అయినా చేయించవలెనని కోరుచున్నాను. ప్రభుత్వము అనేకమైన చోట్ల ప్రచారము చేసినది గాని ప్రజలకు అందుబాటులో లేదు. పెద్ద పెద్ద ప్రాజక్టులు కడుతున్నారు వాటికి కావలసిన డబ్బు ప్రజల నెత్తిన రుద్దుతున్నారు. ఇదివరలో జమీందార్లు ఉన్నప్పుడే నయమేమో అని రైతులు అనుకుంటున్నారు. పూర్వము జమీందారీ area లో ఉండేటప్పుడు చెరువు కాలువ తూముల ప్రక్క భూములు అన్నీ రైతులు సాగు చేసుకునేవార. జమీందార్ల టైములోనే చెట్ల ఫలసాయము, గడ్డి అనభవించేవారు కాని ఈనాడు రైతులకు అది దక్కకుండా వారికి చెందకుండా చేస్తున్నారు. వేలంఆనే పద్ధతి పెట్టి వారువేసి పెంచిన చెట్ల ఫలసాయము వారికి కాకుండా చెయ్యడం వల్ల అన్యాయము జరుగుతుంది.

(Sri B Adinarayana) [14th March 1956

ప్రభుత్వం ఈ విషయాలన్నింటిని దృష్టిలో పెట్టుకొని గ్రామాలకు కావలసిన సౌకర్యములు కలుగ చెయ్యవలెనని కోరుచున్నాను.

క్రింది ఉద్యోగస్తుల విషయములో ప్రభుత్వము తగిన చర్య తీసికొనవలెను ఈ నాడు M L A లు అయినా మరెవరైనా ఏపనిమీదనైనా పోతే ఏమీ చర్యతీసుకోవడములేదు. ప్రభుత్వ ఉద్యోగస్థులు పెద్ద వారితో లాలూచీపడి వారి చెప్పుచేతలలో వుండి ప్రభుత్వానికి ప్రజలకు నష్టము కలుగ చేస్తున్నారు

Sri M RAJESWARA RAO — అధ్యక్షా, ఈ రెవెన్యూ పద్దుక్రింద చాలా విషయాలు చెప్పవలసి ఉన్నది కాని time చాలా తక్కువగా ఉన్నందున కొద్దిగ మాత్రము చెప్పదలచుకున్నాను. మిత్రులు తిమ్మారెడ్డిగారు అన్ని విధములా మా అభిప్రాయము వ్యక్తము చేసేరు అని భావిస్తున్నాము. అయితే ఈ పద్దను గురించి చర్చించేటప్పుడు భూమిపంపకములను గురించి ల్యాండు ప్రాబ్లెము గురించి ప్రభుత్వానికి నిర్దిష్టమైన పాలసీ ఉన్నదా అనే అనుమానం కలుగుతూ ఉంది. ప్రభుత్వము సామ్యవాద పద్ధతిన నడుస్తుంది అంటున్నారు. ఎక్కువమంది వ్యవసాయం మీద ఆధారపడి ఉన్నారు కాబట్టి tiller of the soil is the owner అనే ప్రచారము చేస్తున్నారు. ఎన్నికలలో చెప్పారు కూడా. గత మంత్రివర్గము ఒక కమిటీ వెయ్యడము ప్రభుత్వానికి అది అందినది, త్వరలో అది చర్చకు వస్తుందని వారు చెప్పేరు. కాని వాటివల్ల ఎంతభూమి వస్తుందో ఎవరికి ఉపయోగ పడుతుందో చెప్పలేము. ఈ నాడు పేదవారు ఏదో కొద్దిగా ఉన్న భూమిలో తమ జీవనము గడుపుకుంటూ ఉంటే encroachments అనే పేరుతో వారిని వెడలగొడుతున్నారు ప్రభుత్వం ఒక విధానము లేకుండా సంవత్సరానికి ఒక G O. pass చేసి పేదలను వెళ్ళగొట్టడము కన్పిస్తూఉన్నది. 1925 నుంచి పోయిన సంవత్సరమువరకూ objectionable లేకుండా వున్న భూములనుంచి నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొడుతున్నారంటే అది ఏ basis మీద జరుగుతున్నది అర్థము కావడములేదు. ఒక encroachment ఉన్నదంటే త్వరలో నిర్ణయించి చర్య వెంటనే తీసుకుంటే మీరు చాలా ఉపకారము చేసినవారు అవుతారు అని మనవి చేస్తున్నాను. Objectionable గా లేదని 5,6 సంవత్సరాలు చేసినతరువాత ఈభూమిమనకువస్తుందని ఎంతో ఖర్చుపెట్టినతరువాత చిన్న ఉద్యోగస్థులు వచ్చి ఇది objectionable land, విడచిపెట్టాలి అని అనడం జరుగుతూఉంది దీనివల్ల వ్యవసాయం చేసిన పేదలకు చాలానష్టము కలుగుతున్నది. ఎక్కడో తాలూకాకు ఒక encroachment ఉంటే త్వరలో నిర్ణయముచేసి మీరుచేసుకొనవద్దు ఈభూమిలో వ్యవసాయముచేస్తే మిమ్మలను prosecute చేస్తాము అనిముందుగా చెపితే దానిమీద డబ్బుపెట్టడముగాని, దానిమీద ఆధారపడడముగాని ఉండదు. కొంత శ్రమ తగ్గుతుంది. ఈ encroachments విషయములో ప్రభుత్వఉద్యోగస్తుల వైఖరి భూములు లేని పేదలవిషయంలో చాలా అధ్వాన్నముగా ఉంది. వారి దృక్పథము, ముఖ్యముగా village officers దృక్పథము మారాలి. ఈ encroachments సమస్య Revenue administration లో ప్రధానపాత్ర వహిస్తుంది. అందుచేత ఈ విషయములో ప్రభుత్వము ఒక నిర్దిష్టమైన విధానము అవలంభించవలెను. ఈ ఉద్యోగస్తుల విధానము మారాలి. వీరిలో చాలామంది corrupt గా ఉన్నారు. అవినీతిపాలుఅయి ప్రజలంటే లక్ష్యంలేదు అని చెబుతున్నాను. ప్రజా ప్రభుత్వం వచ్చిన తరువాత ప్రజలకు మార్పు వచ్చింది గాని ప్రభుత్వ ఉద్యోగస్తులలో మార్పు లేదు వారు ఇంకా బ్రిటిషు ప్రభు

14th March 1956] (Sri M Rajeswara Rao)

త్వములో subject గా ఉన్న ప్రజలను పరిపాలించేవారు ఉన్నారు. Government servants అంటే అర్థము ఏమిటి దానితో బాధ్యతలు తెలియని కారణముచేత ఈనాడు ప్రజలకు కాంగ్రెసుమీద, కాంగ్రెసు పార్టీమీద, కాంగ్రెసు ప్రభుత్వంమీద అసంతృప్తి పెరిగింది. లోపము ప్రభుత్వముదిగాని కాంగ్రెసు విధానములదికాదు. ప్రభుత్వ ఉద్యోగస్తులు ప్రజల యెడల ప్రదర్శిస్తున్న వైఖరి అని నేను మనవిచేస్తున్నాను. అందుచేత ప్రజా ప్రభుత్వములో, Democracy లో, ప్రభుత్వ ఉద్యోగులలో మార్పు రావలసి ఉన్నది. దానికి ప్రభుత్వము కృషి చెయ్యవలయును. మంత్రులు public meeting లు పెట్టడముకాకుండా ప్రభుత్వ ఉద్యోగస్తులకు మీటింగులు పెడితే బాగుంటుంది. కావలెనంటే ప్రత్యేకముగా propaganda కు ఒకమంత్రిని ఏర్పాటుచేస్తే మనకు ఇబ్బందిలేదు. నిజముగా ఈ అడ్మినిస్ట్రేషనుచూస్తే చాలా విచిత్రముగా ఉంది. ఖర్చులు తగ్గించకపోతే చాలా ప్రమాదము వస్తుంది 25 General Administration క్రింద 4 కోట్లరూపాయలు ఖర్చుపెడుతున్నారు దానిలో 72 లక్షలు తీసుకుంటే దాదాపు 3 కోట్ల 90 లక్షలు administration క్రిందఖర్చుఅవుతుంది. ఇదివిచిత్రమైనవిషయము. ఈనాడు Budget లో 46% of total revenue ఉద్యోగస్తులక్రింద ఖర్చుపెడుతున్నాము జీతాలు పెంచమని అంటున్నాము గాని అదిసాధ్యముకాదు. ఒక నిశ్చితమైన పథకము తయారు చెయ్యవలసిన అవసరమువుంది. Revenue Department లో Sub-divisional establishments క్రింద కోటి 85 లక్షలు ఖర్చుఅవుతుంది. ఇది ఉద్యోగస్తుల జీతాలు క్రింద ఖర్చుఅంటే T A. క్రింద 1 కోటి 95 లక్షలు ఖర్చుఅగుచున్నది ఒక్క తాలూకా administration లో 11 లక్షలు T A. క్రింద కన్పిస్తుంది. అందుకోసము వీరందరికి Fixed T. A పెట్టి ఇష్టమువచ్చినట్లు T A. claim చెయ్యకుండా ఏదైనా సూచన చెయ్యవలెనని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. కాని దీనికి మంత్రులే మార్గదర్శకులు కావాలి. ఈనాడు మంత్రుల tours చూస్తే ఇక్కడ జరుగుతున్నటువంటి Assembly విడిచిపెట్టి శతదినోత్సవం జరుగుతున్నదని సినిమాకు వెళ్ళి preside చేయుచున్న సంగతి కూడా నాకు తెలుసు. అందుచేత ఈ T As ను తగ్గించి మంత్రులే దీనికొక మార్గం చూపిస్తారని కూడా నేను ఆశిస్తున్నాను. పోతే ప్రస్తుతం ఇప్పుడున్న విధానాలలో కొన్ని మార్పులు తీసుకొని రావలయునని నేను మనవిచేస్తున్నాను. ఈ రెవిన్యూ administration లో మార్పులు రానంతవరకు కూడా మనం ఆశించే ఫలితాలేమీ రావని కూడా నేను సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. అందుచేతనే last time నేను Apropriation Bill మీద మాట్లాడు తున్నప్పుడు N. G Os. జీతాలు పెంచాలని సూచించాను. ఇవాళ మనకు డబ్బులేదు. Revenue Admınstration చక్కగా జరగాలి అంటే దీనికి మనం ఒక పథకాన్ని ఏర్పాటు చేసుకోవాలని సూచించాను. అది పంచశీల అనే రూపంలో ఉండాలని ఆనాడు సూచించాను. ఇవ్వాళ మన కున్నటువంటి procedure లో మార్పురావాలి. ఇవ్వాళ 'జి' ఫారం పట్టాలు ఇచ్చి ఎవరైనా దానిని లీజుచేస్తామంటే దానిని cancel చేస్తామని ఒక rule పెట్టారు 'G' ఫారంలో ఇక్కడ ఒక అతను 99 ఏండ్లకు కవులు ఇచ్చాడు. ఆ కవులు ఇవ్వడం ఆ "G" ఫారం షరతులకే వ్యతిరేకం. ఆ విధంగా ఉన్నప్పుడు పట్టా cancel చేయాలని స్పష్టంగా

(Sri M Rajeswara Rao) [14th March 1956

ఉన్నది. ఈ ఒక్క విషయాన్ని నిర్ణయం చేయటానికి నాలుగు సంవత్సరాలు ఫైలు maintain చేశారంటే ఇది ఎంత ఆశ్చర్యంగా ఉందో చూడండి ఇది నేను Land Revenue Commissionerగారికి కూడా చూపించాను ఈలాంటి procedure ను మనం చాలా మార్పు చేయవలసిన అవసరంకూడా ఉంది. ఈ system of administration అంటే ప్రతిది పైన Government దగ్గరనుంచి క్రింద మునసబు వరకు forwarded, forwarded అని రావడము, మరల క్రిందనుండి submitted, submitted అని అంటూ పైకి పోవడము, ఇటువంటి పరిపాలనా విధానంలో ఒక్కొక్క చిన్న file కూడా 4, 5 సంవత్సరాల వరకు కూడా dispose కావడంలేదు. అందుచేత ఈ పద్ధతిలో మనం కొన్ని మార్పులు తీసుకొని రావాలి. టూకైన్ హోము system మంచిదే కావచ్చు. అయినప్పటికీ ఇప్పుడున్న పరిస్థితులనుబట్టి procedureలో ముఖ్యమైనట్టి మార్పులు తీసుకొని రావటం ముఖ్యమని వారికి నేను మనవి చేస్తున్నాను. రెండవ విషయం ఇప్పుడు పెద్దపెద్ద జీతాలు తీసుకొంటున్నవారు, ఉద్యోగాలలో ఉన్నటువంటి వారు, జీతము ఎంత ఎక్కువ తీసుకొంటారో అంత ఎక్కువ responsibility వారిమీద ఉండవన్న సంగతి గ్రహించ కుండా వారికేదైనా ప్రమాదం వస్తే క్రింది ఉద్యోగస్తులమీద, ఆ concerned clerk, superintendent మీద త్రోసివేయడం జరుగుతున్నది. ఈ విధంగా ఉండడంలో వారు జీతాలు తీసుకొని సంతకాలు పెట్టడం మాత్రం కనిపిస్తుంది బాధపడేవారు చిన్న ఉద్యోగస్థులే. అందుచేత ఎక్కువ జీతాలు తీసుకొనే గెజెటెడు ఆఫీసర్లమీద ఎక్కువ Responsibilities ను ఉంచాలి ఇది ఎప్పుడైతే సాధ్యమవుతుందో అప్పుడే ఇప్పుడు ఉన్నటువంటి పని కొంతవరకు తగ్గుతుంది. అందుచేత ఇప్పుడున్న సర్వీసెస్ 50% వరకు తగ్గించినప్పటికీ మనకేమి ఇబ్బంది రాదు. ఆవిధంగా చేసి Services ను Retrench చెయ్యాలని మీకు మనవి చేస్తున్నాను. Services ను Retrench చేసినప్పుడు un-employment వస్తుందంటారు. Un-employment వస్తే ప్రభుత్వం పెట్టే పంచవర్ష ప్రణాళిక స్కీములలోను Industries లోను వారికి ఉద్యోగాలు చూపించండి. అంతేకాని Revenue ఖాతాలోనుంచి ఉద్యోగులను పోషించడానికి మాత్రం కాదు. ఇది ప్రజలమీద పన్ను రూపములో తగులుతుంది అందుచేత 50% వరకు ఉద్యోగస్తులను retrench చేసి మిగతా ఉన్నటువంటి ఉద్యోగస్థుల జీతాలను 25% వరకు పెంచాలి అని వారికి ఇదివరకే సూచనచేశాను. తర్వాతను 5 వ పాయింటు ఏమిటంటే మనకు co-ordination అవసరం. ప్రజలకు, ఉద్యోగస్థులకు మధ్యను ఒక విధమైన సన్నిహిత సంబంధం అవసరం. ఇద్దరికీ co-ordination లేకపోయినట్లయితే మనం చేసేటటువంటి పనులలో ఇటు శాసనసభ్యులకు గానీ, అటు మంత్రులకు గానీ తగినటువంటి సహకారం రాదు అని నేను భావిస్తున్నాను. అందుచేత మొదటి procedure ను change చెయ్యటం, పెద్ద ఉద్యోగస్థుల, గెజెటెడు ఆఫీసర్లయొక్క బాధ్యతను మనం పెంచడం, non-gazatted ఉద్యోగస్థులలో 50% తగ్గించడం, మిగిలినటువంటి వారి జీతాలను 25% పెంచడం, ఉద్యోగస్థులకు, నాన్ అఫిషియల్స్‌కు మధ్య co-ordination agents ను create చెయ్యడం, ఈ ఐదు సిద్ధాంతాల విషయంలో మనం ఒక కమిటీవేసి దీనిని పరిశీలన చేయవలసిందిగా మనవి చేస్తున్నాను. Madras Government వారు ఒక కమిటీని వేశారు అందుచేత ఈ విషయం కూడా దృష్టిలో పెట్టుకొని ఒక కమిటీని వేసి, ఈ ఉద్యోగస్థుల

14th March 1956] (Sri M. Rajeswara Rao)

యొక్క విషయాలను మనం జాగ్రత్తగా ఆలోచించాలి. Unless we take care of N G Os, I am sure they will not take care of us అందుచేత ప్రభుత్వం వారు ఈ విషయాలను జాగ్రత్తగా ఆలోచించి, ఉద్యోగస్థుల సమస్యలను, పరిష్కరించి ఉద్యోగస్థులకు ప్రజలకు మధ్యనున్నటువంటి సంబంధాలను పటుతరం చేయక పోయినట్లయితే Revenue Administration వల్ల మనం ఏమీ సాధించ లేము. నిన్న, ఈనాడు తిమ్మారెడ్డిగారు చేసిన విమర్శలను బట్టి ఇది బాగుగా అర్థం అవుతున్నది. మీరు ప్రజల సమస్యలను పరిష్కరించలేక పోతే రేపు పొద్దున మేము ఎన్నికలకోసం ప్రజల్లోకి వెళ్ళలేము. కాబట్టి ప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఈ public services విషయంలో ఒక మంత్రిత్వాన్ని సృష్టించాలని మనవిచేస్తూ దానివల్ల ఉద్యోగస్థులలో కూడా ఒక విధమైనటువంటి నూతన పరిణామాన్ని తీసుకురావలయునని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. VENKATASWAMI REDDI — అధ్యక్ష మహాశయా! Revenue మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ Demand ను బలపరుస్తూ జమీందారీ ప్రాంతాల్లో ఉన్నటువంటి కొన్ని ఇబ్బందులను గురించి వారి దృష్టికి తేదలచు కొన్నాను. మొట్ట మొదటిది ఈ జమీందారీలను రద్దుచేసిన తర్వాత Rent Reductin Act అని శిస్తుతగ్గించే విధానాన్ని ఒకటి ప్రవేశపెట్టారు. ఈనాటివరకూ ఆ శిస్తుతగ్గింపు విధానం సక్రమంగా అమలు జరుగక రైతులు ఇంకను అనేక ఇబ్బందులు పడుతున్నారు. ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలో రొక్కం శిస్తు చెల్లించే గ్రామాలుకొన్ని ధాన్యం శిస్తు చెల్లించే గ్రామాలు కొన్ని ఉన్నాయి. ఈ ధాన్యం శిస్తు చెల్లించేవారికి శిస్తు తగ్గింపు విషయములో మొట్ట మొదట దామాషా ప్రకారంగానే ఈ ధాన్యం శిస్తు తగ్గించారు. రెండు మూడు సంవత్సరములు అయిన తర్వాత ఈ ధాన్యం శిస్తును మళ్ళీ రొఖ రూపంలో చేసే విధానములో ఒక amendment ను తీసుకొని వచ్చారు. అది సమగ్రమైనటువంటి పద్ధతిగా అది అందరికీ అన్వయించే విధంగా చెయ్యకుండా ఇంకనూ దాంట్లో కొద్ది మినహాయింపులు ఏర్పడ్డాయి. దాంట్లో ముఖ్యంగా ఈ ధాన్య శిస్తు చెల్లించే టటువంటి గ్రామాలలో సహజంగా భూములు ఒకటి, రెండు, మూడు, నాలుగు తరగతులుగా ఉంటాయి. మొదటి తరగతి భూమికి ఎక్కువ శిస్తు నాల్గవ తరగతి భూమికి తక్కువ శిస్తు ఉంటుంది. కానీ ఈ ధాన్యంశిస్తు చెల్లించే గ్రామాదుల్లో రెండవదఫా amendment తెచ్చినప్పుడు కూడా మొదటి తరగతి భూమికి, నాల్గవ తరగతి భూమికీ ఒకే శిస్తు చెల్లించే విధానమే దాంట్లో రూపొందించ బడింది. దానిని ప్రభుత్వ దృష్టికి అనేకమారులు తీసుకొని వచ్చినప్పటికి కూడా దాంట్లో ఏ విధమైనటువంటి మార్పు తీసుకొని రాలేదు. మొదటి తరగతి భూమికి జిల్లాలోఉండే అదనపు మాగాణీ రేటు అంటే డెల్టాలో ఉండే రేటే ఉంటుంది. కాని ఆందోళన ఫలితంగా ప్రక్కన ఉన్న తాలూకాలోని అదనపు రేటుకు తగ్గించారు. మొదటి తరగతికి అదనపు రేటు 4 వ తరగతికి అదనపురేటు ఉండడం యేమంత న్యాయంకాదు. కాబట్టి దానిని వెంటనే తరగతి వారిగా తగ్గించడం మంచిదని మనవి చేస్తున్నాను. ఈ సందర్భంలో మన తిమ్మారెడ్డిగారు జమీందారీలలో ఉన్నటువంటి నీటి వనరుల విషయమైఎంతో ఆవేశంతో ప్రభుత్వం దృష్టికి తీసుకొని వచ్చినారు. అది వాస్తవంగా హృదయవిదారక

(Sri P. Venkataswami Reddi) [14th March 1956

సైనటువంటి విషయం జమీందారీ రైతులు ముఖ్యంగా ఇంత వెనుకపడి ఉండడానికి సక్రమంగా ఈ నీటి వనరులను మరమ్మత్తు చేయక పోవడమే మొదటి కారణం కాని ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న తరువాత చెఱువుకట్ట రిపేరులు మాత్రం ప్రారంభింప బడినవి. చాలావరకు పనులు జరిగినాయి. పస్తైచానల్స్ ఏ మాత్రం కూడా ఇప్పటికిని 8 సంవత్స రాలుగా మొట్ట మొదట వెంకటగిరిలో తీసుకొన్నారు. కాని యీ నాటికి కూడా కట్ట రిపేరు అయింది. ఒరవ కాలువ విషయం ఈనాటివరకు కూడా జరగడంలేదు. ప్రభుత్వం కూడా వాటిపై శ్రద్ధ తీసుకోలేదు కట్ట రిపేరులతో కూడా ఈ ఒరవ కాలువల రిపేరు కూడా చెయిస్తేనే తప్ప నీటి సౌకర్యం కల్గడానికి ఏవిధమైన అవకాశం ఉండదు. కాబట్టి వెంటనే ఒరవ కాలువలను కూడా రిపేరు చేయించడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

ఈ సందర్భంలో ఇటీవల betterment tax ఒకటి రైతులమీద విధించారు. రైతాంగం సమగ్రంగా భరించుకోవలసిన పన్నుగా తయారైనది. జమీందారీ ఇలాకాల్లో ఉన్న శతాబ్దాల క్రిందటి నీటివనరులు repairs చేయడంలేదు. వాటిని ఏమాత్రం improvements చెయడంలేదు ఈనాడు చేసే repairs మామూలు పరిస్థితికి తెచ్చేట్లు ఉన్నాయేకాని improvements కావు. Improvements మీద 25 వేలకుమించి పెట్టుబడిపెడితే betterment tax వేస్తున్నారు. 25 వేలనుంచి 50 వేలువరకు చెరువును మామూలుపరిస్థితికి తీసుకు రావటానికే ఖర్చు చేయవలసిన అవసరం ఉన్నది. దీనివల్ల చెరువులు మామూలుపరిస్థితికి తీసుకురావడంమాత్రమే జరుగుతుంది. కాబట్టి అటువంటి areas ను betterment tax నుంచి మినహాయింపు చేయాలని ప్రార్థిస్తున్నాను. జమీందారీ ప్రాంతాలు ప్రభుత్వం స్వాధీనం చేసుకుని 8 సంవత్స రాలైనా ఎంత ఆందోళనచేస్తున్నా జమీందారీ గ్రామాలు స్వాధీనంచేసుకున్న తరువాత వారు maintain చేస్తున్న accounts పూర్వంవలెకాక సర్కారు గ్రామాలతోబాటు maintain చేయవలసిఉన్నది. సర్కారు గ్రామాల్లో ఉండే గ్రామోద్యోగులకు వేరే ఎక్కువపనిలేదు. మామూలుపద్ధతిగానే సక్రమంగా పెట్టుకుంటారు జమీందారీ గ్రామా లలో సక్రమంగాలేని accounts వ్రాయడం తటస్థించింది కాబట్టి రెండింతలు పని చేస్తు న్నారు. వారిజీతం విషయంలో ఇంకా కాలయాపనచేయడం న్యాయంకాదని సాధ్య మైనంత త్వరలో సర్కారు గ్రామోద్యోగులతోబాటు జీతాలు ఇస్తారని మనవి చేస్తు న్నాను జమీందారీ గ్రామాల్లోఉండే గ్రామనౌకర్లు నేటివరకు స్వల్పజీతంకూడా లేకుండా ఉంటున్నారు. ఈవిషయం ప్రభుత్వదృష్టికి అనేకసార్లు తీసుకురాబడింది. ఆందోళన జరిగింది. వారికికూడా సర్కారు గ్రామాల్లోని గ్రామనౌకర్లకు ఉండే జీతాలు ఇవ్వడానికి పూనుకుంటారని మనవి చేస్తున్నాను. జమీందారీలు స్వాధీనమైన తరువాత అక్కడ ఉండే ఉద్యోగస్థులందరిని ప్రభుత్వంవారు తీసుకున్నారు. వారికికూడా retire అవడానికి age limit సర్కారు గ్రామాలతోబాటు నిర్ణయించి ఉన్నారు. ప్రమోషనులేదు. Retire అయిన తరువాత ఇచ్చే pension లేదు. కనీసం ఇంకొక 5 సంవత్సరాలైనా వారి ఉద్యోగాలను పొడిగింపుచేయడానికి ఆలోచించాలని కోరు తున్నాను. ప్రభుత్వంవారికి, రైతుకు మధ్య దళారీలు ఉండకూడదని మాధవవారు పరి పాలించేవారు ఉండకూడదని అంతా ఆలోచించినమీదట తీసుకువచ్చాము. ఈనాం రైతులు ఇంకా బాధ పడవలసియున్నది. ఈనాం Act కొంత ఆలోచనలో ఉన్నది.

14th March 1956] (Sri P Venkataswami Reddi)

చట్టం చేస్తున్నప్పటికి ఈనాం దారీ రద్దుమాత్రం ప్రవేశపెట్టడానికి ఏవిధమైన ఆస్కారం లేదని రివెన్యూ మంత్రిగారు గట్టిగా చెబుతున్నారు. రైతులలో మూడవవారి ప్రభుత్వం భరించడానికి ఓపికలేదు ఈవిషయమై మనము ప్రజలలో, రైతులలో అనేకసార్లు ప్రచారం చేశాము. Financial difficulty అనేది ఎప్పుడూ ఉంటుంది ఇది ఒక సంస్కరణకు సంబంధించిన విషయం కాబట్టి ఈనాం abolition కు సాధ్యమైనంత త్వరలో Act pass చేస్తారని ప్రభుత్వం గట్టిగా ఆలోచించాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri B. SANKARAIAH — అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ఇదివరకు బడ్జెటు ప్రవేశ పెట్టినపుడు finance విషయం మాట్లాడుతాం అన్నారు. భూ సంస్కరణల గురించి ఎక్కువగా మాట్లాతారనుకుంటే కమిటీ సూచనలు పరిశీలిస్తున్నాము అన్నారు. దాదాపు సంవత్సరంగా భారతదేశంలో ఏ రాష్ట్రంలో చూచినా భూ సంస్కరణలు ప్రధానమైన విషయంగా కనిపిస్తోంది, అని ప్లానింగు కమిషన్ వారు సూచించారు. ఈ రోజున ఆంధ్ర, తెలంగాణా కలిపి విశాలాంధ్ర రాబోతోంది. కాబట్టి అక్కడ ఉండే చట్టాలను పరిశీలించి దానికి అనుగుణ్యంగా ఇక్కడ చట్టాలను ప్రవేశపెట్టాలని గత బడ్జెటు సమావేశంలో సూచించారు. విశాలాంధ్ర ఖాయమైనప్పటికి, దేశం అంతట భూ సంస్కరణల విషయము ప్రధానంగా భావిస్తున్నప్పటికి తెలంగాణాలోను ఇతర రాష్ట్రాలలోను ఉండే భూసంస్కరణలను పరిశీలించకుండా అవి మనకు ఉపయోగిస్తాయా లేదా అనేది వేరే విషయం—ఈ రాష్ట్రంలో ఏ విధమైన సంస్కరణలు జరుగుతాయనేది కూడా రివెన్యూమంత్రిగారు తెలియచేయలేక పోయారు. ఈ విషయంలో మనరాష్ట్రం ఇతర రాష్ట్రాల మేరకైనా పోలేదని వెనుకబడి, ఎంతో అభివృద్ధి నిరోధకంగా తయారైనదనే విషయం తెలుస్తుంది. ఈనాము భూముల విషయం తీసుకుంటే మొదట అసెంబ్లీలో ఈనాము బిల్లు ప్రవేశ పెట్టినపుడు భూమిశిస్తు తగ్గింపు చట్టాన్ని తగాదాల్లో ఉండేటటువంటి ఈనాములకు వర్తింప చేస్తామని ఇకముందు తగాదాలు లేకుండా పోతాయని ప్రవేశ పెట్టారు. కళా వెంకట్రావుగారు రివెన్యూ మంత్రిగారు సెలక్టు కమిటీలో majority సభ్యులు హాజరు కాకుండానే—

Mr SPEAKER — సెలక్టు కమిటీలో మీరు సభ్యులు కాబట్టి ఆ విషయం మాట్లాడకుండా ఉంటే మంచిది.

Sri B. SANKARAIAH — అసెంబ్లీలో ఇచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోడానికి అయినా ప్రయత్నించకుండా rent reduction లేకుండా ఎన్నో తగాదాలు వచ్చేట్లా 5 వ భాగం నిర్ణయించారు. ఈ విషయం కాంగ్రెసు సభ్యులు ఇప్పుడైనా తెలుసుకుంటారని ......

Mr. SPEAKER.—మరోకసారి చెబుతున్నాను. సెలక్టు కమిటీ విచారణలో ఉన్న విషయాలను మెంబరుగా ఉండి మాట్లాడ కూడదని—

Sri B. SANKARAIAH.— బంజరుభూముల విషయమై ప్రభుత్వ దృష్టికి అనేకసార్లు తెచ్చాము. మా జిల్లాలో ఈ రోజున 10 వేల కుటుంబాలను eviction చేస్తున్నారు. Evection Proceedings ను ఆపుచేసి విచారించి నష్టం ఉంటే దానిని గురించి నిర్ణయం చేయాలని అర్జీలు ఇచ్చాము. ప్రతిసంవత్సరం పంట పండిన తరువాత

మహా గండంగా ఉంటోంది. విపరీతమైన కష్టాలు పెడుతున్నారు. గత సంవత్సరం ఏదో విధంగా Stay తీసుకున్నాము. ఈ సంవత్సరం మీరు విధించిన పెనాల్టి శిస్తు కట్టిన తరువాత పంటకోసుకు పోవాలని అన్నారు సాధారణంగా జమాబందీ అయిన తరువాత పెనాల్టి వసూలు చేస్తారు. శిస్తులు ఫిబ్రవరినుంచి వాయిదా వేసారు. బంజర్ల విషయంలో శిస్తులు పెనాల్టీలు వేసినది కలిపి కట్టిస్తే తప్ప stay కూడా ఇవ్వము అన్నారు. పంట కోసుకొనడానికి కూడా అనుమతి ఇవ్వము అని చెప్పారు. ప్రతినెల ఒక గండంగా తయారు అవుతోంది ఇదివరకు Chief Engineer గారు propose చేశారు. చెరువు లనే కొంతమంది రాజకీయ బాధితులకు కేటాయించి ఉన్నారు. Delta areas లోని రైతాంగానికి ఎప్పుడూ నష్టంలేదు. ఈ విషయం 10 వేల కుటుంబాలకు రెండు తాలూకాలకు సంబంధించినదని eviction proceedings మానివేసి విచారణకు క్రిందకు పంపించాలని కోరుతున్నాను. ముందు విచారణ జరిపించండి, తరువాత ఏమైన చర్యతీసుకొన వచ్చును. ఇది P. W. D. Revenue Department కు సంబంధించిన విషయం. వారి సలహాలు వచ్చిన తరువాత మంత్రివర్గం నిర్ణయించవచ్చును. ఇప్పటికైనా ఈ విషయం ఆలోచించి eviction proceedings ఆపడానికి ప్రయత్నం చేయాలని కోరుతున్నాను.

ఈ రోజున గ్రామాలలో ఉన్న భూములను అన్యాక్రాంతం చేస్తున్నారు. వాటిపై పెద్ద పెద్ద భూస్వాములకు పట్టాలు ఇస్తున్నారు. వాటిని గురించి రైతులు సెటిల్ మెంటు ఆఫీసరుకు అర్జీలు పెట్టుకున్నా, 6 నెలలకు, సంవత్సరానికి కూడా అవి విచారణకు రాకుండా పోతున్నాయి. Abolition అయినట్లు ప్రకటించిన తేదీ తరువాత ఇచ్చిన పట్టాలు చెల్లవు అని బిల్లులో ఉన్నప్పటికి కూడా వారు పట్టాలు ఇస్తున్నారు. కనీసం అటువంటివైనా విచారించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఊటుకూరు అనే గ్రామంలో ఉన్న బంజరు భూములలో జమ్మును యేటా కొందరు పేదలు కోసుకొని వెళ్ళేవారు. క్రిందటి సంవత్సరం వారు కోసుకొని వెడుతూంటే కొంతమంది రైతులు భూస్వాముల నాయకత్వమున బయలుదేరి వారిని అడ్డగించారు. కొట్లాటలు కూడా జరిగినాయి. కేసులు కూడా జరుగుతున్నాయి ప్రభుత్వమునకు కొంతడబ్బు కట్టి అది బంజరు భూమా కాదా అని నిర్ణయించమని అడిగితే, దాని విషయంలో కేసు జరుగుతున్నా కూడా, ఇంతవరకు దానిని సర్వేచేసి చెప్పలేదు. గ్రామస్తులందరూ కూడా అది బంజరు భూమేనని సాక్ష్యము ఇచ్చారు. సర్వే డిపార్టు మెంటువారు మట్టుకు ఇంతవరకు చెప్పలేదు.

సాధారణంగా అన్నిచోట్ల కూడా తక్కావిలోనులు, పేద ప్రజలకు అందటము లేదు. ఎక్కడ అయినా అందినాయంటే అక్కడ ఉద్యోగస్తులకు ఇంత percentage చొప్పున ఇస్తాము అని మాట్లాడుకుంటేనే అందినాయి. అసలు రైతులకు ఈ loans ఇచ్చేప్పుడు, ఇంత భూమి బాగుచేస్తున్నారు, దానికి ఎంత estimate అవుతుంది ఇటువంటి విషయము లన్నీ కూడ ఒక certificate లాంటిది ప్రభుత్వమే ఇస్తే బాగుంటుంది. దీనివల్ల పేదరైతాంగానికి ఉపయోగకరంగా కూడ ఉంటుంది. ఆ certificate కు కొంత fees పెట్టినా కూడా దానిని వారు చెల్లించుకొనగలరు. ప్రభుత్వము ఇవన్నీ చేసినప్పుడే ఈ loans ఇవ్వడం చాలాసులభం అవుతుంది. అట్లా

14th March 1956] (Sri B. Sankarayya)

చేయకపోతే రైతులకు ఈ loans కావలయునంటే, ఒకటి, రెండు, సంవత్సరములు, ఆఫీసర్ల చుట్టూ తిరుగవలసివస్తున్నది. అట్లా తిరిగినాకూడా పెద్దరైతులకు లాభంగా ఉంటున్నదిగాని, చిన్నరైతులకు దానివల్ల ఉపయోగం ఏమీకన్పించడములేదు. అందువల్ల ప్రభుత్వం ఈ విషయములో తగినశ్రద్ధ తీసుకొని ఆలోచించ కోరుతాను.

ఒక కేసును ఇదివరకు మీదృష్టికి తీసుకువచ్చాము. ఊరిలో ఉన్న పేదలపై భూస్వాములు రివెన్యూ ఉద్యోగస్థులవద్ద ఒక పిటీషను పెట్టితే దానిని విచారణకూడా చేయకుండా 107 సెక్షను క్రింద కేసు బనాయించారు. ముందే సెక్యూరిటీ ఇవ్వమన్నారు దీనిపై హైకోర్టువరకు వెళ్ళింది. కనీసం preliminary enquiry అయినా కానిదే సెక్యూరిటీ అడుగరాదని హైకోర్టు తీర్పుచెప్పినది దీనితరువాతకూడా విచారణలేకుండానే సత్ప్రవర్తనకు పూచీ తీసుకుంటున్నారు. దీనికి శిక్ష సత్ప్రవర్తనకు పూచీ యివ్వడమే కనుక విచారణకుముందే అట్టి శిక్ష విధించడం న్యాయంకాదు కొన్ని కేసులలో హైకోర్టువారు stay ఇచ్చారు. కాని క్రొత్తగా వచ్చే కేసులకు ముందే పూచీ తీసుకుంటున్నారు. నాకు 25 మంది కలసి ఒక పిటీషను పంపించారు. మారరాజు గూడూరు గ్రామంలో గోపాలరెడ్డిగారికి సన్నిహితంగా ఉండే ఒక భూస్వామి, మరికొంతమంది కలసి ఈ 25 మందిని లేబరు పార్టీఅని ఫలాన ఫలాన విధంగా గ్రామంలో అల్లరి చేస్తున్నారని ఒక పిటీషను పెట్టారు. ఏ విధంగా అల్లరిచేస్తున్నారో విచారించకుండానే ఆ 25 మందిని 2 వేలో 3 వేలో సెక్యూరిటీ కిట్టమన్నారు. అంటే సత్ప్రవర్తనకు పూచీ ఇవ్వమన్నారు. వెంకటగిరి, గూడూరు, రాపూరు, సూళ్లూరుపేట, నెల్లూరు ఈ 5 తాలూకాలు ఒక R. D. O. jurisdiction క్రింద పెట్టారు. వారు ఎక్కడ camp వేసుకుంటె వీరందరూకూడా అక్కడకు పోవాలి.

ఉప్పలపాడు అనే గ్రామంలో దాదాపు అందరిమీద కేసులుపెట్టారు. ఇటువంటి వాటిమీద ప్రభుత్వం సరియైన విచారణ జరిపించలేదు. ప్రభుత్వము ఇటువంటి కేసులు బనాయించే ఉద్యోగులను వెంటనే విచారణచేసి తగిన చర్యలు తీసుకొన గోరుచున్నాను.

మా జిల్లాకు సంబంధించినంతవరకు 10 వేల పేద కుటుంబములు సాగుచేసుకుంటున్న బంజరుభూముల విషయములో eviction proceedings ఆపి ఈ బంజరు భూముల విషయమై పునర్విచారణ చేసి పేద శివాయి జమాదార్లకు అన్యాయము జరుగకుండా చూడవలసినదని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Sri A. BAPINEEDU:—అధ్యక్షా, మనం అందరం క్రితం సంవత్సరము ప్రజలచే ఎన్నుకొనబడి అసెంబ్లీని నెలకొల్పాము. ఇంతవరకు కూడా మన పరిపాలనా పద్ధతి మారినట్లుగాని, అభివృద్ధి చెందినట్లు గాని ఏమీ కన్పించడములేదు. జిల్లా administration లో ఇదివరకు అసెంబ్లీ మెంబర్లు అంటే చాలా గౌరవముగా చూచేవారు.

Mr SPEAKER:—అది ఈ demand కు సంబంధించినది కాదండి. రేపు District Administration Demand వస్తుంది, దానిపైన మాట్లాడుదురుగాని.

Sri A BAPINEEDU — ఇప్పుడు సబ్ కలెక్టర్లుగా 5 యేండ్లు అనుభవము లేని I. A S ఆఫీసర్లను, కలెక్టర్లుగా ప్రమోటు చేస్తున్నారు. వారికి ముఖ్యంగా రెండు గుణములు ఉంటాయి. (1) వారికి తోచదు. (2) చెబితే వినిపించుకోరు. ఇదివరకు కలెక్టర్లు కావలయునంటే సబ్ కలెక్టరుగా 10 సంవత్సరములు అనుభవము ఉంటేనేగాని అయ్యేవారుకారు. వారు ప్రజలచేత ఎన్నుకోనబడిన సభ్యులు. అంటే చాలా గౌరవముగా చూచేవారు. ఇప్పుడు అది అంతాపోయి ఈ official bureaucracy చాలా ఎక్కువ అయిందని చెప్పడానికి చాలా చింతిస్తున్నాను.

Land Reforms తీసుకోని రావలయునని అందరూ కూడా చెబుతున్నారు. జమీందారీలను రద్దు చేశారు. ఈనాందారీలను రద్దుచేయ బోతున్నారు. అందుచేత lands కు కూడా reform చెయాలని అందరుకూడా అంటున్నారు. అయితే ఈ lands ను reform చేస్తారా ? బ్యాంకులలో ఉన్న డబ్బును reform చేస్తారా ? లేకపోతే ఇండ్లను reform చేస్తారా ? భూములు లేనివారు చాలామంది ఉన్నారుగాని, ఇండ్లులేనివారు చాలా తక్కువ. ఒక్కొక్కరికి ఒక చిన్న భవనము ఉంటుంది 10 వేల రూపాయిలు అద్దెలు వచ్చే భవనాలు చాలామందికి ఉన్నాయి. ఒక్కొక్క వ్యక్తికి 25 రూపాయిల ఆస్తికన్నా ఎక్కువ ఉండటానికి వీలులేదనికూడా reform పెట్టితే, అందరూ కూడా సంతోషిస్తారు.

హైదరాబాదు రాష్ట్రం వారు Land Reform చేశారు. మనం కూడా అక్కడకు వెళ్ళబోతున్నాం. అందువల్ల మనం కూడా ముందంజ వేసి జూలై మాసములోనో, ఆగస్టు మాసములోనో ఈ Land Reforms Bill తీసుకువస్తే బాగుంటుంది దీనిని గురించి మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను. జమీందారీ గ్రామాలను రద్దువేసినారు గాని, వాటిని సర్వే చేయకుండా అధిక పెనాలిటీలు విధిస్తున్నారు. అందులో ఎస్టేటు మానేజిమెంట్సువారు చేసే కరప్షను తగ్గించుటకు ఎవరితరం కావడములేదు. మేము వారికి ఏమి మనవిచేసుకున్నా ఖాతరుచేయడములేదు. కలెక్టర్లకు చెప్పినా వారు కూడా ఏమీ చెయలేక పోతున్నారు. Re-survey, Re-settlement చేయకుండా అధిక పెనాలిటీలు విధిస్తున్నారు. జమీందారీ గ్రామాలలో పట్టా ప్రకారంగా ఉన్న భూమికన్నా రైతుల స్వాధీనములో నికరంగా ఉన్న భూమి హెచ్చుగా ఉండడము సంభవిస్తున్నది ఈ భూమిని వారు చాలా కాలముగా సాగుచేసు కుంటున్నారు. అయితే ఈ గోజున ఉద్యోగస్తులు, నీవు పట్టాలో ఉన్న భూమికన్నా హెచ్చు భూమిని ఆక్రమించుకొన్నావు, కాబట్టి ఆ ఆక్రమణలో ఉన్న భూమికి పెనాలిటీ చెల్లించాలని రైతులను ఇబ్బందులు పెడుతున్నారు. 3 రెట్లు, 4 రెట్లు పెనాలిటీలు వేస్తున్నారు. దీనివల్ల రైతులు కష్టనష్టములకు లోను కావలసివస్తున్నది. Re-survey, re-settlement జరిపి భూమియొక్క విస్తీర్ణము, శిస్తు, మొత్తము, నిర్ణయించేవరకూ పెనాలిటీలు విధించడం మాని అసలు శిస్తును మాత్రమే వసూలు చేయించ వలయునని ఉత్తర్వులు చేయవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుతున్నాను.

జమా బందీలో కూడా 4 రెట్లు, 5 రెట్లు పన్ను కట్టినారు 2, 3 ఎకరాలు వున్న బీదవాడు దాన్నిగురించి కలెక్టరుగారి దగ్గరకు, రెవిన్యూ మంత్రిగారి దగ్గరకు ఏలావస్తాడో కూడా ప్రభుత్వం ఆలోచించవలసి యున్నది. అందుచేత single rate కట్టాలని చెప్పి

14th March 1956] (Sri A Bapineedu)

ప్రభుత్వం definite instructions యివ్వాలి. ఈ మెట్ట ప్రాంతాలలో 2 సం॥లు వర్షాలులేక పంటలు పోయినాయి. తరువాత అధిక వర్షాలవల్ల పంటలు పోయినాయి. పంటలు పోయినప్పటికీ కూడా మన రాష్ట్రం 3 కోట్లో 4 కోట్లో deficit లో వుందని చెప్పి మేము చెపుతుంటే single rate చొప్పున కట్టడానికి రైతులు సిద్ధంగానే వున్నారు. అటువంటప్పుడు వాళ్ళమీద 4 రెట్లు penalty వేశారు. మంత్రిగారు మా జిల్లాలోకి వచ్చినపుడు యివన్నీ కూడా Collector గారితో సంప్రదించి, Estate Managers చేసేటటువంటి అన్యాయాలను అరికట్టేటట్లయితేపన్నులు కట్టడానికి వారికి అభ్యంతరంలేదు. వాళ్ళకు వుండే కష్టాలుకూడా కొంచెం ఆలోచించాలి. జమీందారీ area ను Re-survey చేయించి, వాళ్ళు ఎంత పన్ను కట్టాలో నిర్ధారణ చేసినట్లయితే బాగుంటుంది తరువాత చెరువు గర్భాలు, జమీందారీ పోరంబోకుల విషయంలో కూడా ప్రభుత్వంవారు పరిశీలించాలి. Political Sufferers కి భూములు యిస్తామన్నారు. అందుకు Revenue Inspector దగ్గరనుంచి Revenue Board వరకూ అంతా against గానే వున్నారు. ఇవ్వవలసిన భూములను ఇవ్వడానికి కూడా ఈఉద్యోగిస్తులు అడ్డు పడుతున్నారు వీరు పెట్టుకున్న application ను Revenue Board వారు reject చేస్తే అది మంత్రిగారి దగ్గరనుంచి వచ్చిన తరువాత అయ్యా యిది ఎవరికీ ఉపయోగంలో లేదు అని మనం చెప్పకో వలసిందే తప్ప యీ లోపున Collector గారితో చెప్పకున్నా సరే వ్యతిరేకంగా వ్రాయడానికి ఆయన సందేహించుట లేదని మనవి చేస్తున్నాను. మా West Godavary District లో యిటువంటివి చాలా వున్నాయి. ఈ విధంగా కొన్ని వేలమంది వుండేవాళ్ళంతరి విషయం మంత్రుల దగ్గర ఎలా చెప్పాలో నాకు అర్థం కావడంలేదు. అందుచేత వారుకూడా కొంచెం sympathetic గా ఆలోచించి కొంతో political sufferers కి ప్రజలకు ఉపయోగంలో లేని భూమి (out of the place లో) తప్పకుండా యివ్వాలని instructions యివ్వాలి. రైతులు మీద అధిక పన్నులు వేస్తున్నాము ' వాళ్లుఎంతో యిబ్బంది పడుతున్నప్పటికీ కూడా కడుతున్నారు. మెట్ట తాలూకా లున్నాయి. వాటి విషయంలో ప్రభుత్వం వారు శ్రద్ధవహించాలి. లేకపోతే అక్కడి ప్రజలు చాలా నష్టపోతున్నారు. ఒక్క delta area లో తప్ప మెట్టతాలూకాలలో యీ Minor irrigations లో చాలా గమ్మత్తులు జరుగుతున్నాయి. వాటినిగురించి కోటిరెడ్డిగారు, చంద్రమౌళిగారు వున్నప్పుడు కొంత improvement జరిగిందనుకుంటాను. Tenders పిలిచి percentage of tenders యిస్తున్నారు. అది సరిగా చేసినట్లయితే బాగుంటుంది ఈ Minor irrigation లో irrigation wells, water wells ను గాను ఒక్క నూతికి 4, 5 వేలు ఖర్చు అవుతుందనడం ఆశ్చర్యంగా వుంది. అటువంటి నూయిని 7 వందలు 8 వందలతో కట్టడానికి నేను సిద్ధంగా వున్నాను. ఈ విధంగా collector గార్కి కూడా వ్రాసి యిచ్చాను. నుయ్యి త్రవ్వటకు 1,000 రూపాయలు, కట్టుటకు 500 రూపాయలు మొత్తంమీద ఒక నుయ్యికి 2 వేల రూపాయల కంటె ఎక్కువ ఖర్చుకాదు. అటువంటి దానికి 5 వేలు 6 వేలు అవుతుంది అంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. కాబట్టి మంత్రిగారు దీనిని గురించి ఆలోచించి definite instructions యిచ్చి అక్కడివాళ్ళు అన్యాయంగా ఏదైనా లబ్ధిపొందుతుంటే స్థానిక M. L A. లు గాని

(Sri A. Bapineedu) [14th March 1956

collector గారు గాని మంత్రిగారికి రిపోర్టు చెయవచ్చునని చెప్పాలి. అంతేగాని instructions యివ్వకుండా వాళ్ళు చెప్పేది వినకుండా వుంటే మేము ప్రజల తరఫున ఎన్నుకోబడి యిక్కడకు వచ్చి పరిపాలన చేస్తూండడము అనవసరం. మేము యిక్కడకు రావడం అనవసరం, 12-8-0 రూపాయలు బత్తెము తినడం, 150 రూపాయలు జీతం పుచ్చుకోవడం అనవసరం. మేము శ్రమపడి యిచ్చటకువచ్చి మామా జిల్లాలలో జరుగుతున్న విషయాలను represent చేసుకోవడం మావిధి. ఉదాహరణకు ఒక తహశీల్దారు solevency certificate యివ్వడానికి 15 రోజులు త్రిప్పినాడు. నా తమ్ముడికి కావాలంటేనే 15 రోజులు త్రిప్పినాడు. రెవిన్యూ యినస్పెక్టరు, గ్రామమునసబు recommend చేశారు. Encumbrance certificate తీసుకు వచ్చాడు. ఎందుకు ఇట్లా త్రిప్పుతావయ్యా అంటే నే నివ్వనన్నాడు. Collector గారిని అడిగితే constitution defect అన్నాడు. అయ్యా solevency certificate కి యిటువంటి ప్రతి చిన్న పనికి M L A ఎక్కడ వెళ్ళగలడు ? అందుచేత తహశీల్దారు గార్కి instructions యివ్వాలి అంటే ఆయన నిర్లక్ష్యంగా పైకిచూచాడు. ఇటువంటి వన్నీ జరుగుతున్నాయి. నేను రెవిన్యూ మంత్రిగారికే కాకుండా Chief Minister గార్కి కూడా మనవి చేసుకొంటున్నాను. స్వయంగా వెళ్ళి అవన్నీ చూచి certify చేయాలి. జమీందారీ గ్రామాలలో Estate Managers చేస్తున్నటువంటి అన్యాయాలు అరికట్టాలి. లేకపోతే ప్రజలకు మనమీద confidence కుదరదని తెలుపుతూ యివన్నీ note చేసుకోమని మనవి చేస్తున్నాను.

Srimathi Ch AMMANNA RAJA·—అధ్యక్షా ! ఈ డిమాండుమీద స్త్రీల అభిప్రాయాలుకూడా కావాలనే వుద్దేశ్యంతో నేను మాట్లాడుతున్నాను. ఇక్కడ స్త్రీ members చాలా తక్కువమంది వున్నారు. నేనుకూడా మాట్లాడకపోతే మా అభిప్రాయాలు తెలియుటకు వీలుండదని, అది న్యాయం కాదని నేను నావిధిని నిర్వర్తించడంలో తప్పుతానేమో ననే ఉద్దేశ్యంతో నేను మాట్లాడుతున్నాను. ఈనాం భూము లను జమీందారీ భూములలాగనే స్వాధీనం చేసుకోవడాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. అది న్యాయమైన పనికాదు అని నేను అనుకొంటున్నాను Select Committee లో స్త్రీలు లేకపోవడంవల్ల అక్కడ మా స్త్రీల అభిప్రాయాలు తెలియచేయకపోబట్టి యిక్కడైనా తెలియచేద్దామనే ఉద్దేశ్యంతో నేను మాట్లాడుతున్నాను. ఈనాములంటే ఏదో ఒక విధమైన దేశసేవ చెయడంవల్లనో, కళకొరకో, లేకపోతే సహాయంకొరకో గవర్నమెంటు వారు యీభూములను యిచ్చివుంటారు. అలా యిచ్చినటువంటి ఈనాము భూములను మళ్ళీతీసుకోవడం న్యాయంకాదని భావిస్తున్నాను. మనంకూడ దేశసేవ చేసినవారికి, రాజకీయ బాధితులకు భూములు యివ్వాలని అనుకుంటున్నాము. అటువంటప్పుడు ఎప్పుడో యేకారణంవల్లనో యిచ్చిన ఈనాములను తిరిగి తీసుకొనడమనేది న్యాయంకాదని చెప్తున్నాను. పోనీ ఒకవేళ తీసుకోదలచినప్పటికీ 10 ఎకరాల భూమివున్నవారి దగ్గర తీసుకోకుండా వుండడం న్యాయమే. ఎక్కువ వున్నవారిదగ్గర 10 ఎకరముల భూమి మాత్రం వుంచి మిగిలినది తీసుకొన్నట్లయితే బాగుంటుంది. దేశంలో అందరూ సంతోషంగా వుండాలి, శ్రేయోరాజ్యం స్థాపించాలి. దేశమంతా సుఖంగావుండాలి. అని అనుకుంటున్నప్పుడు యేఒక్క శాఖవారుకూడా బాధపడడం న్యాయంకాదనుకుంటున్నాను. జమీందారీ భూముల విషయంలో వాళ్ళకు నష్టపరిహారంయిచ్చే విషయంలో యిప్పుడు

14th March 1956] (Srimathi Ch Ammanna Raja)

తిమ్మారెడ్డిగారు చెప్పారు. వారు నిజంగా చాలా బాధపడుతున్నారు. మన కమ్యూనిస్టు సోదరులు అసలు యివ్వనక్కరలేదని, ఎప్పుడో యివ్వవచ్చుననీ, Bonds రూపంలో యివ్వమని చెప్తున్నారు. వారు ఏదో కక్షవల్ల చెప్తున్నారేమో కాని సరిగా ఆలోచించి చెప్తున్నారని నేను అనుకోవడంలేదు. ఇప్పటికే వాళ్ళు సుఖం అనుభవించారు. ఇక సుఖం అనుభవించ నక్కరలేదు అని అంటున్నారు. కాని వారు ఏదో గౌరవమైన పద్ధతిలో జీవించారు ఇప్పుడు sudden గా వచ్చి ఏమీలేకుండా పోగా పడితే అట్లా బీదగా వుండమంటే అది వారికి చేతకావడంలేదు. కాబట్టి వాళ్ళకు యివ్వవలసిన నష్ట పరిహారం సాధ్యమైనంత త్వరలో సాధ్యమైనంత మట్టుకైనా యిప్పుడు యిచ్చినట్లయితే వారి బాధ, శ్రమ కొంతవరకు తగ్గించినవార మౌతాము. జమీందారులలో బాగా సంపాదించుకున్నవారు, Banks లో నిలవ వేసినవారు వుండవచ్చును. ఏదో న్యాయంగా జీవించి, కొంత దాన ధర్మాలుచేసి, కష్టపడుతూ వున్నారు. కొన్ని సంస్థలను కూడా నిర్వహించారు. ఈ విధంగా సంస్థలను నిర్వహించి అవి వెనుకబడకుండా చేశారు. వారు జీవించినంత కాలం వారిని బాధ పెట్టకుండా చూడవలసిన బాధ్యత మనమీద వున్నది.

రాజకీయ బాధితులకు భూములిచ్చే విషయం గురించి చాలామంది చెప్పారు. కాని మంత్రిగారు దీన్ని గురించి చెప్పలేదని విచారిస్తున్నాను. ఈ విషయంలో ఏమి జరుగుతున్నదో తెలియడంలేదు ఎప్పటినుంచో ఉంటున్నది ఈ రాజకీయ బాధితుల సమస్య. మద్రాసు రాష్ట్రంలో రాజకీయ బాధితులకు ఇచ్చే భూమిని వీరమాన్యం అని అంటున్నారను కొంటాను. ఇక్కడ మనము కూడ వారికిచ్చే టటువంటి భూమిని ఆ విధంగా మంచి పేరుతో గౌరవించి, మంచి చెట్టాలు ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత ధైర్యంగా దానిని అమలు జరపవలసిన బాధ్యత మనమీద ఉన్నది. ఎవరో, ఏదో ఆక్షేపిస్తారని భయపడడంగాని, లేక ఏదో జరుగుతుందని సందేహించడం గాని, న్యాయమైన విషయంకాదు. అనుకొన్న తరువాత దాన్ని పూర్తిగా పరిష్కరించాలి. ఒక time limit పెట్టుకొని, ఇంతలోగా దీన్ని పరిష్కరించ వలసిందని అందుకు సంబంధించిన ఆఫీసర్లకు తాకీదులు ఇచ్చి, అది జరిగేటట్లు-చూడవలసి యుంటుంది. దీన్ని గురించి కొంత అల్లరి జరుగుతూ ఉన్నగి, పరిహాసం చేసేవాళ్ళు చేస్తువ్నారు. అయినా, ఇది మంచిది, చేయవలసి యుంటుంది అని ఒకసారి నిర్ణయించుకొన్నప్పుడు, దాన్ని పూర్తిగా పరిష్కరించవలసి యుంటుంది. ఏదో కొన్ని వేలమందికి ఇచ్చారని అంటున్నారు. ఈ ప్రభుత్వం వచ్చిన తరువాత ఎంతమందికి ఇవ్వడం జరిగిందో, నాకు తెలియదు. ముఖ్యంగా కొంతమంగి చాలా వృద్ధులైనటువంటి స్త్రీలు, ఇదేదో వస్తుందని, దీనివల్ల బాగుపడతామని కోర్టులు చుట్టు తిరిగి, Tribunals చుట్టు తిరిగి Committees చుట్టు తిరిగి నానా అవస్థ పడుతున్నారు. దీనివల్ల వారు నష్టపడు తున్నారేగాని, వారికి చివరకు ఏమి లాభము వస్తుందో తెలియడంలేదు. కాబట్టి ముఖ్యంగా స్త్రీల విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని వారిని అట్టే శ్రమపెట్టకుండా వారికి ఇవ్వవలసిన మాన్యాలేవో వారికి ఇప్పించగలిగితే చాలా సంతోషిస్తాము.

తరువాత భూసంస్కరణ వస్తుందని, దున్నే వానికే భూమి అవుతుందనే ఉద్దేశంతో కొంతమంది భూస్వాములు వారి భూములు చేస్తున్న కౌలుదార్లను తొలగించడం జరుగుతున్నది. ఈ విషయం గ్రామాలకు వెళ్ళి రైతుల కష్టసుఖాలు వింటున్నప్పుడు

తెలుస్తుంది. ప్రభుత్వము రైతులకు, కష్టపడేవారికి ఏదో సహాయం చేయాలనే మంచి దృష్టితో చేస్తున్నప్పటికి, ప్రస్తుతము బీదవారు కష్టపడుతున్నారు ఎందుకంటె వారిని తొలగిస్తున్నారు వారికి ఇంకేమి పనిచేతగాక చాలా బాధ పడుతున్నారు కనుక ఎక్కడెక్కడ కౌలుదార్లు తొలగింప బడుచున్నారో, అక్కడ వారిని తొలగించకుండా, ఒక విధమైన చర్య ప్రభుత్వము తీసుకొన్నట్లయితే చాలా సంతోషము. ఇప్పుడు ఎవరెవరికో బంజరు భూములు ఇవ్వడం జరుగుతూ ఉన్నది. కాని, ఆ విధంగా తొలగింపబడిన కౌలుదార్లకు ఆ బంజరు భూములను పంచిపెట్టడమో లేక మరేదైనా ఒక సహాయము చేసినట్లైతే గ్రామాలలో ఉండే ఎంతోమంది బీదవారికి కొంత సహాయం చేసిన వాళ్ళు అవుతారు.

ఇంకొక విషయం చెప్పదలచు కొన్నాను, ప్రతి రాష్ట్రంలో గూడ, ఇక్కడ ఉన్న మాదిరిగానే వంశపారంపర్యంగావచ్చే గ్రామఉద్యోగస్తులు, కరణాలు, మునసబులు అలాగే ఉంటున్నారేమో తెలియదు గాని దానివల్ల పెద్ద సుఖమేమి కన్పడలేదు. అనేక విధాలుగా వారు గ్రామస్థులను బాధపెట్టడం, mislead చేయడం, సరిగా భూములను survey చేయకపోవడం, తప్పుడు లెక్కలు వేయడం జరుగుతున్నది. కాని వారిపై సరియైన చర్యలు తీసుకొనుటకు వీలులేదని తెలుస్తున్నది. కనుక ఈ hereditary system ను తీసివేసి ఎవరినైనా ఉద్యోగులను నియమించి, వారిపైన సరియైన అధికారము మనము ఉంచుకొంటె బాగుంటుందని నేను అనుకొంటున్నాను

తరువాత land cess ను గురించి నిజముగా చాలా మంది రైతులు బాధపడడం లేదు అనుకొంటాను. ఏదో మేము కూడ దీనికి agitate చేసినామని చెప్పుకోటానికి కొంతమంది దీనికివ్యతిరేకంగా చెప్పుతున్నారేమోఅనుకొంటాను. రైతులు మొదటినుంచి ఈ irrigation పనుల విషయంలో చిన్న చిన్న ఉద్యోగస్థులకు ఎంతోడబ్బు ఇస్తున్నారు. దీన్నిబట్టిచూస్తే ఇప్పుడు గవర్నమెంటుకు land cess రూపములో ఇవ్వవలసింది చాలా కొంచెమని చెప్పవలసియుంటుంది. కాబట్టి ఉద్యోగస్థులు ఆవిధంగా రైతుల దగ్గరనుంచి అన్యాయంగా తీసుకోకుండా చేసేందుకు ఏదైనామార్గం చేసినట్లయితే చాలా సంతోషము. ఈవిషయంలో ఇప్పుడు ప్రభుత్వము కొంత చర్య తీసుకొంటున్నదని నాకు తెలుసు Proveఅయినచోట్ల అటువంటి వారిని శిక్షిస్తున్నారు. Tribunals కు పంపుతున్నారు. ఈవిధంగా ఉద్యోగస్తులు డబ్బుతీసుకొంటున్నది అందరకు తెలిసినదే. మాగ్రామంనుంచి ఇన్ని వందలు ఇచ్చామని చెప్పుకొంటారు. వారిని ఆవిధంగా బాధపెట్టడంవల్ల గవర్నమెంటుకు వచ్చేలాభము ఏమిలేదు. కనుక అటువంటిది జరుగకుండా చేస్తే బాగుంటుంది తరువాత చాలాచోట్ల unauthorised cultivation జరుగుతున్నది. దానివల్ల చాలామందికి బాధకలుగుతుంది. కలెక్టరుకు చెప్పుకొన్నట్లయితే నాకు అధికారంలేదు అంటారు. ఏదోచిన్న fine వేస్తారు. ఆ fines చాలా తక్కువ కాబట్టి వాళ్లు ఆ fines ఇచ్చుకొంటూ unauthorised గా చేసుకొంటూనే ఉన్నారు. కాబట్టి ఈ విషయమై ప్రత్యేకంగా ప్రభుత్వము ఏదైనా ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఎవరైన unauthorised గా వ్యవసాయం చేసుకొన్నట్లయితే ఆ వ్యవసాయంనుంచి వచ్చే రాబడిని పూర్తిగా గవర్నమెంటు స్వాధీనం చేసుకొనో లేకపోతే ఇంకొక సంవత్సరం వాళ్లు వ్యవసాయం చేసుకోకుండా చేయగలిగినట్లైతే వారు భయపడతారేమో అనుకొంటాను. ప్రతివారికి నీతి కలిగేలాగు కొంతవరకైనా న్యాయము జరిగేటట్లుగా చేసినట్లైతే రైతుకు కొంతవరకు మనము ఉపకారముచేసినవాళ్ళము అవుతాము.

14th March 1956]

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— అధ్యక్షా! ఈ Revenue Demand ను నేను బలపరుస్తూ తమ ద్వారా మన Deputy Chief Minister గారిని ఒక చిన్న ప్రశ్న అడుగుతున్నాను. Minor Irrigation క్రింద ఈ అయిదు సంవత్సరములకు రెండు కోట్ల రూపాయలు allot చేశామని ఉపముఖ్య మంత్రిగారు ఇందాక విజయనగరం Member గారు మాట్లాడుతున్నప్పుడు సెలవిచ్చారు. ఈ రెండు కోట్ల రూపాయలు minor projectsకొరకా, లేక minor irrigation కొరకా కేటాయించిందని అడుగుతున్నాను.

The Hon Sri N. SANJEEVA REDDI :— Minor projects కు కాదండి. అవి వేరే ఉన్నాయి P. W D కి ఇచ్చేది కాక, Revenue Demand క్రింద, బావులకు గాని, Supply Channels కు గాని, చిన్న చిన్న చెరువులకు గాని, Agriculture శాఖవారు, Revenue శాఖవారు ఖర్చుపెట్టడానికి గాను ప్రత్యేకంగా రెండు కోట్లు కేటాయించబడిందని చెప్పాను.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— చాలా సంతోషము. ఈ వివరము నాకు ఇదివరకు తెలియక ప్రశ్న వేసినాను.

మొట్టమొదట నా స్వవిషయము మనవిచేస్తున్నాను. స్వవిషయము గాని మరేది కాదు. జమీందార్ల పాలసీని గురించి మన తిమ్మారెడ్డిగారు సెలవిచ్చారు. ఆ విషయములో నేను కూడ వారితో ఏకీభవిస్తున్నాను. పిల్లలకు వివాహాలు చేసుకోలేని పరిస్థితులలో జమీందార్లు ఉన్నారు. గనుక వారికివ్వవలసిన మొత్తాలు కాస్త త్వరగా ఇప్పించేమని వారు సెలవిచ్చారు. నాకు వివాహము చేసేదేమిలేదు గాని, అప్పులతోటి చాలా బాధపడుతున్నాను. కనుక అవకాశముంటె కాస్త త్వరగా ఇప్పించవలెనని కోరుతున్నాను.

Minor irrigation విషయంలో మన Ex-Minister గారు చాలా అనుభవంతోటి సెలవిచ్చారు. కాని ఇదివరకు నేను ఈ Assembly కి వచ్చినప్పటి నుంచి Ex-Ministers ఎవరూ మాట్లాడడం నాకు కన్పించలేదు. కాని అది నిన్నటినుంచి ప్రారంభమైంది. అయినా తిమ్మారెడ్డిగారు మాత్రం చాలా అనుభవముతో అద్భుతంగా మాట్లాడారు. ఉన్న రహస్యాలు మంచిచెడ్డలు మా ప్రజలందరికి తెలియ జేసే అవకాశం వారు కలుగజేసినందుకు వారిని చాలాఅభినందిస్తున్నాను. కాని ఇంకను Ex-Ministers ఎక్కువ అయితే మాకు బాగా విపులంగా అన్ని విషయాలు తెలియ జేస్తారేమో అనుకొంటాను. అది మాకు చాలా ఉపయోగంగా ఉంటుందేమోనని భావిస్తున్నాను.

Mr. SPEAKER:— అది Revenue Demand క్రిందికి రావండి.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— Revenue పద్దు క్రిందకు అది ఏలాగు వస్తుందో మనవి చేస్తాను. వారు Revenue విషయం మాట్లాడుతూ వారి అనుభవమును సెలవిచ్చారు. Revenue లోనే కాకుండా ఇతర subjects లో కూడ వారి అనుభవాలు సెలవిస్తారేమోననే కోరికతో మనవి చేస్తున్నాను. బహుశః విశాలాంధ్ర వస్తుంది. కాబట్టి, ఇంకా Ex-Ministers ఎక్కువ అవుతారేమో అనుకొంటాను. ఆ విధంగా అయితే మాకు

చాలా సంతోషము. ఎందువల్లనంటే, విపులంగా ఇంకా కొన్ని కొన్ని విషయాలు ఎక్కువగా తెలియచేయగలరు Minor irrigation విషయంలో నేను కొన్ని విషయాలు మనవిచేస్తున్నాను. నా నియోజకవర్గము ద్విసభ్య నియోజకవర్గం. అందులో మూడుమంతులు జమీందారి area గా ఉన్నవి. అక్కడ ఆ రైతులు, ఆ ప్రజలు బాధపడుతున్న విషయం గురించి నేను అనేకసార్లు అనేక విధాలుగా Minister గారికి మనవి చేసినాను. అసెంబ్లీలో కూడ మనవి చేసినాను. ఇప్పుడు కొంతవరకు అక్కడ పనులుజరుగుతున్నాయి. మొన్ననే floods వచ్చినప్పుడు repairs జరిగాయి. అయినా ఇంకా చాలా చేయవలసినవి అట్లే ఉండిపోయినాయి. గవర్నమెంటు areas కు సంబంధించి నంతవరకు, ఇంతవరకు పనులు ఒక పద్ధతిలో జరుగుతున్నాయి. ఆపద్ధతే అక్కడ continue అయిపోతున్నది. కాని జమీందారీ areas లోమాత్రము ఇంకా ఆ పద్ధతి పూర్తిగా set up కాలేదు. కనుక ఈ area లో కూడ మంత్రిగారు ఎక్కువ శ్రద్ధతీసుకొని తొందరగా అక్కడ పనులన్నీ పూర్తిచేయవలెనని కోరుతున్నాను.

ఇక Minor Irrigation Supervisors, overseers, అదే తాలూకాలో అదే Division లోనె 10, 20, సంవత్సరాలుగా ఉండటంచేత ఆ contractors తోటి, ప్రజలతోటి ఎక్కువ touch ఉంటూ, పనులలో పంపకాలు చాలా ఎక్కువగా జరుగుతున్నాయి. అంతేకాదు వీరు ఎక్కువకాలము అక్కడే ఉండటంవల్ల ఆ head-quarters officer తో కూడ ఎక్కువ touch ఉంటుంది గనుక వీరిని transfer చేయకపోవడం జరుగుతుంది. దీనివల్ల ప్రజలకు చాలా బాధగాఉన్నది. కనుక ఈ విషయంలో మంత్రిగారు కొంతశ్రద్ధవహించి ఎక్కడ ఏ division లో ఎవరెవరు ఎన్నాళ్ళనుంచి ఉన్నారో చూచి, మూడు సంవత్సరములకంటె ఎక్కువగా ఎవరిని ఒకచోట [illegible] ఉండేటట్లు చేయవలసిందని వారికి మనవి చేస్తున్నాను.

ఇక పోతే, భూసంస్కరణలు తీసుకొని వస్తున్నామని మంత్రిగారు సెలవిచ్చారు. ఆ విషయము చాలా మంది సభ్యులు కూడ చెప్పారు. కాని అవి యింకా యింతవరకు తీసుకొని రాలేదని మన opposition పార్టీవారు చాలా బాధపడుతున్నట్లు ఉన్నది. ఇంకొక మన మాజీ మంత్రి తిమ్మారెడ్డిగారు అన్ని విధాల properties మీద కూడ సంస్కరణలు తెస్తే బాగుంటుందని అని, సెలవిచ్చారు. అది ఒక్కటే కాదు, నేను గూడ ఒక విషయము మనవిచేస్తాను. మన గోపాలరెడ్డిగారికి మంచి personality ఉన్నది నిజమే. వారు మంచి చిదానంద పురుషుడని గూడ యివ్వాళ పత్రికలో గూడ వచ్చింది. అంటే గోపాలరెడ్డిగారికి అటువంటి చిదానందము ఉన్నదన్నమాట. ఇక పోతే మన రెవిన్యూ మంత్రిగారు రామాయణము అంతా గూడ చక్కగా విమర్శించారు. అంటే వారికి అంత విజ్ఞానము ఉన్నదన్నమాట. కాబట్టి అవి గూడ సమర్థనీయముగా ఉండటానికి సంస్కరణలు తీసుకునివస్తే, యిక మనదేశము అంతా అతివేగముగా అభివృద్ధి చెంది అందరూ గూడ ముందుకు పోవటానికి అవకాశము ఉంటుంది. వారి చిదానందమునకు వీరియొక్క విజ్ఞానమునకు సంస్కరణలు తెస్తే, అవి అందరూ కూడ పంచుకున్నట్లవుతుంది. అట్లా చేస్తే అందరూ ముందుకు పోవటానికి అవకాశము కలుగుతుంది. భూ సంస్కరణలు తెస్తే ఎవరికో పదివేల ఎకరాలు వుంటే, అవి భాగిస్తారు. కాని, 30 ఎకరాలు, 40 ఎకరాలు ఉన్నవారిని భాగించమని కాదు.

తరువాత అమ్మన్నరాజాగారు ఈ భూసంస్కరణల విషయము సెలవిచ్చారు. ఎవ్వరికీ గూడ పది ఎకరాలు కూడ ఉంచకుండా చేయడము మంచిదే అని అన్నారు. అయితే యిదివరకు రోజులలో కళలకు యీనాములు యిచ్చారు. అవి తీసుకోవడము అధర్మమని గూడ సెలవిచ్చారు. నిజమే కాని యిప్పుడు యీ భూ సంస్కరణలు తేదలచుకున్నప్పుడు యీ పది ఎకరాలకన్న ఎక్కువ ఉంచకూడదు అని చెప్పడము కూడ ధర్మముకాదు. పోనీ, ఆ భూ సంస్కరణలతో బాటు, వీరి విషయములో గూడ భూ సంస్కరణలు చేయడము సమంజసముగా ఉంటుందేమోగాని, ప్రత్యేకం ఆ వర్గానికి తప్ప తక్కినవారికి పది ఎకరాలు ఉండకూడదు, అయిదు ఎకరాలు ఉండకూడదు దున్నేవాడికే భూమి యిచ్చివేద్దాము అంటున్నారు. దున్నేవాడికే భూమి అంటే, యిప్పుడు భూమి యిస్తామంటే, అందరము భూములను దున్నుకునేవారమే. అందరము భూమి దున్నుకోటానికి పోవలసిందే. ఎందుకంటే వేరే ఆధారము లేనివారు, భూములు దున్నుకోక వేరే ఏమిచేస్తారు? ఇదివరకు అంటే, ఏదో ఒక ఆధారము ఉంటే, ఆ ఆధారమునకు యింకొకటి ఆధారము చేసుకుని బ్రతకటము సంభవిస్తున్నది. గనక భూమిమీదనే ఆధారపడి ఉండేవారు ఎకరికి ఉన్న భూమిని వారు తప్పకుండా దున్నుకుని బ్రతకవలసిందే అంతకన్న తప్పేది యేమీలేదు. ఒక్క భూములే దున్నుకునేటట్లు అయితే, ఎవరికిగూడ విజ్ఞానము లేకుండా పోయే అవకాశము కలుగుతుంది. అందుచేత, విజ్ఞానము కొరకు, కళలకొరకు, యిదివరకు ఉన్న యీనాములు యిప్పుడు వెంటనే పరిష్కారము చేసేదానికంటే మినిస్టర్ల తాలూకు విజ్ఞానము, చిదానందము గూడ పంచిపెట్టే విధముగానే సంస్కరణలు తెస్తే బాగుంటుంది. అది అయిన నాడు సంస్కృతి కూడ బాగుపడిందని చెప్పవచ్చు. ఇప్పుడు ఉన్న జ్ఞానమువల్ల ఎవరికీ విజ్ఞానము కలుగడములేదు. అందువల్ల యిప్పుడు మంత్రులకు ఉన్న విజ్ఞానమును పంచితేగాని, అందరికి సమానంగా రాదేమోనని నేను భావిస్తున్నాను.

Sri P. NARASIMHAPPARAO :— అధ్యక్షా, ఈరోజున రెవిన్యూ మంత్రిగారు ప్రతిపాదించిన రెండు బిల్లులనూ గూడ నేను బలపరుస్తున్నాను. ముఖ్యంగా minor irrigation works ను గురించి కొద్దిగా మాట్లాడదలచుకున్నాను. బడ్జెటులో minor irrigation క్రింద 41,79,600 రూపాయలు కేటాయించారు. అంటే ఈ సొమ్ము అంతా గూడ మన రాష్ట్రములో ఉన్న పదకొండు జిల్లాలమీద పంచిపెట్టేటట్లుగా అర్థమగుచున్నది. ఇప్పుడు మన రాష్ట్రములోని ఎస్టేట్సు అన్నీ ప్రభుత్వము తీసుకున్న తరువాత యీ ఎస్టేట్సు తాలూకు గ్రామాలలోనే minor irrigation works క్రింద హెచ్చుగా ఖర్చుచేయవలసి వస్తుంది. ఎందుకంటే, ప్రభుత్వము ఎస్టేట్సు వగైరాలు స్వాధీనము చేసుకోకపూర్వము అందులో ఉన్న చెరువులు ఏ విధముగా మరమ్మతులు లేకుండా ఉన్నవో, అవి స్వాధీనము చేసుకున్నతరువాత గూడ అదే స్థితిలో ఉన్నవి. ఇదివరకు యీ ఎస్టేట్సు జమీందార్ల క్రింద ఉన్నప్పుడు, అందులో ఉన్నటువంటి చెరువులు వగైరాలకు మరమ్మతు చేస్తేనేగాని, వారు డబ్బు వసూలుకు వచ్చేవారు కాదు. కాని ప్రభుత్వమువారు వీటిని స్వాధీనము చేసుకున్నతరువాత యీ చెరువులకు అక్కడక్కడ ఏమైనా చిన్న గండ్లు పడితే, అవి ఏ కొద్దో గొప్పో మరమ్మతు చేయించడము కనబడుతున్నది కాని, యీ చెరువులు అన్నీ పూర్తిగా మరమ్మతు చేస్తున్నట్లు కన్పించదు. మా శ్రీకాకుళం జిల్లాలో వెల్లువవిషయము ఒకటి ఉన్నది. పైగా ఛాలా

భాగము అగ్రహారాలుకూడ ఉన్నవి. ఈ అగ్రహారాలు మరమ్మత్తుకూడ ఎవరూ చేయడము లేదు. వీటికి Rent Reduction Act apply చేస్తామనికూడ తీసుకొచ్చిపెట్టారు. చెరువులకు మరమ్మత్తులేదు సరికదా, యీ అగ్రహారములలోని భూములు ఎవరూ గూడ సాగుచేయకపోయినందువల్ల, ఆ భూములు అన్నీ బొత్తిగా బంజర్లు అయిపోయినవి. ఈ విధముగా బంజర్లు బీళ్ళు అయిపోయిన భూములలోనికి ప్రవేశించి మీరు దున్నుకోండి అని కొంతమందిని మన కమ్యూనిస్టు సోదరులు పంపుతున్నారు. ఏదో సామెత చెప్పినట్లు డబ్బులేనివాడు ముందు బోటు ఎక్కిన విధముగా యీ బంజర్లలో డబ్బు దుబ్బు లేకుండా ప్రవేశించటానికి తయారైనారు. ఈ అగ్రహారములలోని చెరువులకు బొత్తుగా మరమ్మతులు లేవు. భూములు చాలా భాగము పాడైపోయినవి. ఈ చెరువులు మరమ్మతు చేయించండి అని ప్రభుత్వాన్ని అడిగితే, డబ్బులేదు, డబ్బు ఎక్కడినుంచి తెస్తామంటారు అని మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు అంటున్నారు. రెండు లక్షల రూపాయలు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అయిదు సంవత్సరములబాటు ఖర్చుచేసేట్లుగా చెబుతున్నారు. ఈ రెండులక్షలు కూడా అయిదు సంవత్సరములవరకు ఖర్చుచేసే బదులు ఈ రెండులక్షలున్నూ ఒకేపర్యాయము ఒకే సంవత్సరములో యీ చెరువుల మరమ్మతుకుగాను ఖర్చుచేస్తే, యీ భూములన్నీ మరింత దిబ్బలువేసిపోకుండా బాగుపడుతాయి. ప్రజలు సాగుచేసుకోటానికి అవకాశము కల్గించినట్లు అవుతుంది. ఈ విధముగా చేయటానికి ప్రభుత్వము ప్రయత్నించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. ఇప్పుడు యీ బడ్జెటులో కేటాయించిన 41,79,600, రూపాయలు మన రాష్ట్రములో ఉన్న పదకొండు జిల్లాలమీద పంచితే, ఒక్కొక్క జిల్లాకు రెండు మూడు లక్షలకంటే ఎక్కువగా ఖర్చుచేయటానికి వీలు ఉండదు ఇంకను ఒక్కొక్క జిల్లాలో జాస్తిగానే ఖర్చు చేయవలసి ఉంటుందేమోనని నా అభిప్రాయము. ఈ సొమ్ములోనుంచి డిపార్టుమెంటువారే చాలాభాగము తినివేయడముకూడ జరుగుతుందనకోండి. వారు తినగా మిగిలినదే, జిల్లాలలో ఖర్చుచేయ వీలు అగుతున్నది. ఇప్పుడు మార్చినెల సగము జరిగింది. మార్చినెల 15 వ తేదీవరకూ allotment వారి చేతులలోనే పెట్టుకుంటారు. తరువాత మార్చి 28, 29 తేదీలు వచ్చేటప్పటికల్లా యీ allotment ఖర్చు చేయటానికి వీలులేకుండా పోతుందేమోనని డిపార్టుమెంటువారు 30, 31 తారీఖులలో ఒక్కరాత్రిగా అన్నికూడ ఖర్చుచేసినట్లు Check Measurement Books లోకి entries అన్నీ ఎక్కించివేయడము జరుగుతుంది. కాని అక్కడ చేసిన పనిమాత్రము ఏమీ కన్పించదు. ఈ విధముగా తొందరగా చేసే బదులు, సంవత్సరము మొదట్లో నుంచే, సంవత్సరము పొడుగునా యీ పనులు అన్నీ వరుసగా చేయించినట్లయితే చాలావరకు యీ పనులు ఎక్కడెక్కడ చేయించేది తెలిసిఉండేది. సక్రమంగా జరగటానికిగూడ వీలు అయ్యేది కాని మార్చి 15 వ తేదీకి ప్రభుత్వము గ్రాంటు యివ్వడము 28, 29 వ తేదీలకు డిపార్టుమెంటువారు ఒక్కసారిగా check-measurement books లోకి entries ఎక్కించడము జరిగేదానికంటే సంవత్సరము మొదటినుంచి యీ పనులు క్రమంగా జరిగేటట్లు చూడవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే డబ్బు దుబారా అవుతున్నది అనే విషయమును గురించి ఒక సంగతి మనవి చేయదలచాను. 3,61,200 రూపాయిలు యీ టపా బ్రాంచి, అంటే రెవిన్యూ బోర్డుకుగాను ప్రభుత్వం ఖర్చుచేస్తున్నారు ఈ సొమ్ము అంతా యీ post office క్రింద

ఖర్చుచేసే బదులు, అందులో పనులుచేసే staff ను, I. A S; I. C S. వారిని కర్నూలులోనే సెక్రటేరియట్ డిపార్టుమెంటులలో పనిచేయిస్తే, ప్రభుత్వానికి ఆదుబారా ఖర్చు ఉండదుగదా ! ఈ రెవిన్యూ బోర్డుక్రింద యింతసొమ్ము ఖర్చుచేసే బదులు, యీ సొమ్మును గ్రామాలలో ముఖ్యంగా అవసరమైన యీ minor irrigation works మీద ఖర్చుచేస్తే, ప్రజలకు ఎంతో ఉపయోగకరముగా ఉంటుంది. నిజానికి ఈ రెవిన్యూ బోర్డువారు చేసేపని యేమిటి ? సెక్రటేరియట్ నుంచి కలెక్టర్లకు వెళ్ళే కాగితాలు యీ రెవిన్యూబోర్డు వారిద్వారా పోతున్నవి. వీరు పంపిన కాగితము, వారు enter చేసుకుని, వారు కలెక్టరుకు పంపుతున్నారు. తిరిగి వారి రిమార్కులతో, రెవిన్యూ బోర్డుకు వచ్చి, రెవిన్యూ బోర్డునుంచి సెక్రటేరియట్ కు వస్తున్నవి. ఇక్కడనుంచి అక్కడకు అక్కడ నుంచి యిక్కడకు పేపర్సు బట్వాడా చేయటానికి, బట్వాడా బ్రాంచిగా ఉపయోగించడము తప్ప, మరేమి చేస్తున్నట్లు కన్పించదు. కాబట్టి కలెక్టరుకు, సెక్రటేరియటుకు మధ్య యీ post office ఎందుకు అని అడుగుతున్నాను. కాబట్టి యీ రెవిన్యూ బోర్డువారు యీ టపాలను despatch చేయకుండా, I C S వారిని I A. S వారిని అక్కడ పెట్టకుండా తప్పించటానికి ప్రయత్నించ వలసినదిగా మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత డబ్బు విషయము ఒకటి ఉన్నది. డబ్బు ఎలాగు రావడము ? అని మంత్రిగారు అన్నారు. మా శ్రీకాకుళం జిల్లాలో నాగావళి ప్రాజెక్టు కట్టేటప్పుడు, అప్పుడు ఆర్బత్నాట్ కంపెనీ ఉండేది. ఆ ప్రాంతము అంతా సర్వేకూడ అయింది. సర్వే అయిన తరువాత యీ నాగావళి ప్రాజెక్టుకుగాను తోటపల్లి వద్ద ఒక bridge కట్టటానికి నిర్ణయించారు. ఆ ప్రాంతము అప్పుడు విశాఖపట్టము జిల్లాక్రింద ఉండేది. ఆ తాలూకాలోని కొన్ని గ్రామాలకు resettlement అయింది. అప్పుడు గంజాము జిల్లాలో అవి ఉండేవి. కొన్ని గంజాము జిల్లాలోనికి, కొన్ని అప్పటి విశాఖపట్టణం జిల్లాలోనికి వచ్చినవి. ఆ జిల్లాకు యీ జిల్లాకు మధ్య సరిహద్దు గ్రామాలలో శిస్తు తేడాలు ఉంటున్నవి. అటువైపుగ్రామాలలోశిస్తు ఎకరానికి 8 రూపాయల చొప్పున, యిటువైపునగ్రామాలలో ఎకరము ఒకటింటికి 16 రూపాయలు ఉండేది. ఇప్పుడు ప్రభుత్వము చేయవలసినది యేమిటంటే, శ్రీకాకుళం జిల్లాలోని గ్రామాలు కొన్ని గంజాము జిల్లాలోనికి పోయినవి. విశాఖపట్టణము జిల్లాలోనివి విశాఖపట్టణము జిల్లాలోనే ఉండిపోయినవి. ఈ రెండు జిల్లాలలోనివి కలిపివేయండి. విశాఖపట్టణము జిల్లాలో Resettlement అయింది. శ్రీకాకుళం జిల్లాలో resettlement కాలేదు. అన్నిచోట్ల శిస్తు సమానంగా విధించటానికి మరల యీ జిల్లాలను resettlement చేశారంటే, శిస్తు మరింత ఎక్కువగా రావటానికి అవకాశము ఉంటుంది. మా శ్రీకాకుళం జిల్లాలో ఎస్టేట్సు, అగ్రహారాలు జాస్తిగా ఉన్నవి. 1923 వ సంవత్సరానికే బొబ్బిలి ఎస్టేటు అంతటాకూడ భూములురైతులకు అయియుండేవి. ఆ రోజులలో భూమిని సర్వే చేయకుండా ఒక్కొక భూమికి యింతఅని, మక్తాక్రింద ధాన్యము కొల్పించుకుని తీసుకుని వెళ్ళేవారు. ఆ తరువాత బొబ్బిలి రాజాకు రైతులకు తగాదాలుపడిన కారణముచేత, ఆ తగాదాలు పరిష్కారానికి వచ్చి, చివరకు ఎకరానికి 30 రూపాయల వంతున బొబ్బిలిరాజా తీసుకునేటట్లుగాఏర్పాటు చేసుకున్నారు. తరువాత ఆ ప్రకారంగా వసూలు చేసుకునేవారు. ఆ ఎస్టేటులో గరిశె ఒకటింటికి మూడు ఎకరాలుఅన్ని నామకః కాగితాలు వ్రాసుకున్నారు. కాని ఆఎస్టేటులో

(Sri P. Narasimhapparao) [14th March 1956

Survey Settlement అనేది ఎక్కడకూడ జరగలేదు. ఇటీవల రెండు ఎకరాలు ఉన్నా, మూడు ఎకరాలు ఉన్నా, మూడు ఎకరాల ప్రకారము శిస్తు లెక్కకట్టి వసూలు చేసుకునేవారు. గరిశలంటే మూడు ఎకరాలు అని oral గా ఉన్నది కాబట్టి అది రెండు ఎకరాలు ఉన్నప్పటికినీ ఎకరం ఒకటింటికి 30 రూపాయలు చొప్పున 3 యకరాలక్రింద 90 రూపాయలు కట్టుకోవలసి వస్తున్నది. అందువల్ల యీ ఎస్టేటు గ్రామాలలోమట్టుకు ప్రభుత్వం త్వరలో Survey చేయిస్తే, యింకా హెచ్చు డబ్బు శిస్తు రూపములో రావటానికి అవకాశము ఉన్నదని మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

Estate లు గవర్నమెంటు hand over చేసుకున్న తరువాత ఆ estate గ్రామాలలో ఉండే గ్రామ మునసబులు చాలా కష్ట పడుతున్నారు. వారికి జీతాలూ అవీ తక్కిన గవర్నమెంటు గ్రామాధికార్ల జీతాలతో సమానంగా చేస్తామని వాగ్దానం చేశారు గాని ఇంతవరకూ ఏమీ చర్యతీసుకోలేదు. తరవాత Land Reform గురించి గవర్నమెంటు వెంటనే శ్రద్ధ తీసుకోవాలి. జిరాయితీ రైతుల మాదిరిగా కాకుండా ఈనాం రైతులకు అన్యాయం చేశారు. ముందు ఈనాందార్లు నెత్తికొట్టారు. ఎందుకు ఈ అన్యాయం ? బిల్లు పెట్టినప్పుడు అందరకూ ఒకటేరకంగా వర్తించేలాగ బిల్లుపెట్టండి. జిరాయితీ దార్లకుకూడా బిల్లు పెట్టండి.

Mr. SPEAKER:—మీరు Select Committee లో ఉన్నారు. అందుకని ఆ విషయాలు చెప్పకండి.

Sri P. NARASIMHAPPA RAO :— జిరాయితీ బిల్లును గురించి చెబుతున్నాను. అందుచేత వెంటనే land reform bill పెట్టేసి అందరకూ సమానంగా న్యాయంగా ఉండేటట్లు ఐదు ఎకరాలో, పదెకరాలో 15, ఎకరాలో వారికుటుంబానికి సరిపోయేటట్లుగా ఉండునట్లు చేయవలసిందని కోరుతున్నాను. ఈనాము రైతులు చాలా బాధలు పడుతున్నారు. Estate abolition అని పెట్టినప్పుడు వాళ్ళకు ఇవ్వవలసిందేదో తొందరగా ఇచ్చేస్తే చాలామంచిది. ఇప్పుడు Select Committee లో బిల్లుందంటే దానివల్ల వాళ్ళకేమీ లాభం లేదు. Immediate గా Estate Abolition Bill వాళ్ళకు కూడా వర్తించేలాచేసి మీరిచ్చేదేదో కొద్దో గొప్పో Bonds మూలంగా ఇన్ని సంవత్సరాల వరకుమీద ఇచ్చేలాపెట్టి ఈ బిల్లుతో కూడా Estate Abolition Bill కూడా పెట్టవలసిందని కోరుతున్నాను.

Sri B V. SIVAIAH — అధ్యక్షా! ఈ Land Revenue Demand సందర్భంలో కొన్ని ముఖ్యమైన విషయాలు మంత్రిగారి దృష్టికి తీసుకు రాదలచాను. క్రిందటి సంవత్సరం ఈ Land Revenue Demand చర్చసందర్భంలో land revenue collections అప్పుడు జరుగుతూ యున్నటువంటి అన్యాయాలను మంత్రిగారి దృష్టికి తీసుకు రావడం జరిగింది. కాని ఆ విషయంలో ఇంత వఱకూ ఏమీ విచారణ జరగలేదు. ఈ Land Revenue collections లో నీకు ఇన్ని ఎకరాల భూమికి ఇంత demand అని చెప్పకుండానే భూమి శిస్తు నూరు రూపాయలు కట్టవలసిందని damand జారీ చేయడం, రైతు తెలుసుకునే అవకాశం లేకుండానే భూమిశిస్తు వసూలుచేసే విధానం పూర్వం అమలు జరుగుతూఉండేది. ఇటీవల ప్రభుత్వం

14th March 1956] (Sri B. V. Sivaiah)

వారు రైతుకు భూమి ఎంత ఉన్నదో, ఆ భూమికి ఎంత తీరువాయి జాస్తీ కట్టాలి, దానికి cess లు ఎంత అని వివరంగా తెలిసే ఒక రశీదు మళ్లలు ఒప్పుకుని issue చేశారు. గుంటూరు జిల్లాలో చాలా గ్రామాలలో రైతులు చాలామంది ఇటువంటి రశీదు కావాలి, మాకు భూమి ఎంతుందో, మేము కట్టవలసిన శిస్తు ఎంతో మేము తెలుసు కోవాలని అడుగుతున్నారు. క్రిందటి సంవత్సరం land revenue ఇంతవరకూ వసూలు చెయ్యకుండా ఉన్న సందర్భాలు చాలా ఉన్నాయి. ఈ రశీదుల విషయంలో ప్రభుత్వంవారు Revenue Board వారూ instructions ఇచ్చామని చెబుతున్నారే కాని గుంటూరుజిల్లాలో కలెక్టరుగారిని కాని తహశీల్దార్లను గాని అడిగినప్పుడు మాకీ 18 వ నెంబరు form లో land revenue రశీదులు ఇవ్వాలని మాకేమీ instructions లేవు, మేమివ్వవలసిన అగత్యం లేదని open గా చెబుతున్నారు. రైతులు వెళ్ళి మాకు భూమి ఎంత ఉందో చెప్పండి మేము శిస్తుకడతామని అంటే మీరు డబ్బు కడితేనే రశీదు ఇస్తాం అని చెప్పితే డబ్బుముందు చెల్లించినప్పటికీ రశీదులు ఇవ్వం అని పట్టుదలతో తాలూకా Revenue అధికార్లూ, Firka Revenue అధికార్లూ జిల్లా కలక్టర్ల పద్ధతుతో రైతులను చిక్కు పెడుతున్నారు. ఈ విషయాన్ని ముఖ్యంగా పరిశీలించ వలసినదని మంత్రిగారికి చాలాసార్లు చెప్పడం జరిగింది. ఈ విషయమై Revenue Board వారికి కూడా ఎన్నో representations పంపించాం. ఇంతవరకూ Revenue Board నుంచి ఒక సమాధానం కూడా రాలేదు. ఇంక పట్టా transfer ల విషయంలో భూములు విక్రయించినప్పుడు పట్టా transfer కొఱకై ఒక నిర్ణీతమైన fees ను Registrar Office లో వసూలు చేయడం జరుగుతోంది కాని ఒక పట్టా transfer కూడా land records లో enter చేసినట్లు కనబడదు. ఆ గ్రామంలోయున్న గ్రామాధికార్లు చచ్చిపోయినా లేక సెలవు పెట్టి పోయినా క్రొత్తవాడు వస్తే ఏ భూమికి ఎంత శిస్తని land records లో తెలుసుకోలేని అధ్వాన్నస్థితి ఏర్పడింది. పట్టా transfer కు fees వసూలు చేస్తూ కూడా అవి enter చేయక పోవడం చాలా శోచనీయం. Provisional demand అని ఒక form ఉన్నది. ఇందులో ఏ రైతు ఏ కిస్తీకి ఎంత శిస్తు చెల్లించాలనే విషయం తెలుపవలసి యున్నప్పటికీ ఆ ప్రకారం చెయ్యడంలేదు. ఈ Provisional demand formలు గ్రామాధికార్లకు విరివిగా సప్లయి చేయడంలేదు. గ్రామంలో ఏ రైతుకి ఎంత పొలం ఉన్నదీ కనుక్కునేందుకు Adangal అనే register ఉన్నది. హైదరాబాదు రాష్ట్రంలో కూడా ఈ Adangal register లో ఏ రైతుకు ఎంతభూమి ఉన్నదో తెలియ చేసేందుకు ప్రత్యేకం ఒక column కూడా పెట్టినారు. ఇప్పుడు Land Revenue సర్ఛార్జి విధించారు. ఈ Land Revenue సర్ఛార్జి విధించడానికి ఒక్కొక్క రైతు చెల్లించ వలసిన శిస్తు ఎంతో తెలుసుకుని దానిమీద 10 రూపాయిల లోపున రూపాయికి ఒక అణా, పదిపైన నూరు రూపాయిలలోపు ఐతే రూపాయికి బేడలు వసూలు చేస్తామంటున్నారు. ఇందుకొఱకు ప్రతి రైతుకీ ఎంత భూమి ఉన్నది అతడు చెల్లించే land cess, education cess లు కాకుండా land revenue మాత్రం ఎంత చెల్లించ వలసినది అనే వివరాలు సేకరించవలసిన అవసరం ఉన్నది. ఈ విధంగా demand తయారు చేయవలసిన అవసరం ఉంది. మనకు ఇచ్చిన సర్ఛార్జి demand notice లో మాత్రం ఈ particulars అన్నీ వివరంగా లేవు. ఈ విషయం

Revenue Board కు కూడా తెలియజేశాం. ఒక్కొక్క సర్వే నెంబరుకి ఒక్కొక్క రకమైన తీరువాయి జాస్తీ విధించినారు. ఇది భూమియొక్క సారవంతాన్ని బట్టి Resettlement కాలములో నిర్ణయించారు. ఒక్కొక్క పట్టాలో ఒకటికన్న ఎక్కువ survey నెంబర్లున్నప్పుడు, ఆ సర్వే నెంబర్లన్నిటికీ ఒకేవిధమైన సిస్తులేకుండా ఉంటూవున్నది. ఇంతభూమి, ఈ భూమికి ఇంత land revenue దానికి ఇంత సర్చార్జి అనే వివరాలు చెప్పకుండా వసూలు చేయడం చాలా అన్యాయం. ఈసర్చార్జి demand notice లో ఈ వివరాలన్నీ పొందుపరచాలని ప్రభుత్వం వారికి విన్నవిస్తున్నాను.

తరువాత ఇంకొక విషాదకరమైన విషయము ఏమంటె - రెవిన్యూ అధికారులు, గ్రామ మునసబు, కరణాలు సరియైన వివరములతో రశీదులు ఇవ్వడము లేదు. వారి మీద ఏవిధమైన చర్య తీసుకున్నా గ్రామాలలో గ్రామోద్యోగులుగా ఉండేవారు లేరంటున్నారు. ఇప్పుడున్న గ్రామాధికారులలో ఎక్కువమందికి village account తయారుచెయ్యడము తెలియదు. నిర్ణీతమైన fees నిర్ణయించి సంవత్సరానికి రెండు, మూడు నెలలు కేటాయించి విలేజ ఆఫీసర్లకు ట్రైనింగు పెట్టవలెను. 35, 40 అక్కౌంట్లు ఉన్నవి. శిక్షణ పొందినవారికి ఈ ఉద్యోగములు ఇస్తే బాగాఉంటుంది. రైతులకు మంచిచేస్తూ ప్రభుత్వానికి నిజమైన లెక్కలు వ్రాసేదానికి వీలు కలుగుతుందని మనవి చేస్తున్నాను.

గ్రామాధికారులతో ఒక చిక్కు ఉన్నది. గ్రామాల చుట్టూ ఉన్న భూములను నివేశన స్థలాలని వాడుకుంటున్నారు. దానికి ప్రతి రైతు 0-2-0, 0-4-0, 0-10-0, 0-12-0 శిస్తు చెల్లించవలసి ఉంటుంది. ఈ శిస్తు నిర్ణయించడం వసూలు చెయ్యడము చాలా చిక్కుగా ఉంది. అందువల్ల నివేశన స్థలాలకు ఈ శిస్తు మినహాయించవలెను. దబ్బు చాలా తగ్గుతుంది అని ప్రభుత్వము అన్నారు. ప్రభుత్వానికి లోటు వస్తుందంటే ఒక్కసారిగా ముందు రాబోయే 20 సంవత్సరాలకు చెల్లించవలసిన శిస్తు వసూలుచేసి పెర్మనెంటుగా శిస్తు రద్దుచెయ్యవచ్చును. దానిని గురించి బోర్డు స్టాండింగు ఆర్డరులు ఉన్నవి. ముందు రాబోయే సంవత్సరాల శిస్తు ఒకేసారి వసూలుచేస్తే ఈ అక్కౌంట్లును maintain చేయడములో ఉండే కష్టము తప్పుతుంది. అని మంత్రిగారికి తెలుపుచున్నాను.

గుంటూరు జిల్లా Land Revenue collections విషయములో రైతులను harass చేస్తున్నారు. తాసీల్దారు, కలక్టరు కూడా indifferent గా ఉన్నారు. అందువల్ల గ్రామాలలో కక్షలు బయలుదేరుచున్నవి. గ్రామాధికారుల మీద దండెత్తడం కూడా జరుగుచున్నది. ప్రభుత్వం యొక్క ఈ నిర్లక్ష్యాన్ని ఆసరగా తీసుకొంటున్నారు. పార్టీలు పెంచడానికి కూడా దారితీస్తున్నది. కాబట్టి గుంటూరులో ఈ Land Revenue receipts వెంటనే ఇవ్వాలని మంత్రిగారిని కోరుతూ నేను శలవుతీసుకుంటున్నాను.

**Sri N. RAMULU :**—అధ్యక్షా! గౌరవనీయులైన రివెన్యూ మంత్రిగారి డిమాండును బలపరుస్తూ కొన్ని సూచనలను చేస్తాను. జమీందార్ల కాలములో సరైన నీటి వసతి లేక పంటలు పండక అధికశిస్తు భారంతో రైతాంగం కృంగి కృశించి కష్టపడుతున్నారు అని ఈ శిస్తు తగ్గింపు చట్టాన్ని, జమీందారీ రద్దుచట్టాన్ని ప్రవేశపెట్టినామని

ఆనాడు చెప్పినాము. గాని నేడు దాని ఫలితము ఏమీ కన్పించలేదు. శిస్తు తగ్గించినా కూడా రైతులు సంతోషించరు. రైతులకు కావలసిన నీటి వసరులు ప్రభుత్వం ఏనాడైతే చేకూర్చుతుందో ఆనాడు రైతుకు కావలసిన పంట చేతికి వచ్చి రైతు బాగుపడుతాడు. కాని ముఖ్యమంత్రిగారు చెప్పుతూ 100 కి 70 మంది ఉన్న రైతాంగముమీద పన్ను వెయ్యకపోతే ఇంక ఎవరిమీద వెయ్యడము అన్నారు. రైతాంగముమీద పన్ను వెయ్య వద్దని మా అభిప్రాయం కాదు, కాని పన్నులు వేసేముందు రైతాంగమునకు కావలసిన నీటి వసర్లు తదితర సౌకర్యములు కలుగ చెయ్యవలెను. ఈ సౌకర్యములు కలుగ చెయ్యని నాడు పన్నులు వెయ్యడము అనుచితము అని చెప్పుతున్నాను.

మా శ్రీకాకుళం జిల్లా జమీందారీ ప్రాంతంలో ఇటువంటి నీటి వసర్ల సౌకర్యం ఇంతవరకు కలగలేదు. వాటిని Major, Minor స్కీములక్రింద విభజించి, 200 ఎకరాలకు తక్కువ ఆయకట్టు ఉంటే minor అని అంతకు పైనబడినవి మేజరు అంటూ Minor irrigation overseer, Food Production Department, Public Works అని కేటాయించారు. ఈ మైనరు ఇర్రిగేషను ఓవరుసీయరు ఎక్కడో ఉంటాడు. P. W D ఎక్కడో, Food Production ఎక్కడో ప్రజలకు తెలియదు. మంత్రుల పర్యటన సందర్భములో పిటీషన్లు ఇస్తే వారు ఆయా శాఖలకు పంపితే ఏది మేజరో, ఏది మైనరో తెలియక కాలయాపన జరుగుతూ ఉంది. గాని ఒకటికూడా బాగుపరచలేదు నా నియోజకవర్గంలో తాలూకా ఆఫీసు, Assistant Engineer, Estate Manager ఆఫీసులోను ఆ ప్రాంతాలలో చెరువుల విషయము చెప్పుతుంటే ఏది మేజరు, ఏది మైనరు తెలియక ఏ చెరువుకూడా బాగుచేయడములేదు. రైతులు పంటలు పండక విచారిస్తున్నారు.

అందుచేత ప్రత్యేకశ్రద్ధ తీసుకొనవలెనని నేను కోరుచున్నాను. జమీందారీ ప్రాంతములో చెరువులు బాగుచెయ్యడానికి Tank Restoration Sub Division, డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఏర్పాటుచేసినారు. కాని మేజరు మైనరు విభజనపద్ధతి సరిగా లేనందువల్ల ఎవరూకూడా ఏమీ చెయ్యలేకపోతున్నారు. ఈ Sub-division కు April వరకు గడువు ఉన్నది. పనులు ఏమీ చేయలేకపోయినారు కనుక ఈ Tank Restoration Sub-division ను మరొక సంవత్సరం ఈ జమీందారీ ప్రాంతములో ఉండేటట్లు చేయవలెనని కోరుచున్నాను. మేజరువాటికి కూడా ఎకరానికి 250 రూపాయలుకు లోపు estimates తయారుచేయించి దాని ప్రకారముగా ఖర్చుపెట్టవలెను. ఆ ప్రకారము ఖర్చుపెడితే ఒక ప్రాజక్టుక్రింద 10, 15 వేల ఎస్టిమేటు అయితే 250 రూపాయలు ఒక ఎకరానికి లెఖ్ఖవేస్తే ఎస్టిమేటు అమలుచెయ్యడానికి వీలులేకుండా పోతుంది. కాబట్టి 250 రూపాయలను 500 లుకు పెంచవలెను. Food Production Department తయారుచేసిన estimates మా ప్రాంతములో ప్రవేశ పెట్టడానికి వీలు ఉంటుంది.

మాది జమీందారీ ప్రాంతము కాబట్టి compensation గురించి చెబుతాను. శ్రీకాకుళం జిల్లా టెక్కలి తాలూకాలో మాణిక్య ప్రసాదు estate అని ఉన్నది. దానిని 1944 లో పర్లాకిమిడి జమీందారుగారు పది గ్రామాలు కొని ఈ మాణిక్య ప్రసాదు estate ఏర్పాటు చేశారు. ఇది ఏర్పడిన వెంటనే పర్లాకిమిడి జమీందారు

పూర్వపు శిస్తులు కాకుండా భాగపు శిస్తులు కట్టవలెనని ఒత్తిడి చేశారు. అక్కడ నగదు శిస్తు కడుతున్నారు. సౌభాగ్యమునకు ధాన్యపు శిస్తు, నగదు శిస్తు కిట్టలేము, ఇర్ల జమీందారు వారికి వివిధమయిన శిస్తులు కడుతూ ఉన్నారో అదే కడతామన్నారు 1, 2 సంవత్సరములు శిస్తులు కట్టలేదు తరువాత Rent Reduction Act ప్రకారము అక్కడ నగదు శిస్తులు ఉన్నవి అవి కట్టవలెనని 1950 లో ఆ అక్టుక్రింద notification ఇచ్చేరు. వెంటనే జమీందారు హైకోర్టుకు వెళ్ళేరు దానిని dismiss చేస్తూ శిస్తు తగ్గింపు ఆక్టు ప్రకారంగా అమలుజరుపవలెనని సూచన ఇచ్చారు మరల కలక్టరు గారు Rent Reduction ప్రకారము శిస్తులు నిర్ణయం పరిశీలించుటకు ప్రత్యేక సిబ్బంది వేసి తర్లా ప్రాంతములో నగదు శిస్తు రూపములోనే ఉండవలెనని నిర్ణయించుతూ మరొక notification ఇచ్చేరు. తరువాత మాణిక్యప్రసాద estate ప్రభుత్వంచే స్వాధీనము చేసుకోబడింది. జమీందార్లకు 7, 8 ఫసలీలకు శిస్తులు బకాయిపడ్డారు. ప్రభుత్వమువారు ఈ బకాయి శిస్తులను వసూలు చేస్తున్నారు.

మరల యీనాడు జమీందారుగారు ప్రభుత్వానికి ఒక suit notice యిచ్చారని తెలిసింది. ఆ suit notice ను ఒక గవర్నమెంటు ప్లీడరుగారు ఆధారము చేసుకుని, మరల భాగసిస్తమే యీ ఎస్టేట్లకు వర్తిస్తుందని వారి అభిప్రాయము తెలియజేయబట్టి, రెవిన్యూ బోర్డువారు మరల యీ భాగసిస్తము రూపములోనే notification చేయాలని ఉత్తరువులు జారీచేసినట్లుగా తెలిసింది. దానివల్ల రైతాంగానికి అనేక యిక్కట్లు కలుగుతున్నవి. ఎందుకంటె పూర్వము ఉన్న నగదు సిస్తము రూపముగా ఒక్కొక్క ఎకరానికి 3 రూపాయలు, నాలుగు రూపాయలు అయినది. ఇప్పుడు యీ భాగ సిస్తము రూపములో నగదులో నిరూపింపబడిన 7 రూపాయలు 6 రూపాయలు ఒక్కొక్క ఎకరానికి పడుతున్నందువల్ల, అదనముగా ఒక్కొక్క ఎకరానికి రు 3-0-0లు, రు. 4-0-0లు హెచ్చుగా చెల్లించవలసి వస్తున్నది ఆ లెక్క ప్రకారము పది ఫసలీలకు చేరి 10×3 రూపాయలో, 10×4 రూపాయలో, ఒక్కొక ఎకరానికి యీ పది ఫసలీలకు 30, 40 రూపాయలు హెచ్చుగా రైతాంగము చెల్లించవలసి వస్తున్నది రైతాంగము శిస్తులు పూర్తిగా చెల్లిస్తూంటేనే, యింకా బకాయిలు ఉండడమువల్ల, వారు మరల అదనముగా శిస్తు చెల్లించాలని అడిగినట్లైతే, అప్పుడు అది చాలా శోచనీయముగా ఉంటుంది. మరల యీ శిస్తు ఎక్కువ చేయడంవల్ల, జమీందార్లకు ప్రభుత్వం యిచ్చే నష్టపరిహారము కూడ దామాషాగా హెచ్చు చెల్లించవలసి వస్తుంది. వారుగూడ హెచ్చు కోరడమునకు అవకాశము కలిగించినట్లవుతుంది. ప్రభుత్వము యీ విషయము గమనించాలని అంటున్నాను. ఈ విషయాన్ని గురించి మన రెవిన్యూశాఖామాత్యులవద్ద ఒక మెమొరాండమునుగూడ దాఖలు చేయడమయింది. తరువాత ఈవిషయము యావత్తున్నూ గౌరవనీయులైన లచ్చన్నగారికి, గౌరవనీయులైన కళా వెంకట్రావుగారికి చెప్పి, యీ నగదు సిస్తము ప్రకారంగా చెల్లించే ఒక పట్టానుగూడ దాఖలుచేసి ఉన్నాము. యిది యిప్పటికే తీవ్రరూపము దాల్చింది. కాబట్టి ప్రభుత్వమువారు వెంటనే తగు శ్రద్ధవహించి, ఆ ప్రాంతపు రైతులకు ఎటువంటి అన్యాయము జరగకుండా చేయాలని కోరుతూ, అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందులకు వారికి నా కృతజ్ఞతాభి వందనములు అర్పిస్తున్నాను.

14th March 1956]

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా! ఈ డిమాండు మీద మాట్లాడిన సభ్యులందరు మన రాష్ట్రంలో ఏర్పడిన అసంతృప్తిని వెలిబుచ్చుతూ వచ్చారు. అక్కడ శ్రీకాకుళం జిల్లా మొదలుకుని యిక్కడ ఆదోని వరకూ, అన్ని ప్రాంతాలనుంచి ఎన్నికైన శాసన సభ్యులందరూ వారివారి నియోజక వర్గములలో ఉన్న ప్రజలలో ఏర్పడిన అసంతృప్తిని పూర్తిగా యీ సభలో తెలియ జేశారు. మంత్రిగారు కూడ దీనిని గుర్తించారని అనుకుంటున్నాను. మాట్లాడినవారిలో ముఖ్యంగా తిమ్మారెడ్డిగారు రాష్ట్రంలో యీనాడు ఉన్న పరిస్థితులు యావత్తూ ప్రతి బింబింపజేస్తూ ఉపన్యాసము యిచ్చారు. వారు తెలియజేసిన విషయాలన్నింటితోనూ మేము వారితో ఏకీభవించక పోవచ్చుగాని, ప్రధానంగా యీ దేశములో ఉన్న ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థ, అంటే Government administration స్థంభించి పోయింది, అది కదలకముంది, శాసన సభ్యులు చెప్పినప్పటికినీ వినదు, మంత్రులకు చెప్పినా వినదు, ఎవరు చెప్పినా వినని పరిస్థితులలో యీ రోజున administration ఉన్నదని వారు గట్టిగా చెప్పారు ఈ విషయములో మేము పూర్తిగా ఏకీభవిస్తున్నాము. అందుకే మేము గూడ మొదటినుంచి ప్రభుత్వానికి, మంత్రివర్గానికి చెబుతూనే వస్తు న్నాము. ఈ administrative set-up పూర్తిగా మార్చితేగాని మనయొక్క అభి వృద్ధి ప్రణాళికలు ఏవీ గూడ మనము సక్రమంగా నెరవేర్చుకోలేము, అని చెబుతూ వున్నాము. ముందు యీ రెవిన్యూబోర్డును రద్దుచేయండి అని చెప్పాము. కాని యింత వరకు మంత్రివర్గము దానిసంగతి పట్టించుకోలేదు. అది ఎప్పటిమాదిరిగానే ఉన్నది. ఆనాడు బ్రిటిషువారు, వారియొక్క స్వప్రయోజనాల కోసము యీ బోర్డును నిర్మించి యున్నారు. వారు వెళ్ళిన తరువాత గూడ దీన్ని యిదివరకు మాదిరిగానే మనము ఉపయో గించుకోవచ్చు అని అనుకోవడము చాలా పొరబాటు. దేశంయొక్క అభివృద్ధికోసము యీ యంత్రాంగాన్ని ఉపయోగించడము ఎంత కష్టసాధ్యమో తిమ్మారెడ్డిగారి ఉపన్యాసమువల్ల తేలింది. వారు చెప్పిన విషయాలన్నీ మనకు పూర్తిగా బోధపడ్డవి. ప్రభుత్వ పరిపాలనా విధానము 1948 వ సంవత్సరమునుంచి చూడండి, అప్పటి నుంచి పరిశీలించి చూస్తే, ప్రభుత్వానికి వచ్చే Land revenue లోనూ, Land Reforms లోనూ ఏదైనా అభివృద్ధి, మార్పు కనబడుతున్నదాఅంటే, అది ఏ విధము గానూ కన్పించదు. రైతులకుగాని, ప్రజలకుగాని ఉపయోగించే శాసనాలు ఏవైనా ఉన్నవేమో చూడండి. ప్రభుత్వము Estates Abolition Act అని ఒకటి తీసుకొని వచ్చారు. ఆ రోజున శాసనసభలో నేనుగూడ మెంబరుగా ఉన్నాను. నేను అప్పుడే దాని విషయము చెప్పాను. ఈ యాక్టు లోపభూయిష్టమైన యాక్టు. దీనివల్ల పేదవాళ్ళకు లాభము వుండదు. ఇది పెద్దపెద్ద జమీందార్లకు లాభించేది అని చెప్పాను. తిమ్మారెడ్డిగారు చెప్పినట్లు చిన్న చిన్న జమీందార్ల జోలికి నేను పోవడములేదు. చిన్న జమీందార్లంటే నన్ను పొరబాటుగా అర్థము చేసుకుంటారేమో గాని; యీ చిన్న జమీందార్లకూడ పెద్ద జమీందార్లపేర వ్యవహరిస్తున్నారు. అది వారి దురదృష్టము, అంతేకాని పెద్దపెద్ద జమీం దార్లకు యీ Estates Abolition Act ఎక్కువ లాభము కలుగజేస్తున్నదని అది వెంటనే సవరించాల్సి ఉన్నది అని అనేకసార్లు చెప్పాను. ఇదికాక యీ ఎస్టేట్సు విష యము వచ్చినప్పుడల్లా, యీ యాక్టును సవరించండి అని కోరుతూ వస్తున్నాను. కాని మంత్రివర్గము చెవులలోగాని, ప్రభుత్వము చెవులలోగాని నా మాటలు దూరకుండా

(Sri Pillalamarri Venkateswarlu) [14th March 1956

ఉన్నాని. అందులో 12 వ సెక్షను చూడండి. ఈ సెక్షనుద్వారా వాళ్ళకు ఎంతో మేలు కలుగుతున్నది. మా కృష్ణాజిల్లాలో ఉండే జమీందార్లకు వేలకొద్ది ఎకరాలు కట్టిపెట్టడము జరుగుచున్నది. ఆ సెక్షను మార్చండి అని మంత్రిగారికి ఎన్నిసార్లు చెప్పినా, అది వారు వినిపించుకోరే ! ఆ సెక్షనులో "Personal Cultivation" అనే మాటలు ఉన్నవి. వనకు వచ్చే చిక్కు జమీందార్లకు కలిగే లాభము యిందులోనే ఉన్నది. Personal cultivation అని పేరు పెట్టుకొని వేలకొద్ది ఎకరాలు Personal cultivation లో ఉన్నట్లు చూపించి జమీందార్లకు కట్టిపెట్టింది యీ ప్రభుత్వము. ఈ సెక్షను, వారిని ఎంతో protect చేస్తున్నది. నిజానికి ఏ జమీందారు అయినా ఎప్పుడైనా personal గా cultivate చేశారా ? Personal cultivation అని చెప్పి ప్రభుత్వాన్ని, ప్రజలను మోసముచేస్తున్నారు. పోనీ ప్రభుత్వము మట్టుకు యీ విషయము దర్యాప్తుచేసిందాంటే యేమీ చేయలేదు. ఈ Second five year plan ను గురించి వచ్చిన రిపోర్టులో personal cultivation అంటే, actual గా పొలములో labour చేయవలసిన అవసరాన్ని గురించి చెప్పబడి యున్నదో దాన్ని గురించి మన మంత్రివర్గము ఏమైనా ఆలోచించిందా ? ఆ సెక్షనును ప్రభుత్వము మార్చబోతున్నదా ? లేకపోతే యీ జమీందార్లకు వేలకొలది ఎకరాలు కట్టిపెట్టి, Sugar factories, వగైరాలు పెట్టుకొని, దానిక్రింద యీ భూమిఅంతా చేర్చి, తరువాత Land Reforms వచ్చినప్పుడు వాటికిగాను ఒక్క ఎకరమైనా మిగలకుండా తప్పించుకోటానికి చేసే ప్రయత్నాలు అని ప్రభుత్వము గుర్తించిందాంటే, అదేమి గుర్తించినట్లు కన్పించదు.

అంతేకాదు ఈ Estates Abolition Act లోనే మరొక విషయం ఉన్నది. జమీందార్లకు ఉన్నటువంటి buildings ను ప్రభుత్వము స్వాధీనముచేసుకోనేవిషయము ఈ సంగతి Sec. 18 లో ఉన్నది. ఈ సెక్షనులో ఒక peculiarity ఉన్నది. ఈ buildings ను office purposes కు గాను యిచ్చిఉంటే అవి ప్రభుత్వముస్వాధీనము అవుతాయి అని ఉన్నది గోపాలరెడ్డిగారు ఒకసారి ఏమి చెప్పారంటే, జమీందారీలు abolish అయిన తరువాత ఒక్క building కూడ ప్రభుత్వము స్వాధీన పరుచుకో లేదని అన్నారు. 1948 వ సంవత్సరములో యీ యాక్టు ప్యాసు అయింది అది వచ్చి యిప్పటికి సుమారు ఎనిమిది సంవత్సరాలు కావచ్చింది. ఇంత వరకూ ఒక్క building గూడ స్వాధీనము కాలేదు. అంటే యీ యాక్టులో ఒక defect ఉన్నది. అందులో ఉన్నది యేమిటంటే "If it is only for personal use and for no other purpose" అని ఉన్నది దీన్ని అడ్డము వేసుకుని ఆ building లో ఒక పొయ్యిగాని, నాలుగు కట్టెలుగాని లేకపోతే నాలుగు యిటుకరాళ్లో ఆ building లో పెట్టిఉంటే యిక అది యితర purposes కు ఉపయోగిస్తున్నారు కాబట్టి దాన్ని స్వాధీనము చేసుకోటానికివీలులేదుఅని ఈవిధముగాజమీందార్లుఅందరు ఎక్కడకట్టిన బంగళాలు అక్కడ ప్రభుత్వానికి స్వాధీనముచేయకుండాఉండేఅవకాశము ప్రభుత్వము కలుగజేసింది. కాబట్టి యీ buildings అన్ని యీ విధముగా స్వాధీన పరచుకోటానికి వీలులేకుండా పోతోంది. ఇప్పటికైనా ఆ సెక్షనును మార్చారాంటే అదీ చేయలేదు. ఈ సెక్షను ప్రభుత్వము మార్చలేదు అని మాకు తెలుసు. ఇది గాక తిమ్మారెడ్డిగారు యింకొక విషయము చెప్పారు, ఈ జమీందార్లు అందరూ ఒకటైతే యీ మంత్రివర్గాన్ని, ప్రభు

త్వాన్ని ఏదైనా చేయగలరు. వారు తలచుకుంటే యీ మంత్రివర్గానికి ఏ క్షణంలో నైనా స్వస్తి చెప్పగలరు అని చెప్పారు. ఈ సంగతే మరల ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. జమీందార్లకు ఉన్న ప్రభావము యీ కాంగ్రెసు ప్రభుత్వము పైన ప్రతినిమిషము గూడ ప్రతిబింబిస్తున్నది. ఆ ప్రభావము ఏమిటో బైట పడితేగాని యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరిగేది, లేనిది తెలియదు ఈ రోజున Planning Commission వారు తల పెట్టిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఉండే Land Reforms ఏవి గూడ అమలు జరగవు Socialist సమాజము, Socialist సమాజము అని పొద్దున నుంచి, సాయంకాలము దాకా మన వెంకట్రాజుగారు చెబుతూనే ఉంటారు. కాని ఫలితము ఏది ? ఇప్పుడు మన జమీందార్లు, పెద్ద పెద్ద భూస్వాములు చేరిన కాంగ్రెసుపార్టీ యీ ప్రణాళికను ఏవిధంగా అమలు జరుప గలుగుతుంది ? ఈ పార్టీవారు వారియొక్క ప్రభావములోనుంచి బైటపడ టానికి ప్రయత్నము చేస్తున్నారా ? Land Reforms తీసుకు వస్తారని మేము ఎంతో కాలముగా ఎదురు చూస్తున్నాము. ఎన్నాళ్ళు చూచినా రావడము లేదు. మీ కాంగ్రెసు పార్టీ యీ Land Reforms విషయమై గోపాలరెడ్డిగారిచేత లెక్కలు అయిన చెప్పించగలిగిందా ? చెప్పించలేదేమి ? ఎందువల్ల ? ఈ ప్లానింగు కమిషనువారి రిపోర్టు లోనే యీ Land Reforms ను ఖచ్చితముగా తీసుకువచ్చి పెట్టితేగాని లాభము లేదని ఖచితముగ వ్రాశారు. గోపాలరెడ్డిగారి వాదన ఏమిటి ? వారి Cabinet యొక్క వాదన ఏమిటి ? ఇప్పుడు Land Reforms తెస్తే, రాష్ట్రములో నాలుగు లక్షల ఎకరాలుమాత్రమే మిగులుతుంది, దీనివల్ల ప్రజలలో అసంతృప్తి తప్ప, వచ్చే ప్రయోజనము యేమీ కన్పించడంలేదు అని అన్నారు. Land Reforms వల్ల భూముల విషయములో ఉండే హెచ్చు తగ్గులు సరిజేసుకోవచ్చు, దానికి తగిన మార్పులుగూడ చేసుకోవచ్చు అని అన్నారు. ప్రభుత్వము కోరేటటువంటి Socialistic Pattern of Society నిర్వహించటానికి, దాని అవసరాన్ని గురించి నొక్కి చెప్పడము జరిగింది. ఈ విషయము Planning Commission వారు ఎందువల్ల గుర్తించారు ? Land Reforms తీసుకునివస్తున్నామని యీనాటికీ గూడ ఒక్క మాట అయినా చెప్పారా ? ఈ ఎసెంబ్లీ dissolve అయిపోయి మనము విశాలాంధ్రకు వెళ్లేలోపల Land Reforms తీసుకునివస్తారో, లేదో చెప్పండి అని మంత్రి గారిని అడుగుతున్నాను. ఇంకొక విషయము చెప్పవలసి ఉన్నది. ప్రభుత్వం Land Reforms Committee ని వేశారు. ఆ కమిటీవారు రాష్ట్రము అంతా తిరిగి ప్రజల అభిప్రాయము తెలుసుకుని పోయిన అక్టోబరునాటికి ఒక రిపోర్టును submit చేశారు. మంత్రివర్గాన్ని దాని సంగతి ఏమిటి అని అడిగితే, అది పరిశీలనలో ఉన్నది అని అన్నారు. ఇప్పటివరకు దాని సంగతి ఏమి అయిందో చెప్పరు. పరిశీలన అయినదా, లేదా ? ఆ రిపోర్టులో ఏమిఉన్నది ? దానిమీద మంత్రివర్గము ఏమినిర్ణయానికి వచ్చింది ? దాన్ని ఏమిచేశారు ? ఈ రోజున ప్రధానంగా మనలను యీ సమస్య ఎదుర్కొం టున్నప్పటికినీ, ప్రభుత్వము ఆ సమస్యను పెడత్రోవను పట్టించి, దాని విషయము అసలు యేమీ చేయకుండా, వచ్చే జులైలోనో, ఎప్పుడో వారికి యిష్టము వచ్చినప్పుడు Land Reforms తెస్తారట. ఈనాడు ఆంధ్ర దేశములో యీ సమస్య ఎదుర్కొం టున్నది. ప్రజలయొక్క మనస్సు అంతా యీ land మీద concentrate అయి

యున్నదని ప్రభుత్వము గుర్తించడము లేదా ? రాష్ట్రంలోని భూమి అంతా కొద్దిమంది చేతులలో నిలచిపోయిందే, ఎంత మంది చేతులలో వున్నది. ఒక్కొక్కరికి ఎంత వస్తుంది అనేది కాదు సమస్య. అసలు వున్నటువంటి హెచ్చు తగ్గులు సరిజేసుకోటానికి యితరచోట్లలో వున్నట్లు సంవత్సరానికి 3,600 ల రూపాయల కన్న మించి ఆదాయము వచ్చేచోట. అంతకు మించివున్న భూమి ఎవరికి లేకుండా చేసే పద్ధతి ప్రభుత్వము ఏమైనా ఆలోచిస్తున్నదా, లేదా, అని ప్రశ్నిస్తున్నాను. దీనికి ముందు మంత్రివర్గము నుంచి సమాధానము కావాలి. మేము మంత్రిగారిని కోరేదల్లా ఏమిటంటే, వారి వుపన్యాసాలలో చెప్పినా, చెప్పకపోయినా, యీ ఎసెంబ్లీ రద్దుఅయి, మనకు విశాలాంధ్రకు పోయేలోగా land holdings కు maximum, minimum fix చేస్తూ Land Reforms తీసుకుని వస్తారా, రారా? అని నేను ప్రశ్నిస్తున్నాను, దీనికి ప్రభుత్వం యేమి సమాధానము చెబుతుంది. అప్పారావుగారికి నాకు ఎప్పుడూ కూడ ముక్క ఎవరే ? ఆయనగూడ ప్రభుత్వాన్ని అడిగినారే ? సమగ్రమైన Land Reforms Bill ను తీసుకుని రమ్మని, వారేకాదు, యింకా యితరసభ్యులు కూడా అడుగుతున్నారే. ఇంతమంది అడుగుతూంటే ప్రభుత్వము ఎందుకు సమాధానము చెప్పదు ? లేదా, మీ వెనుకనున్న జమీందార్లు, పెద్ద భూస్వాములు యీ Land Reforms సంగతి ఎత్తుకోవద్దని చెబితే, మీరు ఊరుకోవడమేనా ? ఇదంతా ఏర్పాటు చేసుకునేది, నిశ్చయించుకునేది, మీలోమీరేనా ? ఇది ప్రజలకు సంబంధించిన విషయము కాబట్టి యిది అందరికీ తెలియజేయాలనే ! ఆవిధంగా చేయకుండా మీలోమీరు ఏ నలుగురో, Cabinet లో కూర్చుని decide చేసుకుంటే చాలుననుకున్నారా ? ఇదేనా ప్రభుత్వముయొక్క పాలసీ ? లేకపోతే యీరోజున కాంగ్రెసు సభ్యులు, పార్లమెంటరీ బోర్డు, ప్రధానమంత్రి, ప్లానింగు కమిషను యింతమంది చెప్పినప్పటికినీ యీ Land Reforms ను తీసుకునిరాలేక పోతున్నారే ఆనాడు కేంద్ర ప్రభుత్వములో వున్న Food Minister వచ్చినప్పుడు Land Reforms తెస్తామని చెబుతున్నప్పుడు, యీ Cabinet లో చేసేవి అన్నీ ఆయన చూచినట్లయితే, యిక్కడ సభలో జరిగేవి ఆయన విన్నట్లయితే, పాపము ! ఆయనకు గూడ యీ Land Reforms త్వరలో వస్తాయనే ధైర్యము గూడ ఉండి వుండదు. Land Reforms సమస్య దేశములో ఎంతో తీవ్రముగా ఉన్నప్పుడు మంత్రివర్గము యీ విషయము చాలా serious గా ఆలోచించి వెంటనే, మనము విశాలాంధ్రకుపోయేలోపుగా బిల్లు తీసుకుని రమ్మని మంత్రివర్గానికి విజ్ఞప్తి చేస్తున్నాను.

తరువాత విషయం బంజరు భూములకూ, లంక భూములకూ సంబంధించిన సమస్య ఉన్నది. ఇది ఒక పెద్ద పెనుభూతంలాగ మన మంత్రి వర్గాన్ని వెంటాడుతోంది. ప్రభుత్వంయొక్క report లనుబట్టి దాదాపు 13 లక్షలఎకరాలు బంజరుభూమిగా ఉన్నదని తెలుస్తోంది. ఇందాక మంత్రివర్యులు ఉపన్యాసంలో ఒక విషయం చదివారు. ఇప్పటికి లక్ష ఎకరాలు మాత్రం 33100 మందికి ఇవ్వగలిగారట. ఇంకా 8600 ఎకరాలు 1500 మంది రాజకీయ ఖైదీలకు ఇవ్వగలిగారట. ఈ రెండింటికీ వ్యత్యాసం సమాచారం అల్లా ఉంచి మొత్తం ఇచ్చింది ఎంత అనే విషయం తీసుకుంటే 101500 ఎకరాలు మాత్రము ఇచ్చారు. ఇంకా 13 లక్షల ఎకరాలు మిగిలిఉంది. ఇది ఎందుచేత ఇవ్వరు ? ఏమిటి

... ? Department వారు ఏమి చెబుతున్నారంటే నందికొండ ప్రాజెక్టు రాబో

తున్నది కనుక Project affected areas క్రింద దాన్ని ఇవ్వడానికి వీలులేదు. అల్లాగే తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఇవ్వడానికి వీలులేదు. ఇంకెక్కడో చిన్న ప్రాజెక్టు కట్టబోతూ ఉన్నాం కనుక అక్కడకూడా ఇవ్వడానికి వీల్లేదంటారు. ఇవ్వగలిగింది ఏమిటి ? ఎక్కడ ? ఈ భూములన్నింటిని మీరు ఇచ్చారనుకోండి వాటికి కొన్ని అభ్యంతరాలు మీరు చెబుతున్నప్పుడు, temporary పట్టాలే ఇచ్చి వాళ్ళను temporary గా సాగుచేసుకోనివ్వండి. మళ్ళీ మీకు కావలిస్తే తీసుకోడానికి వీలుంటుంది కదా ? ఆ పని ఎందువల్ల చెయ్యరు ? ఏదో ప్రాజెక్టు కట్టబోతున్నాం కనుక ఆ బంజరు భూములు పంచడానికి వీలులేదని చెప్పడం ఏ విధంగానూ సబబుగా లేదని మాత్రం చెబుతున్నాను. దీనివల్ల దుష్ఫలితాలుకూడా చాలా వస్తాయి. ఈ రోజు ప్రజానీకం మేము కష్టపడి పనిచేస్తాం, దున్ని పంట పండిస్తాం, మనరాష్ట్ర ఆదాయం పెంచుతామని ఖచ్చితంగా చెప్పి వాళ్ళుముందుకు వస్తూంటే వాళ్ళని నిరుత్సాహ పరుస్తున్నారు. పోని ఎక్కడైనా సాగుచేస్తే, దానిమీద విపరీతమైన penalty లు వేస్తున్నారు. అక్కడున్న తహశీల్దార్లు ఇరవైరెట్లు penalty లు కూడా వేస్తున్నారు అంతకన్న తక్కువ ఎప్పుడూ వెయ్యరు ఆ మహానుభావులు. దాన్నే Sub-Collector ఆమోదిస్తారు. కలక్టరుకూడా ఖాయపరుస్తారు. అప్పుడు మేము Revenue Board దగ్గరకో లేక Secretariat కో, లేక ఏ మంత్రి గారిదగ్గరకో పరుగెత్తుతూ ఉండాలి. ఎన్ని ఇబ్బందులకు ప్రజానీకం గురిఅవుతోందో ఆలోచించమని కోరుతున్నాను. ఈ 20 రెట్లు penalty ఎందుకు విధించాలి. అక్కడున్న భూమి సాగుచేస్తున్నారు. దానిలో మీరేమైనా బ్రహ్మాండంగా tar road లు వెయ్యబోతున్నారా ఆ గ్రామాలలో ? అక్కడుండేటువంటి ప్రజలెవ్వరికీ అభ్యంతరం లేనప్పుడు సర్దుకుపోవడానికి వీలున్నప్పుడు వాళ్ళని అందులో చాకిరిచేసుకుని తిని ఎందుకు బ్రతకనివ్వరు ? మీరు ఎన్ని పంచవర్ష ప్రణాళికలు వేసినా వారికి తిండి పెట్టేటటువంటి పరిస్థితిలో లేరు. మీరు వాళ్ళకి ఇళ్లుకట్టించి ఇచ్చే పరిస్థితిలో లేరు. వాళ్లు కష్టపడి బ్రతుకుతామంటే వాళ్ళని ఆ విధంగా బ్రతకనియ్యకుండా కూడా అడ్డుపడుతున్నారే ! ఈ బీదవాళ్లు ఎక్కడైనా ఒకచోట పెద్ద ఇళ్ళు కాకపోయినా గుడిసెలు వేసుకుంటారు. అక్కడకు Revenue ఉద్యోగస్థులు ఏ కలక్టరో, Sub-Collector వెళ్ళడం ఆ ఇళ్లు పీకివేయించమని order ఇవ్వడం జరుగుతోంది ఉదాహరణకు చెబుతున్నాను. పొన్నూరు దగ్గర చింతలపూడి అనేటువంటి గ్రామం ఉంది. అక్కడ నెహ్రూనగర్ అనే పేరుతో 20 కుటుంబాలవారు ఇళ్లు కట్టుకుని నివసిస్తున్నారు. ఎన్నికలలో వాళ్ళందరూ కాంగ్రెస్‌కే వోటుచేశారు. ఏ తహశీల్దారుగారో అక్కడకు వెళ్ళి అవన్నీ కూలగొట్టించి పీకేశారు. నందిగామ తాలూకాలో అనేకచోట్ల ఇళ్ళు కట్టుకున్నారు. ఎక్కడో చెరువుగట్టున కట్టారుట. ఒకవేళ కట్టారనుకోండి. ఆ చెరువుకేమీ ఆపత్తురాలేదే! అనేక సంవత్సరాలనుంచి ఆ చెరువు అక్కడే వుంది. ఇప్పుడు కూడా అట్లాగే ఉంటుంది. ఏమి కొంప మునిగిందని ఆ గుడిసెలు పీకివేయవలసివచ్చింది ? ఒక గవర్నమెంటు ఉద్యోగి అక్కడ ఎజారు ఆక్రమించుకుని గోడ పెట్టుకుంటే ఆ కలక్టరుగారికి ఏమీ అభ్యంతరం లేదు. సాహెబుగారు అప్పుడు Collector గా ఉన్నారు. ఆయన చాలా సంతోషించారు. కాని ఒక కిళ్ళీకొట్టు, చిన్న Coffee Hotel ఆ ప్రక్కనే పెట్టుకున్నందుకు అవి మాత్రం ఉంచకూడదు పీకివెయ్యాలి అని అన్నారు. ఆయన వచ్చేటప్పటికి అవి

nuisance గా అగపడ్తాయి. నందిగామలో అక్కడేమన్నా tar road వేయబోతున్నారా? ప్రభుత్వంయొక్క పరిపాలనాపద్ధతిలో ఉండే న్యాయానికి ఇదొక దృష్టాంతము. ఇలాంటి దృష్టాంతరములు ఎన్నో తీసుకువచ్చి చూపగలను. మీ Revenue Board Standing orders రీత్యా ఇవన్నీ అభ్యంతరకరమే. అందులో నాకేమీ అనుమానం లేదు. మేము చెప్పుకోడానికి Secretariat కు వెళ్ళినా Revenue Board office కు పోయినా collector ల దగ్గరకువెళ్ళినా Board Standing orders తీసుకు వచ్చి మా ఎదుట పెడతారు. వాటిని చించి, చిత్తుచేసి, తగలబెడితేగాని అసలు మన రాష్ట్రం బాగు పడదని మాత్రం మీకు నేను చెప్పదలచుకున్నాను. ప్రతిదానికి అవి ప్రతిబంధకంగానే ఉన్నాయి. ఈ orders ఎప్పుడో ఏనాడో గ్రామాలంటే ఏమిటో తెలియనటువంటి వాళ్ళు తయారు చేసినవి ఇప్పుడా పరిస్థితులు లేవే. మీరంతా ప్రజలచేత ఎన్నుకోబడి ప్రజా ప్రతినిధులుగా వచ్చారు. గ్రామాలలో నివసిస్తూ ప్రజల విశ్వాసము చూరగొన్నారు. మీరు అధికారంలో ఉండి వాటిని సవరించలేక పోతున్నారంటే ఏమనాలో నాకు తెలియడము లేదు. మీకు సవరించ డానికి ఇష్టం లేదా? ఆలోచించ డానికి time లేదా? లేకపోతే ఒక నెల రోజుల పాటు మీ tour అన్నీ కట్టిపెట్టి office లో కూర్చుని Departmental Heads అందరినీ పిలిచి ఈ Revenue Board Standing orders ఏది ఎట్లా మార్చాలి అని అడిగి సలహా తీసుకుని, మా శాసన సభ్యులనుకూడా సంప్రదించి అప్పుడు అవి ఏ విధంగా సవరించాలో అట్లా చేయవచ్చును. ఇన్ని అవకాశాలు మీకు ఉండగా, ఇంత అనుభవం గల్గినటువంటి ప్రజా ప్రతినిధులు ఇక్కడుండగా, వీళ్ళవరిమీదా విశ్వాసం లేకుండా, ఏ బ్రిటిషు పరిపాలనలో ఎవరో తయారు చేసినటువంటి ఈ పనికిమాలిన orders ని ప్రతిదానికీ అడ్డం పెడుతూ ఇళ్ళ స్థలాలనుంచి వెళ్ళగొట్టడానికి, Penalties వెయ్యడానికి ఉపయోగిస్తున్నారంటే ఏమిన్యాయం? ఏమి సబబు అని నేను ప్రశ్నిస్తున్నాను. ఇప్పుడు గ్రామాలలో ఉండేటటువంటి పరిస్థితులు చాలా దారుణంగా ఉన్నాయి. ఎక్కడైనా భూమికి Penalty వేస్తే దానికోసం ఒక M. L. A. బైలుదేరాలి. పనిపాటలు లేకుండా అట్లా బయలుదేరి చెప్పుకోడానికి వస్తే ప్రతిదాంట్లో జోక్యం కలుగచేసు కుంటున్నారని మరొక అభియోగం, నిజమే. అలాంటివి నాకుకూడా ఇష్టంలేదు. కొన్ని rules తయారుచేసి, దాని ప్రకారం పరిపాలన సాగవలసిందే కాని, ప్రతిదానిలోనూ M. L. A లు కలగజేసుకోవడం మంచిపద్ధతి కాదు. ఏమిచెయ్యాం అది మన దురదృష్టం. ఈ పద్ధతిని ఈ ప్రభుత్వోద్యోగస్థులూ, ఈ మంత్రివర్గం తీసుకు వచ్చి పెట్టారు. అందులో ఎన్నో అకతవక order లు తెలివితక్కువ order లు ఉన్నాయి వాటిని రద్దు చెయ్యాలి. ఈ విషయం మళ్ళీ మళ్ళీ చెబుతూనే ఉంటాం. చేసే వరకూ చెప్పక తప్పదు. Opposition లో కారంలేకుండా ఉందని, ఇందాక తిమ్మారెడ్డిగారు అన్నారు. కారం లేకపోవడమే కాదు నిస్పృహ నిరాశకూడా ఏర్పడింది. ఎన్ని చెప్పినా లాభంలేదు. విమర్శించినా లాభంలేదు. తిట్టినా లాభంలేదు బుజ్జగించినా లాభంలేదు. ఈ గవర్నమెంటుకి కొంచెంకూడా లక్ష్యంలేదు. ప్రభుత్వోద్యోగస్థులు ఎక్కడ వేలుముద్ర వెయ్యమంటే, అక్కడ వేలుముద్ర వేసేటటువంటి stamping cabinet గా తయారైంది. ఏ విషయం ఆలోచించి చేయడంలేదు. మమ్మల్ని కూనీ చెయ్యండి, దానికైనాసరే మేము ఒప్పుకుంటాం కాని మీరు ఆలోచన లేకుండా

ప్రభుత్వోద్యోగస్థులు ఏమి చెయ్యమంటే, ఎలా చెయ్యమంటే అల్లా చేసేందుకు తయారు కావద్దు. మీరు కొన్ని చోట్లకు వెళ్ళినప్పుడు మీకు అనేక విషయాలు represent చేయడంలేదా, ఎందుకు జరగాలి ఈ ఘటనలన్ని ? ఎన్ని ఏళ్ళకు మార్చబోతున్నారని నేనడుగుతున్నాను. ఈ Revenue Board మనకి ఒక stumbling block లాగ తయారైంది. దాన్ని రద్దు చేస్తేగాని మనం ప్రజలకు ఏమీ ఉపకారం చెయ్యలేము. ఇంక tenancy సమస్యను గురించి చెప్పవలసివుంది. గ్రామాలలో రైతులు భూములు కౌలుకు పుచ్చుకుని చేసుకుంటున్నారు. Planning Commission వారి report ప్రకారం ఆ రైతు దగ్గర 1/5 కన్న ఎక్కువ వసూలు చెయ్యడానికి వీలులేదు. కాని ఈనాడు ఎన్ని రెట్లు వసూలుచేస్తున్నారు ? ఇది ఏవిధంగా సవరించబోతున్నారు. వాళ్ళకు ఏవిధంగా రక్షణ ఇవ్వబోతున్నారు ? ఇంతవరకూ ఏమీ చేయలేదు. వారికి రక్షణ కల్పించమని కోరుతున్నాను. మరొకవిషయం జమాబందీని గురించి, జమాబంది అని చెప్పి అక్కడకు కలక్టర్లు వెళ్ళి రోజులకొలదీ కూర్చుంటారు. రైతులు ఏమి చెప్పుకున్నా వినరు. అక్కడ జరిగే పనేమీలేదు. ఏ విషయంలోనైనా చెప్పుకున్నప్పుడు Collector గారు 'No' అంటే మళ్ళీ 2, 3, రూపాయిలు stampలు పెట్టి order కాపీ తీసుకుని Revenue Board కి appeal పెట్టుకోవాలి ఎందుకీ జమాబందీ? ప్రజలు చెప్పుకునేది విననప్పుడు ఈ జమాబందీ ప్రజలడబ్బు దుర్వినియోగం చెయ్యడానికి ఉపయోగిస్తోంది తప్ప మరిదేనికీ ఉపయోగపడడంలేదు. అందువల్ల నేను ప్రభుత్వాన్ని కోరేదేమనగా చేస్తే సక్రమంగా జరపండి ఈజమాబందీలేకపోతే ఈపద్ధతిరద్దుచెయ్యండి ఈ Religious Endowments విషయంలో ఒక కమిటీ ఏర్పడి ఒక report తయారు చేసింది. అందులో trustees ని permanent advisor లుగా వెయ్యడానికి ఒక సూచన చేశారు. ఈ సూచన చేసి సంవత్సరమైనది. దీన్ని గురించి ఆలోచించారా ? దేముడి మీద భక్తి ఉన్నటువంటి వారున్నారు, భక్తి లేనటువంటి వారున్నారు. కాని దేముడి డబ్బు ఇతరులు కాజేయకుండా కాపాడాలనే టటువంటి పట్టుదలతో అంతా కలసి ఆ committee లో పని చేశారు; కొన్ని సూచనలు చేశారు. వాటిని ప్రభుత్వం వారు ఎందుకు గమనించరు. దేముడి డబ్బు దుర్వినియోగం చేయకుండా ఎందుకు అరికట్టరు? Survey and Settlement లో మునగాల పరగణాలో అనేకచోట్ల అన్యాయాలు జరిగాయి. ఎక్కడ చూచినా లంచగొండి తనం మితిమీరి పోయింది. లంచం తీసుకున్నారని ఎవరు ఋజువు చేయగలరు నేను ఏ ఉద్యోగి ఐనా లంచం తీసుకున్నాడని చెబితే "నీవు చెప్పినమాట వినకపోవడం వల్ల ఈ charge పెట్టావు" అంటారు. ఈ లంచగొండి విధానాన్ని అరికట్టే మార్గం ఏమిటి ? ఈ C. I. D. ని మమ్మల్ని వెంబడించి watch చెయ్యడానికి ఉపయోగించక పోతే ఈ లంచగొండి ఉద్యోగస్థులను పట్టుకోడానికి పంపకూడదా ? ప్రజాపరిపాలన అని చెప్పుకుంటూ, విపరీతమైన లంచగొండి తనం చెలరేగుతూ ఉంటే చూచీ చూడనట్లు ఊరుకుంటున్నారే? ఇంక taxation policy ని గురించి చెప్పేటప్పుడు గోపాలరెడ్డిగారు ఇక్కడుంటే బాగుండేది. రైతులమీద పన్నులు ఎక్కువగా వేయలేదు అంటారు. దురదృష్ట వశాత్తు వారు భూస్వామి కావడం వల్ల ఎంతపన్ను చెల్లిస్తున్నారో, ఏ విధంగా పన్నులు చెల్లిస్తున్నారో కూడా తెలుసుకోడం లేదుగాని, ఎన్నోరకాలైన పన్నులు ఈ రోజున రైతులు చెల్లిస్తున్నారు. ఈ land revenue fix చేసినప్పుడు, ఇచ్చి

రకాల పన్నులు చెల్లించలేదు. ఐతే మీరు అడగవచ్చును ? ఎకరిమీదా పన్నులు వెయ్యక పోతే ఎట్లాగా అని ? ఈ విషయం చెంగల్రాయనాయుడుగారు చెప్పారేమోగాని మేము మాత్రం చెప్పలేదు. వెయ్యండి చల్లపల్లి రాజాగారివంటి పెద్ద పెద్ద భూస్వాముల మీద అని అహర్నిశాదులూ చెబుతూనే ఉన్నాం.

తిమ్మారెడ్డిగారు Spring Channel భూముల మీద రైతులు కష్టపడి నీరు తీసుకొని వస్తూవుంటే మీరు పన్నులు వేస్తున్నారు అని చెప్పారు. బావులు త్రవ్వుకొంటాడు నీరు తీసుకుంటాడు సాగుచేసుకుంటాడు. దానిలో మీకు పన్ను కట్టాలి. డబ్బు కావాలంటారు కాని డబ్బుఉన్న చోటికి మీరు పోరు. వారికి కొంత దూరముగా ఉంటారు. భయముమీకు. వారికోసమే పరిపాలన చేస్తున్నారు. మామూలు ప్రజలమీద పన్నులు వేస్తున్నారు. అందువల్ల మేము సూచించేది ఏమిటంటే ఈ పన్నుల విధానములోను, Land Revenue System లోను తీవ్రమైన మార్పులు రావలెను. Graded System పెట్టవలెను మొన్న ఒక బిల్లు పెట్టేరు. అది చాలా సంతృప్తికరముగా ఉన్నది. చిన్నచిన్న వారిమీద వేసే పెద్దపెద్దవారివద్దకు వచ్చినప్పుడు మొదట బిల్లులో 0-12-0, 0-15-0 పెడితే చంద్రమౌళిగారు అయ్యయ్యో ఇంత కట్టుకొనలేరు అని 500/- రూపాయిలవారికి 0-8-0 చాలును అని అన్నారు. ఎవరికోసము ఈ పరిపాలనా యంత్రము ? పేదవాళ్ళవిషయం వచ్చేటప్పటికి అన్నివిధాలా అన్యాయం చేస్తున్నారు. దేవునిపేరుపెట్టి ఎంతోమంది అన్యాయం చేస్తున్నారు. ఇనాందార్లకు మీరు ఏవిధముగా అన్యాయం చేస్తున్నారు ? ఎంతోమందికి ఈనాడు అన్యాయం జరుగుచున్నది. ఈనాడు Land Revenue పద్ధతి మారితేగాని పరిపాలనా యంత్రము బాగా సాగదు. లంచ గొండి తనము పోవడానికి అవకాశము ఉండదు. Land Reform గురించి మేము చెప్పడమేకాదు దేశము అంతాకూడా ఆశిస్తున్నది. అది లేకపోతే మనము ఏమీ చెయ్యలేము. మనదేశము ముందుకుపోదు. ఈరోజున 4 లక్షల ఎకరాలు మిగలవచ్చును. మేము 20 ఎకరాల మాగాణి సీలింగు పెట్టమన్నాము. దానికి సరిపోయే మెట్టకూడా పెట్టండి. Dry area లో అట్లాచేస్తే ఎక్కువ పొలము మిగలడానికి అవకాశంఉన్నది. మిగిలినది వ్యవసాయకూలీలకు పేద ప్రజలకు పంచండి. 13 లక్షల ఎకరాల బంజరు ఉన్నది. నందికొండ ప్రాజెక్టుక్రిందకు వస్తే ఏమిపోయింది.

Mr. SPEAKER .— You are estimating it.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఈ డిమాండు పోలసీ నిర్ణయించే డిమాండు. Land reforms తీసుకువస్తారా లేదా ? ఈ సమస్య మీద మంత్రివర్గం ఉండడమో పోవడమో తేల్చుకొనవలెను అని నేను మంత్రి వర్గానికి విజ్ఞప్తి చేస్తున్నాను. చెయ్యగలిగితే చెయ్యండి, లేక పోతే పొండి అని చెబు తున్నాను.

The Hon. Sri K CHANDRAMOULI:-అధ్యక్షా మహాశయా ! చాలా మంది సభ్యులు ఈ డిమాండుమీద మాట్లాడినారు. మాట్లాడేముందు కొన్ని విషయాలు నేను ఇక్కడ మనవిచెయ్యవలసిన బాధ్యత ఉన్నది. అయితే ఇది సహజము అయిపో యింది. ఏదో లమ్మారెడ్డిగారు కారం లేదనేసరికి వెంకటేశ్వర్లుగారు కారం ఎక్కువగా పూసుకున్నారు. ఈ పూసుకోవడం వల్ల కారం ఎక్కువ అయ్యే ఇబ్బంది ఉంది.

14th March 1956]    (Sri K. Chendramouli)

బాధ్యతతో విమర్శలు చెయ్యాలని మనవిచేస్తున్నాను. కారం అక్కరలేదని నేనుఅనను. కొంచెం అప్పుడప్పుడు అవసరం. కాని ఎక్కువ పూసుకుంటే కారం మనలనే హరిస్తుందని కూడా తెలుసుకోవలెను. బాధ్యతలేకుండా మంత్రులు జమీందార్లకు అమ్ముడుపోయినారు అని ఊరికే మాటలు అంటే అవి నిష్ప్రయోజనమైన మాటని నేను మనవి చేస్తున్నాను. మంత్రులకు కూడాబాధ్యత ఉన్నది. మంత్రులు కూడా ప్రజా ప్రతినిధులని వెంకటేశ్వర్లుగారికి తెలియకపోయినా ప్రజలకు తెలుసును. ప్రజలవద్దఎట్లా సంచరించాలో మాకు తెలుసును. అందువల్ల ఊరికే అనవసరమైన విమర్శలు చేస్తే అవి విలువలేకుండా పోవడమే కాకుండా దీనివలన వారు అనుకున్న సిద్ధాంతాలకే కాకుండా వారు ఏ ప్రజలను రక్షించదలచు కున్నారో వారికి అపకారాలు కూడా చేస్తారేమోనని నా భయము.

ఆయన బంజర్లు పంచడం మంచిదన్నారు. అక్కడకు పోయి బంజర్లను ఆక్రమించుకోండి ప్రభుత్వంలేదు, ఏమీలేదు అన్నారు. అన్యాక్రాంతాలు అరికట్టమని ఒక వంక చెబుతూ ఆక్రమణలు ఎక్కువచేసి అరాచకాన్ని ఒక వంక పెంచుతూ రెండవవంక భూములలో పంటలు ఉండగానే ఒక పేదవానిని ఇంకొక పేదవానిపై ఎక్కించి ఒక నాటకం జరుపుతున్నారని నేను మనవి చేస్తున్నాను. అందువల్ల ఈవిధానము జాగ్రత్తగా ఆలోచించందే ఏమీ చెయ్యలేము. ఇవన్నీకూడా నాకు కొంచెం తెలిసిన విషయాలు. అయినాకూడా మంత్రి అయినప్పటికికూడా వెంకటేశ్వర్లుగారికి ఉన్నంత అనుభవం నాకు లేకపోయినా ప్రజలతో నేనుకూడా తిరుగుతున్నట్టి వాడనే ప్రజలలో ఉన్న భావాలు నాకుకూడా తెలుసును. కాబట్టి మాటిమాటికీ మీరు జమీందార్లకు అమ్ముడు పోయినారు, భాగ్యవంతులకు అమ్ముడుపోయారు అనడంవల్ల ఏమీ ప్రయోజనం లేదని మనవి చేస్తున్నాను. మీ పార్టీలోను జమిందార్లు ఉన్నారు. మా పార్టీలోను భూస్వాములు ఉన్నారు. మీరు ఏదైనా ఆదర్శముగా ఉండాలంటే వినోబాభావేగారు చెప్పిన మార్గం మీరు అవలంబించండి. భూములు మీరు పంచిపెట్టండి. అప్పుడువచ్చి మాట్లాడండి. మీ భూస్వాములను అరికట్టండి, మీ మాటలకు విలువ ఉండవలెను కాబట్టి మీ సూచనలన్నీ ఉపన్యాస ధోరణిలో చేరినవని మనవి చేస్తున్నాను.

ఇది అప్రస్తుతం అని వెంకటేశ్వర్లుగారు చెప్పారు. కాబట్టి ఒక్కమాట చెబుతాను, దేవాలయము విషయంలో ఒక్క దమ్మిడికూడా ఖర్చుపెట్టలేదని అన్నారు. ప్రభుత్వానికి దేవస్థానాల ధనంతో ఏమీ సంబంధములేదు. దానిని సక్రమముగా పరిపాలించవలెను అనే విషయములో నేను వెంకటేశ్వర్లుగారితో ఏకీభవిస్తున్నాను. కాని ఎక్కడెక్కడ ఏమి ఉన్నదో వెంకటేశ్వర్లుగారికి తెలియదు. వారికి దేవాలయాలమీద, దేవునిమీద విశ్వాసములేదు. డబ్బుమాత్రము కావలయును. డబ్బు కావలెనట దేవునిమీద విశ్వాసం అక్కరలేదట. ఆశ్చర్యం! చూడండి ఎట్లాగుందో. బాహ్య వ్యవహారాలతోనే కేవలం డబ్బుతోనే, ధనతృష్ణతోనే పరిపాలన జరుగవలెనని అంటే అది చాలా కష్టము అయిన విషయము. ప్రభుత్వానికి గాని వ్యక్తులకుగాని కొన్ని నీతి నియమాలు కొంత నిగ్రహము కావలెను. అందువలన పరిపాలన జరిగినపుడు కొన్ని సూత్రాలు, కొన్ని చట్టములు కొన్ని నియమములు ఉన్నవి, అవి మీకు పదేపదే జ్ఞాపకం చేస్తున్నాను. ఒక సూత్రము, నియమము, విధానముమంచివికాకపోతే మార్పుచేసికొనడానికి శాసనసభఉంది. అటువంటిది చెయ్యండి అంతేగాని మనకు సూత్రము అక్కరలేదు నా ఇష్టము వచ్చినట్లు నా వ్యక్తిగత అభిప్రాయముతో పోవలెను, నా వ్యక్తిగత విధానముతో పోవలెను అని నేను ఇవాళ

అన్నారు కాబట్టి ఆ విధంగా జరగాలి. రేపు ఇంకొకటి అంటాను అది జరగాలి అంటే అది వ్యక్తిగత అభిప్రాయంగానే ఉంటుంది కాని పరిపాలనా దక్షతనుగాని రాజనీతిని గాని సూచించే విషయముకాదు. అందువల్ల నేను మరొకసారి మనవి చేసేది ఏమిటంటే: ఈ డిమాండు విషయం వచ్చినా ఇంక ఏ విషయం వచ్చినా ఒకవ్యక్తిమీద అభిమానము తోనో లేకపోతే ఒకవ్యక్తిని నిందించాలనే దురభిప్రాయము మనసులో పెట్టుకొనో ఇటువంటి దూషణ భూషణలు చేయడం సంభవికాదు అట్లా చెయ్యాలంటే ప్రతి వారు చెయ్యవచ్చును. కాని ఇది సభా మర్యాదకాదు, అని మనవిచేస్తున్నాను. అసెంబ్లీలో బాధ్యతగలిగిన, సభా మర్యాదగలిగిన ఉండి కూడా విమర్శలు చేస్తే మంచి వారికి ఇక్కడ ప్రతిష్ఠ ఉంటుంది వ్యక్తిగతాభిప్రాయాలు ఉంటే ఎట్లా. ఇంతవరకు ministry ఎప్పుడూ కూడా వారు సూచించిన విషయం మంచిది అయినపుడు మంచిది అని చెప్పుతున్నాము మంచిది కానప్పుడు సాధ్యము కాదని బహిరంగముగా చెప్పాము. అంతేగాని దానిలో ఏమీ దాయలేదు. వ్యక్తిగతమైన విషయము లేదు. ప్రజాసేవ చెయ్య వలెననే ఆవేశం అనుద్దా మాకన్నా 1000 రెట్లు మాకు కూడా ఉన్నది అని మనవి చేస్తున్నాను. అది మాత్రము తెలుసుకోవాలి ఏదో వారన్నారని ఎక్కువ కారం పూసు కుంటే లాభంలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU — తిమ్మారెడ్డిగారు అన్నారు. వారికి మీరు సమాధానం చెప్పండి.

The Hon Sri K CHANDRAMOULI — Minor Irrigation విషయములో చాలామంది గౌరవసభ్యులు చెప్పారు. నిజమే పెద్ద పెద్ద ప్రాజెక్టులు కట్టవద్దని అనలేదు. Minor Irrigation విషయములో ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ తీసుకొనడం లేదని అంటున్నారు. కొన్ని figures జిల్లాలవారిగా ఇస్తాను ఈవిషయం నేను ఎక్కువగా మాట్లాడ దలచుకోలేదు.

| | 1953–54 | 1954–55 | 195?–56 |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 1,02,215 | 1,18,000 | 5,74,000 |
| విశాఖపట్నం | 42,000 | 6,00,000 | 5,00,000 |
| తూర్పు గోదావరి | 2,53,000 | 2,68,000 | 1,37,000 |
| పశ్చిమ గోదావరి | 2,93,000 | 3,14,000 | 1,14,000 |
| గుంటూరు | 98,000 | 1,00,000 | 74,000 |
| నెల్లూరు | 10,00,000 | — | 4,00,000 |
| కర్నూలు | 2,00,000 | — | 42,000 |
| చిత్తూరు | 8,00,000 | 7,00,000 | 6,00,000 |

ఈ అంకెలను బట్టి చూస్తే ప్రభుత్వం ఎక్కడ ఎటువంటి వసతులు కల్పించిందో తెలుస్తుంది.

ఈ అంకెలను బట్టి చూస్తే ప్రభుత్వము ఈ adjustment లో ఎక్కువగా మాగాణి వసతులున్నటువంటి ప్రాంతాల్లో తగ్గించి మాగాణి వసతులు లేక చెరువులు

పరమ్మతు కావలసినచోటికి ఎక్కువ డబ్బును పంచినది అని మాత్రము స్పష్టముగా కనబడుతున్నది. అందువలన కేవలము డబ్బు ఊరికే allot చేస్తే గౌరవనీయులైనటువంటి శాసనసభ్యులు ముఖ్యముగా విమర్శనకొఱకై విమర్శించే శాసనసభ్యులు అక్కడికి వెళ్ళి ఏదైనా ఒక చెఱువు త్రవ్వడానికి తోడ్పడితే అప్పుడు నేను కూడా చాల సంతోషిస్తాను. అనేకవేల చెఱువులున్నాయి. అదికాకుండా జమీందారీ area లో చాలా కష్టాలున్నాయి. నేను ఒప్పుకుంటాను. రైతులు ఈ ఎస్టేట్లను రద్దుచేయడంవల్లకూడా చాలా కష్టాలు పడ్డారు కష్టాలున్నచోట మరుగుపెట్టాలి అనే భావాలు నాకులేనేలేవు. Abolition వల్ల Abolition కాకమునుపుకూడా అనేకచోట్ల కష్టపడ్డారు. ఒక సంస్కరణ వచ్చినపుడు ఒక పెద్ద మార్పు వచ్చినపుడు కొన్ని చిక్కులుంటాయనికూడా ఈ House కు ఇదివరకు రెండుమూడుసార్లు మనవిచేశాను. అందువల్ల జమీందారీల రద్దువల్ల ఈ భూములు ఎల్లా కేటాయించాలి ఎల్లా స్వాధీనపరచుకోవాలి అనే సమస్యలు ఉత్పన్నమౌతాయి. సర్వేచేయటం, settlement చేయటం జరగాలి. అందువల్ల ఈ మధ్యకాలంలో ఊరికే తొందరపడితే ఏమీ లాభములేదు. ఆవేశపడితే అంతకన్న లాభములేదు. కొన్ని కష్టాలు మనం భరించాలి. భరించకుండా సుఖమే కావాలి ఏమీ శ్రమలేకుండా అంతాభోంచేద్దాం అనేటట్టయితే యిది అట్టివ్యవహారముకాదు. అందువల్ల నేను మనవిచేసే దేమిటంటే కష్టాలున్నచోట చిక్కులున్నచోట వాటిని పైదొలగించడానికి వారేమైనా సక్రమమైన సూచనలు చేశారా ? ఊరికే విమర్శనచేస్తే ప్రయోజనములేదు. ఆ సూచనల్లో మంచి గనక ఉంటే ఆ సూచనలు ప్రభుత్వం అమలుపరచటానికి ప్రయత్నం చేయకపోతే అప్పుడు నిజంగా సక్రమమైన విమర్శనలు చేయవలసిందే. ఇంకా ఎక్కువగా విమర్శించాలి నేను వద్దనను. విమర్శలను నేను గర్హించను. కాని అది సక్రమంగా ఉండాలి, అనుభవపూరితంగా ఉండాలి. సాధ్యమయ్యేటట్టుగా వుండాలి. దాన్ని అమలుజరపటానికి మనమందరముకూడా అందరమూ కలిసికట్టుగా పనిజేసేటట్టు ఉండాలి. అందువల్ల Minor irrigation విషయాలు వచ్చినప్పుడు ఈ విషయాలను ఆలోచిస్తే ప్రభుత్వం ఏమైనా కృషిచేస్తుందా లేక చేతులు కట్టుకొని కూర్చున్నదో లేక ఏమైనా చేస్తుందో చూస్తే ఇవన్నీ కూడా మీకు తెలుస్తాయి అయితే ఈ ప్రభుత్వ యంత్రాన్ని గూర్చి కొంత విమర్శించాలి. ప్రభుత్వంలో కొన్ని విషయాల్లో అప్పుడప్పుడు జాప్యం జరుగుతుంది. జరుగలేదని నేననను. కాని ఒక్కొక్కప్పుడు వేగిరపాటుకూడదని గౌరవసభ్యులు ఆలోచించాలి. తొందరపడి ఎక్కువ తప్పులు చేసేదాని కన్నా కొంచెము నెమ్మదిగా పోయి తప్పులు తక్కువ చేయటం మంచిదని నేను భావిస్తున్నాను. అయితే కొన్ని విషయాల్లో ఏవైనా ఆలస్యాలు జరుగుతూ ఉంటే వాటిని తొందర చేయటానికి వాటిని సక్రమంగా తీసుకురావటానికి మనం ప్రయత్నం చెయ్యాల్సిందే! ఎందుకల్ల అంటే మనదేశం చాలా పేద దేశం అన్నివిధాల్లో అభివృద్ధి చేసుకోవాలి చాలాకాలము బాధలుపడి యున్నాము కాబట్టి సహజంగా ప్రజలందరూ కూడా యింకా ఏమి లేవు అనుకోవటంలో తప్పులేదు. కాని వాళ్ళను రెచ్చగొట్టటం మాత్రము తప్పని నేను అనుకుంటున్నాను. అంతవరకే నేననేది. రెచ్చగొట్టవద్దు ప్రజల్ని. ఏడ్చేవాణ్ని ఇంకా ఏడ్పించవద్దు అదే నేను కోరేది. వాళ్ళను తొందరచేయవద్దు. అన్నము ఉడుకుతూ ఉన్నది, అబ్బాయి ఏడుస్తూవున్నాడు. ఏంచెయ్యాలో వేంకటేశ్వరలుగారిని చెప్పమనండి. పొయ్యిమీద నిప్పు తీసె

మంటూడా, లేకపోతే ఇంకా ఎక్కువ నిప్పుపెట్టమంటాడా, లేకపోతే ఆ ఉడికి ఉడకని అన్నము పెట్టి కడుపునొప్పి తెమ్మంటాడా? ఏంచేయ్యమంటారు? ఇట్లా విమర్శిం చాలంటే నేనుకూడా విమర్శించ గలను ఒక్కొక్కరికి కొన్ని అనుభవా లున్నాయి. వారి అనుభవాలు విలువ గలవి. నేను వాటిని కాదనను. సక్రమంగా మనం చూస్కుం దాము. వ్యవహారము నడుపు కుందాము.

Land reforms తీసుకొని రావలెనని పదే పదే చెప్పారు. కమిటీ వచ్చింది. Report విచారణ జరుగుతోంది. ఇది major reform అందులో ఒక uniform reform తేవాలి. Land మాత్రమేకాదు అన్ని రకాల ఆస్తులకు సంబంధించిన reforms తీసుకొని రావాలని కొందరు చెప్పారు. అన్ని రకాల సంస్కరణలు త్వర త్వరగా కావాలనే ఆకాంక్ష ఉన్నది. దాంట్లో ఏమీ తప్పులేదు. చాలాకాలము బాధపడి ఉన్నాము కాబట్టి తొందరగా చెసుకొందామని ఉన్నాము తొందరగా చేసు కోవటానికి సాధ్యమయ్యే పనులున్నాయి, కానివి ఉన్నాయి. ఏది సాధ్యం ఏది ముందుగా, ఎట్లా చెయ్యాలి అనే విషయాలు ఆలోచించాలి. ఇప్పుడు జమీందారీ విధానము ఉన్నది. చట్టం చేశాము. కొన్ని లోపాలు ఉన్నాయి అని ఇందాక నే వెంకటేశ్వర్లుగారు విమర్శించారు. ఎక్కడో జమీందారులది ఒక్క Building కూడా తీసుకోలేదని చెప్పారు. వారి information కు గాను ఒక వెంకటగిరి సంస్థానము లోనే పది బిల్డింగులు స్వాధీనము చేసుకొన్నాము అని చెబుతున్నాను దానికి కూడా కొన్ని హద్దులు ఉన్నాయి. ఒక శాసనము చేసిన తరువాత ఎవరికి పోవలసింది వారికి పోవాలి చట్ట ప్రకారం. అది వారికి అన్వయించి నప్పుడు మాత్రము లాభం ఉండరాదు. నాకు అన్వయించినప్పుడు మాత్రము లాభంగా ఉండాలి, అనడం భావ్యం కాదు. రెండు వైపులా చూడాలి. ఏ చట్టం చేసినా కొన్ని ఒడుదుడుకులు అటూ ఉంటాయి ఇటూ ఉంటాయి. అందువల్ల జమిందారుల భూములు పుచ్చుకోలేదు, వారి ఆస్తులు పుచ్చుకోలేదు అని అంటే వారివలె మేము ఊరికేనే లాక్కునే వ్యవహారము మాకులేదు. మాకూ వారికి భేదము అక్కడనే ఉన్నది. వారు ఏమీ compansation ఇవ్వకుండా మొత్తము లాగేయ్యండీ అని అంటారు. బలవంతంగా లాగుకునే వ్యవహారము ఈ ప్రభుత్వం యొక్క, కాంగ్రెసు పార్టీయొక్క policy కాదు. రోజూ వెంకటేశ్వరులు గారు పదిసార్లు చెప్పినా అది జరిగే వ్యవహారముకాదు. రెండు నెలల్లో 90 సార్లుచెప్పాను కాబట్టి నీవు చేయలేదు అంటే అది సాధ్యమయ్యే టటువంటిదిగాదు. 90 సార్లు గాదు 150 సార్లు చెప్పవచ్చును. వారికి ఇంకేమి రెండవ పని లేదు కాబట్టి ఈ పనిమీదే కూర్చోవచ్చు. తక్కిన వాళ్ళకి అన్ని రంగాల్లోకూడా పనిచేయవలసిన బాధ్యతఉన్నది. కాబట్టి Land reforms ను గురించి ఇంతవరకు ఏమి చెప్పలేదు. గోపాలరెడ్డిగారు భూస్వామి. చంద్రమౌళిగారికి ఆస్తి ఉన్నది, అని చెప్పి వ్యక్తిగతంగా పేర్లు తీసుకు రావటం న్యాయమైన విషయము కాదు. Land reforms తీసుకొని రావాలని మీకన్నా ఆవేశముతో మేము ఉన్నాము.

Sri PILLALAMARRI VENKATESWARLU — గోపాలరెడ్డి గారు భూస్వామి. చంద్రమౌళిగార్కి ఆస్తి ఉన్నది అని నేను చెప్పలేదు. మీరా విధంగా చెప్పడం పొరపాటు.

14th March 1956]

The Hon Sri K. CHANDRAMOULI.— గోపాలరెడ్డిగారు భూస్వామి అనికూడ అన్నారండి. నా పేరు అనలేదు ఒప్పుకుంటాను. వ్యక్తిగతంగా పేర్లుతీసుకొని వచ్చి చెప్పటం అంత మంచిదికాదు. విమర్శన General గా ఉండాలి. Democracy లో మంత్రులకు సమిష్టి బాధ్యతకూడా ఉన్నది. అదికూడా తెలుసుకోవాలి. అందువల్ల ఈ కలెక్టివ్ బాధ్యతలో పోర్టుపోలియోస్ ఎట్లా ఉన్నా మొత్తముమీద పని collective గా జరుగుతూ ఉంటుంది. అందువల్లనే మనం Cabinet విధానాన్ని ఏరి కోరి, తెచ్చిపెట్టుకున్నాము. వ్యక్తిగతంగా ఒక మనిషిమీద అభిమానంతో గాని ఒకి మనిషిమీద కోపంతోను తాపంతోను వ్యక్తిగతమైనటువంటి నిందలను వేయటం అంత మంచిదిగాదని నేను మనవి చేస్తున్నాను. అది వారికికూడ మంచిదిగాదు. Sooner or later we must repent for our hasty remarks. పోతేఇకజమీందారీ రద్దువిషయంలో రెడ్డిగారుచెప్పారు. వారుచెప్పిందాంట్లో చాలామట్టుకు నిజమున్నది. సర్వే, సెటిల్మెంటు నీటి వసరుల విషయంలోను చాలా చిక్కులున్నాయి. బంజరు భూముల విషయాల గురించికూడా కొన్ని యిబ్బందులు ఉన్నాయి వెంకటేశ్వరులుగారు సహకరిస్తే చాలా తొందరగా బంజరుభూముల సమస్య పరిష్కారమవుతుందని మాత్రము నేను ఇక్కడ open గా ఈ సభలో చెబుతున్నాను. నేనుకూడా ఆ సహకారానికి సిద్ధంగా ఉన్నానని చెబుతున్నాను. పేదవాళ్ళదగ్గర మనకు రాచకీయాలుగాని, పార్టీ విభేదాలుగాని ఉండనక్కరలేదు. ఒక పేదవానికి భూమి యివ్వటంలో మీరెంత ఉత్సాహంగా ఉన్నారో నేనుకూడా అంత ఉత్సాహంగా ఉన్నాను. ఈ Cabinet కూడా అంత ఉత్సాహంగా ఉన్నది. అందువల్ల మన అందరియొక్క సహకారాన్ని బట్టి అక్కడ ఉంటుంది గాని అక్కడికి వెళ్ళటంతోటి వెంకయ్యగారు నా వాడు పుల్లయ్యగారు నా వెంట ఉంటాడు, సుబ్బయ్యగారు యింకొకడివెంట ఉంటాడు, వాడికి కాకుండా వీడికిచెద్దాం, వీడికి కాకుండా వాడికి చెద్దాం అనేటట్టయితే అక్కడంతా గందరగోళం అవుతుంది.

ఇప్పటికి వెంకటేశ్వర్లుగారు భాగ్యవంతుల దగ్గర ఉండే భూములను తీసుకోలేదు అంటున్నారు. బంజరు భూములు తీసుకున్నాము. ఖాళీగానే ఉన్నాయి, కేటాయించడంలోను పంచిపెట్టడంలోను ఇబ్బందులు చెబుతున్నాను. ఉద్యోగులలో కొంతమంది చెడ్డవాళ్ళు ఉండవచ్చును. ఊరికే sweeping remarks చేస్తే లాభంఏమిటి? లంచగొండితనం ఎక్కువగాఉన్నదన్న ఏమిటి ఫలం? మనం దానిలో భాగస్వాములమే. నాపని కావలసివస్తే ముందుగా నేనే ఇచ్చేది అక్కడ. నేనుకాని నాతరఫున మనుష్యుడు కాని అక్కడ ఇస్తాడు. మన రాజ్యాంగంలో లోపాలు లేవని నేను అనను. పరిపాలనలో కొన్ని లోపాలు లేవని సవరించుకోవద్దని అనను. వాటిని సవరించుకోడానికి విధానాలు చెప్పండి. అంతా ఒకసారి రద్దుచేయండి అంటే ఏమీ లాభంలేదు. జమీందారీ రద్దు విధానంవల్ల Rent Reduction Act వల్ల శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలతో సుఖం లేకపోగా కష్టాలు ఎక్కువైనాయి. చాలామంది ఆరోజులలో Rent Reduction Act వస్తే హర్షిస్తున్నాము అన్నవారే, శ్రీకాకుళం జిల్లాకు వెడితే ఇదివరకు కట్టేదానికన్న ఎక్కువ కట్టవలసి వస్తోంది. అనుభవంవల్ల తెలుస్తుంది కాని ఊరికే ఎలా తెలుస్తాయి. గౌరవనీయులైన సభ్యులు కొన్ని విషయాలు నాముందు పెట్టారు. విశాఖపట్నంలో కాని శ్రీకాకుళంలో కాని

(Sri K Chandramouli) [14th March 1956

Rent Reduction Act వల్ల శిస్తు తగ్గుతుందనే భావముతో ఉన్నాను కాని ఎక్కువ అవుతుందనే భావం నాకులేదు. ఇటువంటి దానిని సవరించవలసియున్నది Next శాసనసభలో తీసుకువస్తాము అనుకుంటున్నాను.

Sri P THIMMAREDDI — Rent Reduction Act వల్ల జమీందారీ శిస్తుకన్న తగ్గుతుంది. సర్వే సెటిల్మెంటు అయినతరువాత నిర్ణయించబోయే రైత్వారి శిస్తుకంటే హెచ్చుగా ఉంటుంది

The Hon. Sri K. CHANDRAMOULI — అవును

Sri P S. RAJAGOPALA NAIDU .— Rent Reduction Act క్రింద ఇపుడు ఉన్నదానికంటె హెచ్చుగా వసూలుచేయడానికి వీలులేదు. కాబట్టి దానిని సమన్వయం చేయడంలో తప్పు వుంటుంది, సవరణ అవసరంలేదు.

The Hon Sri K CHANDRAMOULI :— సవరణ చేవలసియున్నది. గౌరవసభ్యులకు చదివి వినిపిస్తాను.

"In certain areas in Srikakulam and Vizagapatam Districts, the rate fixed in the Rent Reduction Notification are very high compared with the ryotwari rates in those Districts. Action is being taken to remedy this defect At present, the Government have no power to cancel, rescind or modify the Notifications already issued under the Rent Reduction Act Therefore we are trying to amend the Rent Reduction Act."

Sri A. BAPINEEDU .— Taken over estates లో కొన్ని గ్రామాలు కట్టుబడి ఈనాములు ఉంటాయి. వాటికి వుండే rates ప్రకారం గ్రామం అంతా కట్టడంవల్ల 1-8-0, 1-4-0 ఉంటుంది. ఇట్టివి 2, 3 గ్రామాలు West Godavari లో ఉన్నాయి. వీటినికూడా చూడవలసిందిగా మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

The Hon. Sri K. CHANDRAMOULI :—ఇటువంటి suggestions అన్నీ ఆలోచించవలసియున్నది. మనకు కూడా తెలియనివి, తెలియకుండా ఇక్కడ మాట్లాడేవి కూడా ఉన్నాయి అని మనవిచేస్తున్నాను. ధనరూపకం గాను, ధాన్య రూపకంగాను వసూలుచేసే వాటిగురించి, ధాన్యరూపకంగా వసూలుచేసే వాటిలో డబ్బు విలువకట్టి చేయడంవల్ల ధరలుపెరిగిన రేట్లు కట్టడంవల్ల అన్యాయంగా ఎక్కువ అవుతోంది. వీటన్నింటినీ ఆలోచించవలసి యున్నది. సభ్యులు చేసే ఉపన్యాసాలలో ఉండే relevant portions, చక్కని విషయాలన్నీ రెవెన్యూ డిపార్టుమెంటువారు నేను కూడా కూర్చుని — గౌరవనీయ సభ్యులలో తోడ్పడే వారితో కూర్చుని — ఏవిధంగా సరిచేస్తే ప్రజలకు ఉపయోగకరంగా ఉంటుందో ఆ విధంగా చేయడానికి సహకరించ డానికి ప్రభుత్వం ఎప్పుడూ వెనుకంజ వేయదని సంసిద్ధంగా ఉన్నదని నేను చెబుతున్నాను. తక్కిన విషయాలు గురించి

ఎక్కువగా చెప్పవలసిన విషయాలు ఏమీలేవు. శివయ్యగారు పన్నులు వసూలు చేసేటప్పుడు సరిగా తెలియడం లేదు; Village officers వల్ల చాలా ఇబ్బందులున్నాయి; సక్రమమైన రశీదులు ఇవ్వాలని చెప్పారు. ఆ సలహా వచ్చినప్పటి నుంచి ఆ form ఏ విధంగా simplify చేస్తే బాగుంటుంది అని ఆలోచించి 18 వ ఫారం ఏ విధంగా ఉండాలి, రైతు ఎంత భూమికి ఏ రేటు ఎంతెంత కడుతున్నాడు, ఇవన్నీ వివరంగా వేసి ఇవ్వాలని కలెక్టర్లకు instructions ఇచ్చాము. ఇప్పుడు కొన్ని రిపోర్టులు వచ్చాయి. ఈ సంవత్సరమే పూర్తిగా అమలు చేయాలంటే సాధ్యంకాదు. కొంతవరకు ఈ సంవత్సరం చేస్తాము వచ్చే సంవత్సరానికి పరిపూర్ణంగా అమలు చేయడానికి మేము తప్పకుండా కృషిచేసి అమలు జరిగేట్లు చూస్తామని చెబుతున్నాను. ఈ సంవత్సరం temporary రశీదులు ఇచ్చినపుడు అన్ని విషయాలు చూపించక పోయినా మొత్తం శిస్తు మార్చిలో కిస్టీలోపుగా 18 వ ఫారం అచ్చు complete చేసి ఇవ్వడానికి చూస్తాము. ఈ సంవత్సరం కొన్ని లోపాలు జరిగినా అన్యథా తలంచకుండా ఉండాలని కోరుచున్నాను. వచ్చేసంవత్సరానికి పరిపూర్ణంగా అమలు చేయడానికి తప్పకుండా కృషి చేస్తామని మనవిచేస్తాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— కాగితంమీద ఉండేదానికి నేలమీద ఉండేదానికి చాలా తేడా ఉంటుంది, దానికి ఎవరు guarantee ఇస్తారు?

The Hon. Sri K. CHANDRAMOULI — వారి కంఠానికే తెలియదు. నేలమీద ఉండేదానికి కాగితంమీద ఉండేదానికి తేడాలు ఎక్కువ ఉండవు. Joint పట్టాలవల్ల వస్తుంది. Difficulty Single పట్టాలు చేయాలంటే వెంకటేశ్వర్లుగారు land reforms రావాలి అంటున్నారు. ఈ విషయంలో అనేక తేడాలున్నాయి. జమీందారీ భూములు, ఈనాములు, రైత్వారీ భూములు అనేకరకాలున్నాయి. వాటి విషయంలో piecemeal గా reforms చేస్తే రోజూ మార్చుకోవలసి వస్తుంది. మరొకసారి చెబుతున్నాను, Land reforms తేవాలని మీ కన్న మాకు ఎక్కువ ఆదుర్దా ఉన్నది. అయితే ఈవేళ చేస్తాము, రేపు చేస్తాము; 24 గంటలలో చేస్తాము అని చెప్పమంటే సాధ్యమయ్యేదికాదు. కమిటీ వేసారు. వారి రిపోర్టు వచ్చింది. అది విచారణలో ఉన్నది, ఏమీ విచారణలేకుండా ఊరికే చేయాలంటే కాదు. ఆ రిపోర్టు చర్చించి సాధ్యమైనంత తొందరలో bill తీసుకువస్తాము. Public opinion కూడా తీసుకుంటాము, మీ అందరి opinion తీసుకుంటాము. సమగ్రమైన రూపంలో land ceilings గురించి కమతాల గురించి అన్నింటిమీద నిర్ణయిస్తారు. ఈనాములు తెచ్చాము: అది అట్లాగేవున్నది. మీకు, మాకు తృప్తిలేని వ్యవహారంగా వున్నది. అసంతృప్తికరంగా సరిగా study చేయకుండా తెచ్చిన వ్యవహారాలు ఇట్లాగే వుంటాయి, వెంకటేశ్వర్లుగారిని ఎక్కువగా ఆవేశపడవద్దని, కారం ఎక్కువగా పూసుకో వద్దని కోరుతున్నాను. ప్రజా సేవ కేవలం ఒక రాజకీయ పార్టీ సొత్తు అని నేను అనను. ప్రజల పేరు చెప్పినపుడు జాగ్రత్తగా ఆలోచించాలి. ప్రజలకు కళ్యాణం చేకూరే విధానాలు ప్రభుత్వం చేయనపుడు మీరు చూపించండి. విధానం చూపించకుండా ఆవేశంలో విమర్శలు చేయవద్దు. మీ అందరి సహకారాలు కావాలి; మేము సహకరించ

దానికి సిద్ధంగా వున్నాము. మీరందరు cutmotions withdraw చేసుకొని యీ Demand ఆమోదించాలని కోరుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU — ప్లానింగు కమిషన్ కొన్ని సూచనలు చేసింది. ఒక Government recognized body కొన్ని సూచనలు చేసింది. వాటిమీద ప్రభుత్వము యొక్క అభిప్రాయము ఏమిటి? ఈ Land Reforms అనేవి ఎప్పటిలోపల తీసుకొని రాగలరో చెప్పగలరా? నేను ఇప్పటికీ విమర్శగా కాకుండా honest గా అడుగుతున్నాను. మంత్రిగారు అందరి సహకారం కావాలంటున్నారు. వారికి యిక ప్రపంచములో అందరియొక్క సహకారమున్నది. ఏమి చేయబోతున్నారు, land ceiling తే బోతున్నారా లేదా అనే సమస్యను తేల్చుకో వలసి ఉన్నది.

The Hon Sri K CHANDRAMOULI — ఇప్పటికి మూడు పర్యాయములు చెప్పాము. మళ్ళీ మళ్ళీ చెప్పితే అసభ్యతకు దారితీస్తుంది.

Mr SPEAKER — I am now putting the cut motion of Sri Vavilala Gopalakrishnayya to the vote of the House.

The Question is —

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by ... Rs 100/-

(గ్రామోద్యోగుల పిల్లలకు విద్యావసతులు ఎన్. జి. ఓ.ల వలె యివ్వవలెనని వ్యవసాయాదాయ పన్నులు వేయవలెనని.)

(ప్లానింగ్ కమిషన్ ఆదేశించినట్లు భూసంస్కరణలు అమలు జరుపవలసినదిగా.)

The motion was lost.

Mr. SPEAKER :— I am now putting the cut motion of Sri Pillalamarri Venkateswarlu to the vote of the house. The question is .

To reduce the allotment of Rs 72,99,800/- for Land Revenue by ... Rs. 100/-

[To discuss the failure of the Government to draw a detailed scheme giving priority to the agricultural labour in distributing the banjar land that could be made available for cultivation.]

The motion was lost.

Mr. SPEAKER:-I now put the cut motion of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is :—

To reduce the allotment of Rs 72,99,800/- for Land Revenue by Rs. 100/-

14th March 1956] (Mr. Speaker)

[To discuss the failure of the Government to limit the agricultural holding of land owners by fixing a ceiling thus enabling the Government to take over the surplus land and distribute the same to landless poor ]

The motion was lost.

Mr. SPEAKER —I now put cut motion of Sri Gopalakrishnayya to the vote of the House.

The question is .—

To reduce the allotment of Rs. 72, 99, 800/- for Land Revenue by Rs. 100/-

(రెవిన్యూబోర్డును రద్దుచేయక పోవటమును గురించి)

The motion was lost.

Sri M. NAGI REDDI —Sir, I beg leave of the House to withdraw the cut motion (No. 157) moved by me

The cut motion was, by leave of the House, withdrawn.

Sri M NAGI REDDI·—Sir, I beg leave of the House to withdraw the cut motion (No. 167) moved by me.

The cut motion was, by leave of the House, withdrawn.

Mr SPEAKER·— I now put the cut motion of Sri B. Sankaraiah (No.176) to the vote of the House.

The question is .

To reduce the allotment of Rs 72, 99, 800/- for Land Revenue by Rs 100/-

(నెల్లూరు జిల్లాలోని పెన్నా డెల్టా క్రింద చెఱువు బంజర్లు సుమారు 5 సంవత్సరముల నుండి సాగు చేస్తున్న పదివేల కుటుంబాల వ్యవసాయ కూలీలను, పేదరైతులను సదరు భూములనుండి తొలగించుటకు అందులో కొన్ని భూములను రాజకీయ బాధితులకు ఇచ్చుటకున్నా ప్రభుత్వము చేస్తున్న చర్యలకు అసమ్మతి తెలుపుటకు.)

The motion was lost

Sri M. NAGI REDDI — Sir, I beg leave of the House to withdraw the cut motion (No. 180) moved by me.

The cut motion was, by leave of the House, withdrawn.

Sri M NAGI REDDI — Sir, I beg leave of the House to withdraw the cut motion [No. 182] moved by me.

The cut motion was, by leave of the House, withdrawn

Sri P. NARASIMHAPPA RAO :— Sir, I beg leave of the House to withdraw the cut motion [No. 183] moved by me.

The cut motion was, by leave of the House, withdrawn

Mr SPEAKER — I now put the cut motion of Sri S. Vemayya [No. 184] to the vote of the House.

The question is —

To reduce the allotment of Rs 72,99,800/- for Land Revenue by .. Rs. 100/-

[For the failure of the Government to adopt single patta system of holding in the State ]

The motion was lost.

Mr. SPEAKER :— I now put the cut motion [No. 192] of Sri B Ratnasabhapathi Setti to the vote of the House The question is —

To reduce the allotment of Rs. 72,99,800/- for Land Revenue by ... Rs 100/-

(To criticise the delay in Survey & Settlement in both Estates and Inam village and Ryotwari villages).

The motion was lost

Mr. SPEAKER :— The question is .—

"That the Government be granted a sum not exceeding Rs. 72,99,800/- under Demand No. I — Lad Revenue"

The motion was carried and the grant was made.

Mr. SPEAKER.—I now put the cut motion of Sri Vavilala Gopalakrishnayya to the vote of the House.

14th March 1956] (Mr. Speaker)

The question is :

To reduce the allotment of Rs. 20, 40, 000/- for Compensation to Zamindars by Rs. 100/-

(రెడ్ టేబుల్ బాండు రూపముగా ఇవ్వవలెనని)

The motion was lost.

Mr SPEAKER —I now put the cut motion of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is ·

To reduce the allotment of Rs. 20, 40, 000/- for Compensation to Zamindars by Rs. 100/-

(To discuss the failure of the Government to pay compensation to Zamindars in the form of bonds instead of paying in cash.)

The motion was lost.

Mr. SPEAKER —The question is ·

"That the Government be granted a sum not exceeding Rs. 20, 40, 000/- under Demand No. XXXIII Compensation to Zamindars."

The motion was carried and the grant was made.

Mr. SPEAKER.-The House will now adjourn and meet again at 8-30 A.M. on Thursday, 15 March, 1956.

The House then adjurned.

## APPENDIX I

## VIDE ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION No. 447,

## CLAUSE [a]

at page 218 Supra

*Statement showing Districtwise particulars Regarding th number of Harijan Co-operative Credit Societies working, as on 30th June 1955*

| Name of the District. | Number of Harijan Credit Societies. | Number of Harijan Co-operative Credit Societies including Field Labourers' Societies. |
|---|---|---|
| [1] | [2] | [3] |
| 1 Anantapur | ... 6 | 10 |
| 2 Guntur | ... 52 | 273 |
| 3 West Godavari | ... 48 | 92 |
| 4 Cuddapah | ... 4 | 4 |
| 5 Chittoor | ... 4 | 5 |
| 6 Kurnool | ... 11 | 12 |
| 7 Krishna | ... 10 | 348 |
| 8 Nellore | .. 101 | 114 |
| 9 Srikakulam | .. 5 | 5 |
| 10 Visakhapatnam | ... 1 | 1 |
| 11 East Godavari | ... ... | 328 |
| Total | 242 | 1,192 |

## *APPENDIX II.*

### VIDE ANSWER LEGISLATIVE ASSEMBLY QUESTION No 576

at Page 228 Supra.

### MISCELLANEOUS

HEALTH AND LOCAL ADMINISTRATION DEPARTMENT

*G O. No 1220, 7th December 1955*

District Boards–Administration by Special Officers-Hearing of representations of Public Instructions issued

*Order–No. 1220, Local Administration, dated 7th December 1955*

The Government desire that the Special Officers of District Boards and their Personal Assistants should be accessible to the members of the public particularly to the Members of the Legislative Assembly when they approach them for making representations in respect of matters relating to District Board Administration. The Special Officers are requested to see that their Personal Assistants set apart both while at Headquarters and in Camp, not less than one hour a day for interviews to the members of the public so as to enable them to make representations in respect of matters relating to District Boards Administration.

(By order of the Governor).

## APPENDIX III.

### VIDE ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION No. 576 at Page 228 supra.

### MISCELLANEOUS

HEALTH AND LOCAL ADMINISTRATION DEPARTMENT

*G. O No 70, 17th January 1956*

District Boards—Advisory Committees to advise Special Officers—Constitution ordered.

---

*Order—No. 70, Local Administration. dated 17th January, 1956.*

The District Boards in this State are at present under the Collectors of the Districts as the Special Officers of the District Boards. With a view to enable the Special Officers of District Boards to keep in touch with public opinion in regard to the District Board Administration, the Government consider it necessary to constitute Advisory Committees to advise the Special Officers of District Boards in regard to the discharge of the functions of the District Boards. They have accordingly decided that Advisory Committees be constituted for a period up to the 10th December 1956 to advise the Special Officers of the District Boards, and issue the following orders in regard to the constitution, function and meetings of Advisory Committees :—

CONSTITUTION

2. The advisory Committee shall consist of :—

(i) One Harijan;

(ii) one Woman;

(iii) three Presidents of Panchayats in District, and

(iv) all the ex-presidents of District Board.

The Committee will be so constituted that no taluk in the district will go unrepresented on it. Orders constituting the Advisory Committees on the above lines will issue separately.

FUNCTIONS

3. The functions of the Committee shall be purely advisory, it being open to the Special Officer to decline to carry out any advice tendered by the Committee which he finds impracticable, inexpedient or inadvisable for any reason.

The budget and administration report of the District Board shall be placed before the Committee and its resolutions forwarded to the Government with his remarks by the Special Officer and Collector, through the Inspector-General of Local Administration.

### MEETINGS

4. The Committee shall meet once in two months unless there is no business to transact.

If any member fails to attend three consecutive meetings of the Committee, he shall forfeit his membership.

The Members of the Committee shall be entitled to travelling allowance as if they were members of a second class Committee at the rates given below —

(i) *for railway journeys* — Single II Class fare plus *daily* allowance of Rs 6/-.

(ii) *for journeys by road*.— Mileage of six annas.

(By order of the Governor)

*APPENDIX IV*

VIDE ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION No 200 at Page 234 supra

ABSTRACT

Anti-Untouchability grants 1954—'55

| S. No | DISTRICT | Number of grants S. Cs, | B Cs, | F Cs, | TOTAL |
|---|---|---|---|---|---|
| 1. | Srikakulam District | 4 | 7 | — | 11 |
| 2. | Visakhapatnam Dt | — | 2 | — | 2 |
| 3 | East Godavari Dt. | 36 | 14 | 6 | 56 |
| 4 | West Godavari Dt | 39 | 17 | 8 | 64 |
| 5 | Krishna District | 46 | 29 | 16 | 91 |
| 6 | Guntur District | 83 | 43 | 13 | 139 |
| 7 | Anantapur District | 3 | 23 | 32 | 58 |
| 8. | Cuddapah District | 12 | — | 8 | 20 |
| 9 | Chittoor District | — | 39 | 23 | 62 |
| 10. | Nellore District | 33 | 132 | 30 | 195 |
| 11. | Kurnool District | 29 | 35 | 126 | 190 |
| | | 285 | 341 | 262 | 888 |

DETILED LIST OF HOSTELS TO WHOM GRANTS UNDER ANTI-UNTOUCHABILITY SCHEME HAVE BEEN SANCTIONED.

*During 1954-'55*

| S No. | Name of the Hostel. | Number of Grants Sanctioned: Sche-duled Castes | Back-ward Classes | For-ward Classes | Total | Amount |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| | *Srikakulam District.* | | | | | |
| 1. | Hill Tribes Hostel Srikakulam. | 4 | — | — | 4 | 600 |
| 2. | Gandhi Deenabandhu, Ashram, Amadalavalasa | — | 7 | — | 7 | 1050 |
| | | 4 | 7 | — | 11 | 1650 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| *Visakhapatnam District* | | | | | | |
| 1. | Harijan Boys Hostel, Vijayanagaram | — | 2 | — | 2 | 300 |
| | | — | 2 | — | 2 | 300 |
| *East Godavari District* | | | | | | |
| 1 | Gowthama Harijan and Backward Class Andhra Balura Vasathi Gruham Rajahmundry | 5 | 8 | 5 | 18 | 2700 |
| 2. | Harijan Boys Hostel Pithapuram | 1 | 1 | 1 | 3 | 450 |
| 3 | Jawaharlal Harijan Girls Hostel, Razole | 3 | — | 1 [III quarter] | 3=60 | 450 60 |
| 4. | Gandhi Memorial Arundathi Hostel, Biccavole | 3 | — | — | 3 | 450 |
| 5. | Bapuji B C. Hostel, Manepalli | 2 | — | — | 2 | 300 |
| 6 | Adi Andhra Girls Hostel, Ramachandrapuram | 7 | — | — | 7 | 1050 |
| 7 | Samaraka Harijan Hostel Tuni | 5 | 1 | — | 6 | 900 |
| 8. | Arundhathi Hostel, Mandapeta | — | 1 | — | 1 | 150 |
| 9. | Bapuji Arundhathi hostel [Bankpet] Kakinada | — | 1 | — | 1 | 150 |
| 10. | Gandhi Poor B C Boarding and lodging Home, Razole | 7 | — | — | 7 | 1050 |
| 11. | Gowthama Harijan Hostel Kakinada | — | 1 | — | 1 | 150 |
| 12 | Harijan Boys and Girls Hostel [H SS ] Kakinada | 3 | — | — | 3 | 450 |
| 13. | Undru Tataiah Memorial Hostel for Boys and Girls Nagaram | — | 1 | — | 1 | 150 |
| | | 36 | 14 | 6 | 56+60 | Rs8460 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| *West Godavarı District.* | | | | | | |
| 1 | Geda Garatayya Board High School Hostel, Koyyalagudem | 2 | 2 | 8 | 12 | 1800 |
| 2 | Harıjan Boys Hostel Narasapur | 3 | 1 | — | 4 | 600 |
| 3 | Harıjan Hostel and Srı K V K. Rao Jatıya Hostel Marutaır | 2 | 1 | — | 53 | 450 |
| 4 | Kasturıba Bandh Harıjan Gırls Hostel, Narasapur | 3 | — | — | 3 | 450 |
| 5 | M.V N Chowdry Harıjan and B C hostel, Dendulur | 10 | 2 | — | 12 | 1800 |
| 6 | Adıvasula Boys Hostel Dubacherla | 5 | — | — | 5 | 750 |
| 7 | Adıvasula Gırls Hostel Jangareddıgudem | — | 5 | — | 5 | 750 |
| 8 | Dhanvantrı B C Hostel Jınnur | 11 | — | — | 11 | 1650 |
| 9. | Harıjan Boys Hostel Jangareddıpalem | — | 1 | — | 1 | 150 |
| 10 | Harıjan Welfare Hostel Achanta | — | 4 | — | 4 | 600 |
| 11. | Magantı Annapurna Devı Smaraka Harıjan Gırls Hostel Achanta | — | 1 | — | 1 | 150 |
| 12. | Koya Gırls Hostel Polavaram | 3 | — | — | 3 | 450 |
| | | 39 | 17 | 8 | 64 | 9600 |
| *Krishna Dıstrict.* | | | | | | |
| 1 | Sabari B C Hostel Gudıvada | 10 | 1 | 1 | 12 | 1800 |
| 2 | Harıjan Boys Hostel Arundalpet Vıjayawada | — | 3 | 2 | 5 | 750 |
| 3. | Anjana Devi Adi Andhra Girls Hostel Vıjayawada | 5 | 4 | 13 | 22 | 3300 |
| 4. | Kasturıba Gırls Hostel Nandigama | 2 | 1 | — | 3 | 450 |
| 5. | Gandhı Smaraka Harıjan Hostel, Nuzvıd | 2 | 3 | — | 5 | 750 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| | *Krishna District (Contd.)* | | | | | |
| 6. | Gandhi Harijan Boys Hostel, Nandigama | 4 | 1 | — | 5 | 750 |
| 7. | Adivasula Boys Hostel, Vijayawada | — | 8 | — | 8 | 1200 |
| 8. | Yerukula Boys and Girls Hostel, Vijayawada | 5 | — | — | 5 | 750 |
| 9 | Sri Thakkar Baba Adivasi Hostel, Nandigama | 6 | — | — | 6 | 900 |
| 10 | Laxhmi B C. Girls Hostel, Gudivada | 5 | 3 | — | 8 | 1000 |
| 11. | Gowthama Budha B C. Hostel, Gudivada | 7 | — | — | 7 | 1050 |
| 12 | Harijan Girls Hostel and Harijan Vidyarthi Gruham, Gudivada | — | 1 | — | 1 | 150 |
| 13. | Harijan Boys Hostel, Tiruvur | — | 1 | — | 1 | 150 |
| 14. | Veeraraghava Harijan Boys Hostel, Kanumole | — | 2 | — | 2 | 300 |
| 15. | Mahathma Gandhi Boys Hostel, Vissannapeta | — | 1 | — | 1 | 150 |
| | | 46 | 29 | 16 | 91 | 13650 |
| | *Guntur District.* | | | | | |
| 1 | Sadhuvamma Sevasadan, Sathanapalli | 9 | 3 | 12 | 24 | 3600 |
| 2 | Inakkarababa Balika Vasathi Gruham, Ongole | 3 | — | 1 | 4 | 600 |
| 3. | Harijan Boys Hostel, Gurazala | 5 | — | — | 5 | 750 |
| 4. | Depressed Classes Hostel, Appikatla | 5 | 2 | — | 7 | 1050 |
| 5. | Prabhakara Poor Students Hostel, Pittalavaripalem | 4 | 1 | — | 5 | 750 |
| 6. | Harijan Boys Hostel, Santhanuthalapad | 5 | 2 | — | 7 | 1050 |
| 7. | Adimavasula Boys Hostel, Vinukonda | — | 7 | — | 7 | 1050 |
| 8. | Kasturiba Gandhi Andhra Saranalayam for Girls, Konetipuram | 4 | — | — | 4 | 600 |
| 9. | Chenchu & Harijan Boys Hostel, Macherla | 4 | — | — | 4 | 600 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| *Guntur District (Contd)* | | | | | | |
| 10 | Sri Sradhananda Harijan Colony, Tenali | 4 | — | — | 4 | 600 |
| 11 | Kamala Nehru Niketan, Tenali | 4 | 1 | — | 5 | 750 |
| 12 | Kasturimatha Harijan Balika Vasathi Gruham Repalli | 3 | 2 | — | 5 | 750 |
| 13 | Ambedkar Karuna Nilayam Konetipuram | 3 | — | — | 3 | 450 |
| 14 | Kasturiba Harijan Girls Hostel, Patchalatadiparru | 5 | — | — | 5 | 750 |
| 15 | Patel Adivasi Boys Hostel, Vetapalem | 1 | — | — | 1 | 150 |
| 16 | B C Hostel, Chinnaravur | — | 5 | — | 5 | 750 |
| 17. | Harijan Boys Hostel, Sathenapalli | — | 1 | — | 1 | 150 |
| 18. | Manavaseva Sangham Hostel, Kothapatnam | — | 2 | — | 2 | 300 |
| 19 | Bapuji Harijan Hostel, Mangalagiri | — | 1 | — | I | 150 |
| 20. | Yanadi Girls Hostel, Ongole | 3 | — | — | 3 | 450 |
| 21. | Yenadi Boys Hostel, Ongole | 1 | — | — | 1 | 150 |
| 22. | Harijan Hostel, Ongole | — | 1 | — | 1 | 150 |
| 23. | Yenadi Girls Hostel, Guntur | 2 | — | — | 2 | 300 |
| 24. | Yenadi Boys Hostel, Guntur | 3 | — | — | 3 | 450 |
| 25. | Srimathi Kamala Devi Andhra Saranalayam for Girls, Repalli | — | 2 | — | 2 | 300 |
| 26 | Kamala Nehru Adivasi Girls Hostel, Bapatla | 2 | — | — | 2 | 300 |
| 27. | Takkar Baba Adivasi Boys Hostel Bapatla | 5 | — | — | 5 | 750 |
| 28 | Hanumandoss College Boys Hostel, Guntur | — | 1 | — | 1 | 150 |
| 29. | Yerukula Boys Hostel, Chirala | — | 4 | — | 4 | 600 |
| 30. | Sugali Girls Hostel, Karampudi | — | 4 | — | 4 | 600 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| | *Guntur District (Contd)* | | | | | |
| 31 | Yerukula Girls Hostel, Vetlapalem | 2 | — | — | 2 | 300 |
| 32. | Andhra Poor Boys Hostel, Guntur | 2 | — | — | 2 | 300 |
| 33 | Parameswaran Destitutes Hostel for Boys, Chirala | 4 | — | — | 4 | 600 |
| 34. | Suriah Doss Hostel for Boys Nidubrole | — | 4 | — | 4 | 600 |
| | | 83 | 43 | 13 | 139 | 20850 |
| | *Anantapur District.* | | | | | |
| 1 | Sri Vemana Student Home Kadiri | — | 12 | 1 | 13 | 1950 |
| 2. | V S. V. S Hostel Anantapur | — | — | 11 | 11 | 1650 |
| 3. | Seva Mandir | — | 7 | 20 | 27 | 4050 |
| 4. | Thakkar baba Adivasi Hostel, Kalayanadrug. | 3 | — | — | 3 | 450 |
| 5. | Kamala Memorial Boys and Girls Hostel, Bukkapatnam | — | 4 | — | 4 | 600 |
| | | 3 | 23 | 32 | 58 | 8700 |
| | *Cuddapah District :* | | | | | |
| 1. | Silas Orphanage Janamalamadugu | 3 | — | 2 | 5 | 750 |
| 2 | Harijan Hostel Rayachoti | 3 | — | 1 | 4 | 600 |
| 3. | Seva Sadan Harijan Girls Hostel Proddatur | 3 | — | 1 | 4 | 600 |
| 4 | Kasturiba Girls Hostel Cuddapah | 3 | — | — | 3 | 450 |
| 5. | Harijan Boys Hostel Nandalur | — | — | 3 | 3 | 450 |
| 6. | Rajaji Harijan Boys Hostel Kodur | — | — | 1 | 1 | 150 |
| | | 12 | — | 8 | 20 | 3000 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| *Chittoor District* | | | | | | |
| 1. | Aided Higher Elementary School Boarding Home, Kattekindapalli | — | 3 | 2 | 5 | 750 |
| 2. | Poor Boys Home [Jeevakarunya Sangham] Chittoor | — | 12 | 11 | 23 | 3450 |
| 3. | Mahatma Gandhi Vidyarthi Bhavan Madanapalli | — | 2 | 1 | 3 | 450 |
| 4. | Poor Boys Relief Hostel, Vayalpad | — | 8 | 2 | 10 | 1500 |
| 5. | Sherman Memorial Girls Boarding Home, Chitoor | — | 1 | 5 | 6 | 900 |
| 6. | Sri Pullamaraji Charities Trust Boarding Home, Jagannadapuram | — | — | 2 | 2 | 300 |
| 7. | Poor Boys Home, Pileru | — | 13 | — | 13 | 1950 |
| | | — | 39 | 23 | 62 | 9300 |
| *Nellore District* | | | | | | |
| 1. | Harijan Girls Hostel, Nellore | — | 5 | — | 5 | 750 |
| 2. | Nellore Orphanage Association, Nellore | — | 22 | — | 22 | 3300 |
| 3. | Harijan Boys Hostel, Nellore | 4 | 26 | 23 | 53 | 7950 |
| 4. | Harijan Boys Hostel, Kandukur | — | 1 | — | 1 | 150 |
| 5. | Gandhi Harijan Hostel, Gudur | — | 5 | — | 5 | 750 |
| 6. | Harijan Boys Hostel, Buchireddipalem | 4 | 8 | — | 12 | 1800 |
| 7. | Harijan Boys Hostel, Vakadu | — | 14 | 5 | 19 | 2850 |
| 8. | Harijan Girls Hostel, | 2 | 3 | — | 5 | 750 |
| 9. | Harijan Boys Hostel, Chinacherukur | 5 | 24 | — | 29 | 4350 |
| 10. | Harijan Girls Hostel, Chinacherukur | 5 | 3 | — | 8 | 1200 |
| 1. | Harijan Boys Hostel, Kota | 5 | 5 | — | 10 | 1500 |
| 12. | Harijan Hostel, Kovvur | — | 1 | — | 1 | 150 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| | *Nellore District (Contd)* | | | | | |
| 13. | Harijan Hostel, Siddapuram | — | 6 | — | 6 | 900 |
| 14. | Harijan Boys Hostel, Udeyagiri | — | 2 | — | 2 | 300 |
| 15. | Harijan Boys Hostel, Kanigiri | — | 5 | 2 | 7 | 1050 |
| 16. | Sarovodaya Harijan Hostel, Thorulupad | — | 2 | — | 2 | 300 |
| 17. | Harijan Hostel, Sulurpet | 5 | — | — | 5 | 750 |
| 18 | Harijan Hostel, Atmakur | 3 | — | — | 3 | 450 |
| | | 33 | 132 | 30 | 195 | 29250 |
| | *Kurnool District .* | | | | | |
| 1. | Poor Boys Home, Nandikothur | 4 | — | 9 | 13 | 1950 |
| 2. | do. Koilkuntla | 5 | — | 31 | 36 | 5400 |
| 3. | do. Samjamala | 14 | — | 22 | 36 | 5400 |
| 4. | do Peopally | — | — | 21 | 21 | 3150 |
| 5. | do. Pathakonda | 3 | 4 | 12 | 19 | 2850 |
| 6. | do. Markapur | — | 14 | 8 | 22 | 3300 |
| 7. | do. Allegedda | — | 15 | 23 | 38 | 5700 |
| 8. | Harijan Girls Hostel, Atmakur | 3 | 2 | — | 5 | 750 |
| | | 29 | 35 | 126 | 190 | 28500 |

ABSTRACT 1955—'56

Anti-Untouchability Grants

| S. No. | District | Number of grants | | | Total |
|---|---|---|---|---|---|
| | | S. Cs., | B. Cs., | F. Cs , | |
| 1. | Cuddapah | 10 | 4 | — | 14 |
| 2. | Anantapur | 30 | — | — | 30 |
| 3. | Chittoor | 25 | 41 | 10 | 76 |
| 4. | Guntur | 117 | 63 | 37 | 217 |
| 5. | Nellore | 26 | 63 | 10 | 99 |
| 6. | Kurnool | 46 | 65 | 50 | 161 |
| 7. | West Godavari | 73 | 29 | — | 102 |
| 8. | Krishna | 55 | 21 | 4 | 80 |
| 9. | East Godavari | 35 | 39 | 3 | 77 |
| 10. | Visakhapatnam | 3 | 7 | — | 10 |
| | Total | 420 | 332 | 114 | 866 |

## CUDDAPAH DISTRICT

| S. No | Name of the Hostel | Anti untouchability grants | | |
|---|---|---|---|---|
| | | Scheduled Castes | Backward Classes | Forward Classes |
| 1 | Matha Kasturiba Harijan Girls Hostel, Cuddapah | 5 | – | – |
| 2 | Harijan Boys Hostel, Nandalur | 2 | 2 | – |
| 3. | Silas Orphanage, Jammalamadugu | 3 | 2 | – |
| | | 10 | 4 | – |

## ANANTAPUR DISTRICT

| S No. | Name of the Hostel | Anti untouchability grants | | |
|---|---|---|---|---|
| | | Scheduled Castes | Backward Classes | Forward Classes |
| 1. | Seva Mandir, Hindupur | 20 | – | – |
| 2. | Vemana Students Home Kadiri | 10 | – | – |
| | | 30 | – | – |

## CHITTOOR DISTRICT

| S No. | Name of the Hostel | Anti untouchability grants | | |
|---|---|---|---|---|
| | | Scheduled Castes | Backward Classes | Forward Classes |
| 1. | Aided Higher Elementary School Boarding Home, Kattikindapalli | 4 | 3 | – |
| 2 | Sherman Memorial Boarding Home, Chittoor | 1 | 4 | – |
| 3. | Poor Boys Home Topavaram, Chittoor | 2 | 14 | 9 |
| 4. | Poor Boys Relief Hostel, Voyalapad | 3 | 8 | 1 |
| 5. | Poor Boys Hostel, Piler | 4 | 10 | – |
| 6. | S. P. T. C Boarding Home, Jagannadhapuram | 2 | 1 | – |
| 7. | Harijan Boys Home, Tirupathi | 9 | 1 | – |
| | | 25 | 41 | 10 |

